# నచ్చితే చాలు! ఓకే!

## -అనుపమ పరమేశ్వరన్

**అనుపమ పరమేశ్వరన్‌ని చూస్తుంటే మలయాళీ ముద్దుగుమ్మలా అనిపించదు. మన పక్కింటి అమ్మాయిలాగానో, మన ఇంటి ఆడపడుచుగానో అనిపిస్తుంది. ఇప్పటి వరకూ పద్ధతిగానే కనిపించిన అనుపమకు పారితోషికం కన్నా పాత్ర ప్రాధాన్యమే ముఖ్యమంటోంది. మలయాళీ అమ్మాయినే అయినా ఇప్పుడు తెలుగమ్మాయినే అయిపోయాను అంటున్న అనుపమతో....**



**కెరీర్ ప్రారంభంలోనే చిన్న పాత్రలు చేయడానికి కారణం?**

కారణం అంటూ ఏమీ లేదు. పాత్రలు నచ్చాయి, చేశాను. 'శతమానం భవతి'లో పూర్తి స్థాయి హీరోయిన్ క్యారెక్టర్ చేశాను కదా! పాత్ర నచ్చితే రెండు నిమిషాలు కనిపించే క్యారెక్టర్ చేయడానికి అయినా రెడీ

**ఇప్పటి వరకూ పద్ధతిగానే కనిపించారు కదా? గ్లామర్‌గా కనిపించే ఉద్దేశం ఉందా లేదా?**

చిట్టిపొట్టి దుస్తులు వేసుకుని అంగాంగ ప్రదర్శన చేస్తూ అదే గ్లామర్ అనుకోవడం పిచ్చితనం. చీర, లంగా ఓణీ, చుడీదార్... వీటిల్లో కూడా గ్లామర్‌గా కనిపించవచ్చు. అది చూసే కళ్ళను బట్టి ఉంటుందే తప్ప డ్రస్సులో ఉండదని నా అభిప్రాయం. క్యారెక్టర్ బాగా నచ్చితే వాటి గురించి అప్పుడు ఆలోచిస్తాను.

**మోడ్రన్ డ్రస్సులంటే ఇష్టం లేదా?**

బయట ఎక్కువగా జీన్స్ టీ షర్టుల్లోనే కనిపిస్తాను. అంతకు మించి మోడ్రన్ డ్రస్సులంటే కొంచెం కష్టమే!

**మలయాళీ అమ్మాయి అయినా తెలుగుకే ఎక్కువ ఇంపార్టెన్స్ ఇవ్వడానికి కారణం?**

రెమ్యునరేషన్ మాత్రం కాదు. నాకన్నా ముందు చాలా మంది కేరళ అమ్మాయిలు ఇక్కడకు వచ్చి తమను తాము నిరూపించుకున్నారు. వారందరూ డబ్బు కోసం వచ్చిన వారు కాదు. అయినా తెలుగు ప్రేక్షకులు మమ్మల్ని పరభాషా నాయికలుగా ఎప్పుడూ చూడలేదు. ఇక మేం తెలుగును ఎందుకు పరభాష అనుకోవాలి? దక్షిణాదిలో మిగతా భాషల కన్నా తెలుగులో హీరోయిన్లకు గౌరవం ఎక్కువ ఉంటుంది. హీరోయిన్ల కోసం మంచి మంచి పాత్రలను సృష్టిస్తున్నారు. పరభాషా నాయికలు టాలీవుడ్ బాట పట్టడానికి ఇదే ప్రధాన కారణం.

**ఎన్టీఆర్‌తో ఛాన్స్ మిస్సయింది అంటున్నారు నిజమేనా?**

అది పూర్తిగా అబద్ధం. ఆ సినిమా గురించి నన్నెవరూ అడగలేదు. ఈ వార్త ఎవరు పుట్టించారో, ఎలా బయటకు వచ్చిందో నాకు తెలియదు. భవిష్యత్తులో అలాంటి అవకాశం వస్తే మాత్రం వదులుకోను.

**మీరు పనిచేసిన దర్శకుల గురించి...**

త్రివిక్రమ్ గారితో 'అ ఆ' ఒప్పుకున్న సమయంలో తెలుగు గురించి అస్సలు ఏమీ తెలియదు. మొదటి సినిమానే నెగెటివ్ షేడ్స్ ఉన్న పాత్ర అంటే కొద్దిగా భయపడ్డాను. ఆ పాత్రతో నాకు మంచి పేరు వస్తుందని అనిపించి ధైర్యం చేశాను. నా గెస్ తప్పు కాలేదు. ఆ సినిమా నాకు మంచి పేరు తీసుకొచ్చింది. చందూమోడేటి గారితో చేయడం కష్టం అనిపించలేదు. బహుశా మలయాళం 'ప్రేమమ్'లో చేసిన పాత్రే తెలుగులో చేయడం వలన ఈజీ అనిపించింది. 'శతమానం భవతి' కోసం సతీష్ వేగ్నేశ్ గారితో 50 రోజులు వర్క్ చేశాను. ఆయన చాలా కూల్ పర్సన్. కోపం ఆయనలో నాకు ఎప్పుడూ కనపడలేదు. ఆర్టిస్టులు ఎన్ని టేకులు తీసుకున్నా విసుక్కోరు. నా అదృష్టం కొద్దీ నేను తెలుగులో మూడు సినిమాల్లో మంచి దర్శకుల దగ్గర పనిచేశాను. నా కెరీర్‌కు ఇది ప్లస్ పాయింట్.

**రామ్‌చరణ్‌తో చేసే అవకాశం ఎందుకు మిస్ అయింది?**

కొన్ని ప్రశ్నలకు సమాధానాలు ఉండవు. ఆ అవకాశం చేజారిపోయింది. అంత మాత్రాన ఆ యూనిట్ చెడ్డదని చెప్పను. అందరూ మంచి వాళ్ళే. వాళ్ళతో చేసే ఛాన్స్ మిస్ అవడం నా దురదృష్టం. భవిష్యత్తులో వాళ్ళతో చేసే ఛాన్స్ వస్తుందని నా నమ్మకం.

**లైఫ్ పార్టనర్ గురించి...**

నేను చాలా చిన్నదాన్ని. లైఫ్ పార్టనర్ గురించి ఆలోచించడానికి ఏడెనిమిదేళ్ళ సమయం ఉంది. అప్పటికి నా అభిప్రాయాలు మారతాయేమో చెప్పలేను. అప్పటి నా ఆలోచనలకు అనుగుణంగా నా లైఫ్ పార్టనర్‌ని సెలక్ట్ చేసుకుంటాను.

**తెలుగులో సినిమాలు చేస్తున్నారా?**

డిస్కషన్స్ జరుగుతున్నాయి. వేటికీ ఓకే చెప్పలేదు. త్వరలోనే తెలుగులో మరో రెండు సినిమాలు చేసే అవకాశం ఉంది. వాటి వివరాలు తరువాత చెబుతాను.

**కోలీవుడ్, మాలీవుడ్‌లలో చేస్తున్నారా?**

అవి కూడా సేమ్ పొజిషన్. అన్ని వివరాలూ త్వరలోనే చెబుతాను.

–భరత్ కుమార్

## సరదాగా....

### మిస్సింగ్

రఘురాం దీనంగా ఇంటిముందు కూర్చున్నాడు. ఆ దారిన పోతున్న శ్రీధర్, ఏరా రఘు డల్‌గా ఉన్నావు? అని అడిగాడు.

**రఘురాం:** నా కొడుకు మూడు నెలల నుంచి స్కూల్ కి వెళ్లట్లేదురా...

**శ్రీధర్:** రెండు తగిలించకపోయావా!!!

**రఘురాం:** ఎంత కొట్టినా వేస్ట్ రా.. తప్పు నా కొడుకుది కాదు.

**శ్రీధర్:** మరి ఎవరిది? అసలేం జరిగింది?

**రఘురాం:** మూడు నెలల క్రితం మావాడు తప్పిపోయాడురా... స్మార్ట్ ఫోన్ ఉంది కదా అని వెంటనే ఫేస్‌బుక్ వాట్సాప్‌లో నా కొడుకు మిస్సింగ్ అని వాడి ఫోటో, మా ఇంటి అడ్రస్సు పెట్టాను.

**శ్రీధర్:** దొరికాడా?

**రఘురాం:** అరగంటలో దొరికిపోయాడు.

**శ్రీధర్:** మరింకేం, హ్యాపీయే కదా!

**రఘురాం**: ఏం హ్యాపీరా బాబూ.. నేను పంపిన మిస్సింగ్ మెసేజ్‌ని ఇంకా అందరూ ఫార్వర్డ్ చేసుకుంటూనే ఉన్నారు. ఆ రోజు నుంచి నా కొడుకు స్కూల్‌కి బయలుదేరి వెళ్ళిన అరగంటలోపే ఎవడో ఒకడు వాడిని ఇంట్లో పడేసి పోతున్నాడు అంటూ ఏడవడం మొదలెట్టాడు.

### ఒక ప్రశ్న?

కవిత ఓ ప్రైవేటు బ్యాంకులో క్లర్కుగా పని చేస్తోంది. రోజూలాగే ఆ రోజు కూడా బ్యాంకుకు వెళ్ళి తన పనులు చూసుకోసాగింది. ఇంతలోనే సెక్యూరిటీని కొట్టి, ఆయుధాలతో లోపలికి అడుగుపెట్టారు నలుగురు దొంగలు. అందరినీ గన్స్‌తో బెదిరించి, మూటలు సర్దుకోసాగారు. ఇంతలో కవిత టేబుల్‌పై ఉన్న ఫోన్ గణగణమంటూ మోతలు చేసింది. దొంగలు ఒకరిముఖాలు ఒకరు చూసుకుని, కవితను ఇక్కడి పరిస్థితి చెప్పకుండా ఫోన్లో మాట్లాడమని చెప్పారు. దాంతో కవిత ఫోన్ రిసీవర్ తీసింది. అవతల వేరే బ్రాంచ్ మేనేజర్ లైన్లో ఉన్నాడు. 'సర్ ఏదయినా ఎమర్జెన్సీనా! ఓ పది నిమిషాలాగి మళ్ళీ కాల్ చేస్తాను సర్! అకౌంట్స్‌లో ఏదయినా ప్రాబ్లముంటే, తప్పకుండా నా హెల్ప్ ఉంటుంది సర్!' అని మాట్లాడి పెట్టేసింది. మరో పది నిమిషాల్లో పోలీసులు బ్యాంకులోకి ఎంటర్ అయ్యారు. బ్యాంకులోకి దొంగలు జొరబడ్డారని పోలీసులకు ఎలా తెలిసింది?

**సమాధానం**

కవిత చాలా తెలివిగా ప్రవర్తించి, పక్క బ్రాంచ్ మేనేజర్‌తో మాట్లాడేటప్పుడు ఫోన్ మ్యూట్‌లో పెట్టి, కేవలం ఎమర్జెన్సీ, కాల్, హెల్ప్ అనే మాటలు వచ్చినప్పుడు మాత్రం మ్యూట్ తీసేసింది. దాంతో ఆ మేనేజర్ ఇచ్చిన ఇన్ఫర్మేషన్‌తో పోలీసులు రంగప్రవేశం చేసి దొంగలను పట్టుకున్నారు.

## తీన్ మార్

మీరాఫీసు కెళ్ళాక నాకొక్కసారి కూడా పొలమారలేదు.. అంటే నన్నసలు మీరు తలుచుకోలేదన్నమాట అవున్లెండి... పెళ్ళాం ఎందుకు గుర్తుంటుంది!?

నేను రోడ్డు ఆక్రమించి బిల్డింగ్ కట్టాననట... వాళ్ళే నాయింట్లో ఈ బోర్డు పెట్టుకున్నారు!!

NO PARKING

ఆయన ఆరోగ్యం ప్రక్కన పెట్టండి డాక్టరు గారూ.. ఏది ఏమైనా 48 రోజులు గడిస్తే గానీ మీ ఫీజు మేమిచ్చుకోలేవండీ!!



8

## నిదురా రావమ్మా రావే!

ఈ ఆధునిక కాలంలో తిండి కొరత, నీటి కొరత లానే 'నిద్ర కొరత' కూడా పెరిగిపోతోంది. . మనిషి సగటు నిద్ర వేళలు తగ్గిపోయాయి. నిద్రే అతిపెద్ద సమస్యగా మారింది. **మార్చి 17 వరల్డ్ స్లీప్ డే** సందర్భంగా సుఖ నిద్రకు ఏం చేయాలో తెలుసుకోండి.

50

### మీరు కాని మీరు

ప్రపంచంలో మనిషిని పోలిన మనుషులు ఏడుగురు ఉంటారంటారు. అలా కాకపోయినా కనీసం ఇద్దరైనా గ్యారంటీగా ఉంటారట.. అదేంటో చదవండి

66

### నవగ్రహపురాణం ఆంగ్లానువాదం పుస్తకావిష్కరణ

నవ్య వీక్లీలో ప్రచురితమైన నవగ్రహ పురాణం సీరియల్ ఇప్పుడు ఆంగ్లభాషలో పుస్తకంగా వెలువడి ప్రపంచ పాఠకులకు చేరువైంది.. ఆ పుస్తకావిష్కరణ సభ విశేషాలు.

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: శ్రుతిహాసన్
ఫొటో: గోపీకృష్ణ


**రచనలు, కథలు పంపవలసిన చిరునామా**
నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. **email: navyaweekly@andhrajyothy.com**





## నిజం

'ఇదిగో, సిగరెట్లు కొనుక్కుని ఇప్పుడే వస్తాను.' అంటూ ఇంటినుంచి బయటపడ్డాడు రామారావు. రాత్రి పదకొండు అయిందప్పుడు. పాన్‌షాపులన్నీ మూసేశారు. సిగరెట్లు కావాలంటే తప్పదు, బార్‌కి వెళ్ళాల్సిందే అనుకున్నాడు. బార్‌కి చేరుకున్నాడు. సిగరెట్లతో పాటు మూడు బీర్లు తాగాడు. ఇంటిదారి పట్టాడు. దారిలో గర్ల్‌ఫ్రెండ్ కనిపించింది. సెకెండ్‌షో సినిమానుంచి వస్తోందామె. కబుర్లలో పడ్డారిద్దరూ. కబుర్లాడుకుంటూ ఆమె ఇంటికి చేరుకున్నారు. ఆనందించారు. పడుకున్నారు. మెలకువ వచ్చింది రామారావుకి. టైం చూశాడు. మూడు అయిందప్పుడు. అమ్మో! అనుకున్నాడు. ఇల్లు, భార్య, సిగరెట్లు కొనుక్కుని వస్తానని చెప్పడం అన్నీ గుర్తుకొచ్చాయి. వెంటనే ఇంటికి చేరుకోవాలి. లేకపోతే లేనిపోని అనుమానాలూ, గొడవలూ అని దిగ్గున లేచి నిలబడ్డాడు.

రామారావు అలా లేచి నిలబడడంతో గర్ల్‌ఫ్రెండ్‌కి కూడ మెలకువ వచ్చింది. లేచి కంగారు పడుతున్న రామారావుని చూసింది. 'ఇదిగో టాల్కం పౌడర్ ఉంటే కొంచెం చేతిలో వెయ్యి' అడిగాడు. తెచ్చి వేసిందామె. చేతులికి పౌడర్ పులుముకుని, 'వస్తాను' అని ఇంటికి చేరుకున్నాడు రామారావు. అప్పటి వరకూ మెలకువగానే ఉంది భార్య. అయిపోయాననుకున్నాడు. 'సిగరెట్లకని అప్పుడనగా వెళ్ళి, ఇప్పుడా రావడం?' గట్టిగా అడిగింది భార్య. 'నిజం చెప్పండి, ఎక్కడికి వెళ్ళారు?' నిలదీసింది. 'సిగరెట్లకనే వెళ్ళాను, పాన్‌షాపులు మూసేయడంతో, వాటికోసం బార్‌కి వెళ్ళక తప్పలేదు. బార్‌కి వెళ్ళిన తర్వాత సిగరెట్లతో పాటు మూడు బీర్లు తాగాను. ఇంటికి వస్తోంటే నా గర్ల్‌ఫ్రెండ్ కనిపించింది. వాళ్ళింటికి తీసుకెళ్ళింది. ఇంత వరకూ అక్కడే ఉన్నాను.' నిజం చెప్పాడు రామారావు.

'ఏదీ, చేతులు చూపించండి?' అడిగింది భార్య. పౌడర్ పులుముకున్న చేతులు చూపించాడు రామారావు. 'అన్నీ అబద్ధాలే! క్లబ్‌లో ఇంతవరకూ కారమ్స్ ఆడి వచ్చి, కథలు చెబుతారా, బలేవారే.' అని రామారావుని లోపలికి లాగి తలుపు మూసింది భార్య.

## పదకొండోవ్యక్తి

**ముం**పు ప్రాంతం నుంచి బాధితులను రక్షించేందుకు హెలికాప్టర్ నుంచి తాడు జారవిడిచారు. ఓ మహిళసహా పదిమంది పురుషులు పట్టుకున్నారు దాన్ని. వారందరితో హెలికాప్టర్ ప్రయాణిస్తోంది. అయితే పదిమంది మించి తాడును పట్టుకుంటే అది తెగిపోతుంది. పదిమంది క్షేమంగా ఉండాలంటే పదకొండో వ్యక్తి ఎవరో ఒకరు తాడు వదిలేయాలి. ఎవరు వదిలేస్తారు? ప్రాణాలు చేజేతులా ఎవరు తీసుకుంటారు. అందుకు సిద్ధంగా లేరెవరూ. అప్పుడు పాపం జాలి దలచి, మహిళే అన్నదిలా.

"తాడు నేను వదిలేస్తాను. నా భర్తకీ, నా బిడ్డలకీ నేను చెయ్యాల్సింది చేశాను. ఇవ్వాల్సింది ఇచ్చాను. నేనిక ఉన్నా, పోయినా ఒకటే! మీ మగాళ్ళు మాత్రం నిండునూరేళ్ళు బతకండి."

ఆమె మాటలకి మగాళ్ళు విస్తుపోయారు. హర్షాతిరేకం వ్యక్తం చేస్తూ చప్పట్లు కొట్టకుండా ఉండలేకపోయారు. ఒక్కసారిగా చప్పట్లు చరిచారంతా.

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

# నవ్య

సంపుటి: 14 సంచిక: 3

22-3-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



## మొదటి పేజీ

### గార్డ్

పనిముట్లను సంచిలో వేసుకుని, భుజానికి తగిలించుకుంది పార్వతి. గొడుగుని చేత్తో పట్టుకుంది. డ్యూటీకి బయల్దేరింది. అగ్రహారం నుంచి అచ్యుతాపురం వరకు ఏడుకిలోమీటర్ల మేర రైలుపట్టాలను అణువణువూ పరిశీలించాలామె. గార్డుగా అది ఆమె డ్యూటీ! పట్టాలమధ్య ప్రయాణం సాగించింది. అంతా అడవిప్రాంతం. క్రూరమృగాలూ, ఉద్యమకారులూ తిరుగాడే ప్రాంతం. మృగాలతో భయం లేదు. పట్టాలకు హాని చెయ్యవు. కనిపిస్తే, కేకలేస్తే, రాళ్ళు విసిరికొడితే పారిపోతాయి. ఉద్యమకారులు పారిపోరు. పైగా కేకలేస్తే ఎంతకైనా తెగిస్తారు. అయినా గత పదేళ్ళుగా ధైర్యంగా డ్యూటీ నిర్వహిస్తూ ఉంది పార్వతి. పట్టాల మీద రాళ్ళు పెడితే తొలగిస్తోంది. వదులైన నట్లనూ బోల్టులనూ బిగిస్తోంది. అటూ ఇటూ రోజూ పద్నాలుగు కిలోమీటర్లు పట్టాల మధ్య నడచి నడచి ఏ చీకటివేళో ఇంటికి చేరుకుంటుంది. క్షేమంగా ఇంటికి చేరుకుంటే పండుగే! తాత పెట్టిన భిక్ష ఈ ఉద్యోగం. తొలిరోజుల్లో తాతయ్య చేశాడు ఈ పని. తర్వాత తండ్రి చేశాడు. తండ్రి పోవడంతో పార్వతికి దక్కింది. ఇద్దరు తమ్ముళ్ళూ, అమ్మనీ పోషించుకోవాలంటే ఈ ఉద్యోగం తప్పనిసరి.

వర్షం జల్లుగా కురవసాగింది. గొడుగు వేసుకుంది పార్వతి. వర్షం పుంజుకుంటే ప్రమాదమే! కొద్దిదూరంలో ఏరొకటి ఉంది. దాన్నంతా దొంగేరు అంటారు. ఎప్పుడు పొంగుతుందో ఏమో! అంతుచిక్కదు. అది పొంగిందంటే వచ్చీ పోయే రైళ్ళకు ఇబ్బంది అనుకుంది. జల్లులో ఎవరో నలుగురైదుగురు పట్టాల మీద కూర్చుని కబుర్లాడుకుంటున్నారు. ఉద్యమకారులేమో! నిల్చున్న చోటు నుంచే కేకేయ సాగింది పార్వతి. ఎవరది? ఏం చేస్తున్నారక్కడ? అటునుంచి సమాధానం లేదు. భయపడింది పార్వతి. అయినా తప్పదు, గొడుగు మడచి, పరుగందుకుంది. వచ్చి చూస్తే కాలేజీపిల్లలు. సిగరెట్లు తాగుతూ కబుర్లాడుకుంటున్నారు. నవ్వుకుంటున్నారు. పట్టాల మీద కూర్చుని పకపకలేంటి? పొండిక్కణ్ణుంచి కసిరింది. అక్కణ్ణుంచి వాళ్ళు కదిలేవరకూ ఒప్పుకోలేదు. వాళ్ళటు వెళ్ళగానే పట్టాలను పరిశీలించి, ఏం లేదు, ఏం కాలేదనుకుంది. ఊపిరి తీసుకుంది. అచ్యుతాపురం రైలుగేటు దగ్గరకి చేరుకుంది. గేటుకీపర్ సత్యం రారా! అని క్యాబిన్‌లోకి పిలిచాడు. తాగేందుకు నీళ్ళందించాడు. నీళ్ళు తాగి, గోడకి చేరబడింది పార్వతి. క్యారేజీ తెచ్చుకున్నావా? అడిగాడు. తెచ్చుకున్నానన్నదామె. సంచిలోంచి క్యారేజీ తీసి, తినసాగింది. ఏదో కూరా అన్నం, పొడి పొడిగా ఉంది. మాయమ్మ సేపలపులుసు ఇచ్చింది, పెట్టనా అడిగాడు సత్యం. వద్దంది పార్వతి. మొమాటపడింది. ఇదిగో! ఈ మొమాటమే నిన్నిలా సేసింది. ముప్పయి అయిదేళ్ళు. ఏం బావుకున్నావు? ఇంతవరకూ పెళ్ళీ లేదు, పెటాకులూ లేదు అన్నాడు సత్యం. నేను పెళ్ళి సేసుకుంటే పాపం! అమ్మా తమ్ముళ్ళూ ఏం కావాలి? అడిగింది. ఏఁవవుతారు? ఎత్తి కుదేస్తే ఏడుసెక్కలవుతారు. నా మాటినే! పెళ్ళి సేసుకో! నీ సుఖం నువ్వు సూసుకో అన్నాడు సత్యం. నవ్వి ఊరుకుంది పార్వతి.



నడచి నడచి అలసిపోయి ఉందేమో! ఆపై భోజనం చేసిందేమో! మగత కమ్మింది పార్వతికి. కళ్ళు మూసుకుంది ఓ క్షణం. అంతలోనే అగ్రహారానికి చేరుకోవాలని బయల్దేరింది. సన్నగా జల్లు కురుస్తూనే ఉంది. కొద్దిదూరం వచ్చిందో లేదో ఎవరో అనుసరిస్తున్నట్టనిపించి వెనక్కి తిరిగి చూసింది. పండుగాడు! బాగా తాగి ఉన్నాడు. పార్వతీ పార్వతీ అంటూ మీద పడబోయాడు. సంపేత్తాను తాగుబోతెదవా! పో అంది పార్వతి. అయినా వినక చేతులు చాస్తే గొడుగుతో రెండిచ్చింది. నిజంగానే సంపేత్తావేటే అడిగాడు పండుగాడు. సంపను, సరిజేస్తాను, నా పనే అది అంది పార్వతి. అడ్డంగా నిల్చున్న పండుగాణ్ణి పక్కకి తోసేసి, ముందుకు నడిచింది. దొంగేరు దగ్గరకి వచ్చింది. ప్రవాహాన్ని పట్టి పట్టి చూసింది. ఏరు పొంగే అవకాశం లేదు. ప్రమాదం లేదనుకుంది. అంతలో ఎవరో అమ్మాయి, అబ్బాయి అటుగా పరుగెత్తి రావడాన్ని చూసింది. నిల్చుంది అక్కడే! దగ్గరగా వచ్చిన వాళ్ళని ఎక్కడకి? అని అడిగింది. సరదాగా ఏరు చూద్దామని అన్నాడు అబ్బాయి. ఏరేం సూస్తావు, ఎళ్ళెళ్ళు అంది. వినక అమ్మాయిని తీసుకుని వెళ్తోంటే పోల్చిందప్పుడు. ఆ అమ్మాయి అగ్రహారం పంతులుగారమ్మాయి. జరగరానిది జరిగితే... పాపం పంతులుగారి పరువేంగాను? అనుకుంది. కేకేసింది అమ్మాయిని. నువ్వు పంతులుగారి అమ్మాయివి కదూ అడిగింది. పద అంది. వెంటబెట్టుకుని ముందుకు నడిచింది. అబ్బాయి అడ్డుకోబోయాడు. సంపేత్తా అంది పార్వతి. కట్ట మీది రాళ్ళు తీసుకుని, విసిరికొట్టి తరిమిందతన్ని.

పట్టాలనే కాదు, ప్రయాణికులనే కాదు, తననీ, తనవాళ్ళనీ, అగ్రహారాన్నీ అణువణువూ కాపాడుకుంటూ వస్తోంది పార్వతి. కొందరంతే! కాపలాకి, కాపాడడానికే పుడతారు.

నవ్య




## చెత్త వేయండి. గిఫ్ట్ పట్టండి

రోడ్ల పైన చెత్త వేయకుండా, ఒక మెషిన్‌లో వేస్తే మీకు పిజ్జా ఆఫర్లు ఇస్తాం.. రీచార్జ్ కూపన్లు ఇస్తాం.. సినిమా టికెట్స్ ఇస్తాం.. అంటే ఎలా వుంటుంది? ఖాళీ బాటిల్ ఇచ్చేస్తే పిజ్జా వస్తోందంటే, చిప్స్ రేపర్ పడేస్తే రీచార్జ్ కూపన్ వస్తోందంటే, ఎవరు మాత్రం కాదంటారు చెప్పండి. కాకపోతే ఎక్కడపడితే అక్కడ కాదు.. వాళ్లు ఏర్పాటు చేసిన వెండింగ్ మెషిన్‌లోనే వేయాలి. అదీ కండీషన్. దాని పేరు వియ్ కన్వర్ట్. దీన్ని ఏర్పాటు చేసింది ఢిల్లీకి చెందిన అశుతోష్, ప్రణవ్ అనే ఇద్దరు విద్యార్థులు.

మెషిన్‌లో ఎవరేం వేశారు.. ఎవరికేం కూపన్ ఇవ్వాలి అనేది నిర్ణయించడానికి ఒక పద్ధతి ఉంది. ఉదాహరణకు కోక్ తాగి ఖాళీ టిన్ మెషిన్‌లో వేశారనుకోండి. దానికి సంబంధిత బటన్‌ను ప్రెస్ చేయాలి. వెంటనే మెషిన్ బాటిల్‌ని స్కాన్ చేసుకుంటుంది.. అది ఎలాంటి బాటిల్ అని డిసైడ్ చేసుకుంటుంది. దాన్ని బట్టి ఒక ఆటోమేటిక్ ఐదంకెల కోడ్ డిస్‌ప్లే అవుతుంది. ఆ కోడ్




మొబైల్‌లో టైప్ చేసి కాల్ చేయగానే వెంటనే మొబైల్‌కి ఎస్సెమ్మెస్ వస్తుంది. ఫలానా పిజ్జా షాపులో మీకు ఇన్ని పాయింట్లు అలాట్ చేస్తున్నాం.. అవసరముంటే రీడీమ్ చేసుకోండి అని మెసేజ్ వస్తుంది. ఇదీ దాని కాన్సెప్ట్. ఒక పక్క స్వచ్ఛ భారత్ లాంటి కార్యక్రమాలు జరుగుతుంటే.. ఇంకో పక్క బొత్తిగా సామాజిక స్పృహ మరిచిపోయి చాలామంది చెత్తను ఎక్కడపడితే అక్కడ వేస్తున్నారు. దీన్నెలాగైనా మార్చాలని భావించి వారిద్దరూ 2015లో ఈ వెండింగ్ మెషిన్‌ను ప్రారంభించారు.

ఆ చెత్తనంతా దగ్గరలో ఉన్న రీసైక్లింగ్ యూనిట్స్‌కి పంపిస్తారు. దాంతో పాటు వోచర్ ఆఫర్ కోసం సుమారు 50 కంపెనీలతో డీల్ సెట్ చేసుకున్నారు. ఈ మిషన్ల వల్ల వియ్ కన్వర్ట్ స్టార్టప్ నెలకు రెండు లక్షలకు పైనే రెవెన్యూ నమోదు చేస్తోంది. ప్రస్తుతం ఢిల్లీకి మాత్రమే పరిమితమైన ఈ మిషన్లు త్వరలో హైదరాబాద్, ముంబై, పుణె, బెంగళూరు వంటి నగరాల్లోకి రానున్నాయి.

# మెయిల్ బాక్స్

### ఫీచర్స్ ఆకట్టుకున్నాయి

ఈ వారం ఫీచర్స్ ప్రత్యేకంగా ఆకట్టుకున్నాయి. రిలాక్స్‌తో రీచార్జ్, డబ్బింగ్ జానకి ఇంటర్వ్యూ, టీనేజ్ ట్యూన్స్ ఫీచర్లు, మా అభిమాన రచయిత జగన్నాథశర్మగారు, వినోదినిలకు సన్మానసభ విశేషాలు మేమే పాల్గొన్నంత హాయిగా ఉన్నాయి. ఆ సభలో ప్రముఖుల అభిప్రాయాలు హైలైట్.

—ప్రసాద్, గొడారిగుంట

### సామాన్య విషయం కాదు

చైనా సామాజిక కార్యకర్త పదహారేళ్ళు పోరాడి కార్పొరేట్ సంస్థపై విజయం సాధించడం సామాన్య విషయం కాదు. బాహుబలి, మిథునం, శతమానం భవతి వంటి విభిన్న తరహా చిత్రాలు మరిన్ని రావాలన్న వరలక్ష్మి అభిలాష అభినందనీయం. సహస్ర చంద్రోదయాలు చూసిన తెలుగు టాకీ ఎన్నో చీకట్లు కూడా చూసింది. ఈ విషయంపై 'సిరి' వెన్నెల కురిపించాడు!

—వాస్తు రామచంద్ర, నెల్లూరు

### నిండైన ముఖచిత్రం

శ్రుతిహాసన్ అందమైన ముఖచిత్రం నిండుదనాన్నిచ్చింది. మార్నింగ్ కాఫీ, మొదటిపేజీ మాకు కావల్సినంత మానసికోల్లాసమిచ్చాయి. జ్యోతి ఎక్కడ? కథను విహారి రసవంతంగా నడిపించారు. మధుబాబు వెట్టి సీరియల్ సస్పెన్స్‌తో కొనసాగుతోంది. ప్రభావతి కథ అమ్మ ఒడి మనస్సును కదిలించింది. శశికళ తొందరపాటు తనాన్ని చక్కగా వివరించారు. కోట శ్రీనివాసరావు జీవితకథ ఆసక్తికరం. ఇవన్నీ నిజాలే, పదగారడీ ముందుగా చదవించేలా రసభరితంగా ఉంటున్నాయి.

—డాక్టర్ శివభూషణ, కర్నూలు

### హరివంశం అనితర సాధ్యం

హరివంశం ఒక మహా గ్రంథం. అందులో పాత్రలు కోకొల్లలు. వాటిని గుర్తుపెట్టుకోవడం అనితర సాధ్యం. మాకు తెలియని గొప్ప గొప్ప విషయాలు తెలియజేస్తున్నందుకు ధన్యవాదాలు.




ఇటీవల నవ్య సంచికలు ఎంతో సర్వాంగ సుందరంగా కొత్త గెటప్‌లో వినూత్న సోయగాలతో వస్తూ మాకెంతో తృప్తి కలుగజేస్తోంది. తెలుగు భాషాభివృద్ధికి ఎనలేని కృషి చేస్తున్నారు. కార్టూన్లు గిలిగింతలు పెడుతున్నాయి. 'సినీవాలి' సినిమాగా రావాలి. టీనేజ్ ట్యూన్స్ విలువైన సమాచారమిస్తోంది.

—పక్కి బాలకృష్ణారావు, విజయనగరం

### చిన్న మాటతో విశాలప్రపంచాన్ని చూపే కథకుడు

రంగినేని ఎల్లమ్మ సాహిత్య పురస్కార గ్రహీతల సన్మాన సభ విశేషాలు మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకున్నాయి. ఆ సభలో మాడభూషి శ్రీధర్ దేన్నైనా ప్రశ్నించడం చాలా ముఖ్యం అనడం బాగుంది. స్టాలిన్ ఆశాభావం సముచితమే.

రంగినేని ఎల్లమ్మ పురస్కార గ్రహీతలు జగన్నాథశర్మగారు ఒక చిన్న మాటతో, వాక్యంతో విశాల ప్రపంచాన్ని చూపడం నేర్చిన కథకుడన్న వ్యాఖ్య అక్షర సత్యం. అందుకు మొదటిపేజీయే సాక్ష్యం.

—సాహిత్యదీప్తి, రమణయ్యపేట

—మాధవరపు కృష్ణ, కాకినాడ

## కథా రచయితలకు నాటక రచన పోటీలు

కథా రచయితలకు నాటక పోటీలు నిర్వహిస్తున్నారు. . గుంటూరుకు చెందిన 'సంస్కృతి' (సంగీత, సాహిత్య, నృత్య, నాటక సంస్థ) ఈ పోటీలు నిర్వహిస్తోంది.

కథా రచయితలుగా గుర్తింపు పొందిన వారు మాత్రమే ఈ నాటక రచన పోటీల్లో పాల్గొనేందుకు అర్హులు. గుర్తింపు పొందిన తెలుగు దిన, వార, మాస పత్రికల్లో వారు రాసిన కనీసం పది కథలు ప్రచురితమై ఉండాలి. ఆ వివరాలు కూడా జతపరచాలి.

నాటక రచనకు తెలుగువారి జీవితమే ఇతివృత్తంగా, ప్రదర్శనయోగ్యంగా ఉండి గంటా 45 నిమిషాల ప్రదర్శనకాలానికి తగ్గకుండా రచనలు చేయాలి. రాత ప్రతులు స్వీకరించరు. ఒకవైపే డిటిపి చేయాలి. అనువాదాలు, అనుసరణలు స్వీకరించరు. సంగీత, నాట్య, జానపద కళలు కూడా ప్రదర్శనలో ప్రయోగించే వీలున్న రచనకు ప్రాధాన్యం ఉంటుంది.

మొదటి బహుమతి 40 వేలు, రెండవ, మూడవ బహుమతులు 25 వేలు, 15 వేల రూపాయలు వంతున విజేతలకు అందజేస్తారు. నూతన ఇతివృత్తాలు, సామాజికాంశాలతో రాసే కథా రచయితలు వారి కథల్ని వారే నాటకాలుగా మార్చమని సంస్కృతి సంస్థ వ్యవస్థాపకులు యస్.బాలచందర్ ఒక ప్రకటనలో కోరారు. 14వ అడ్డరోడ్, బ్రాడీపేట, పెట్రోలు బంక్ ఎదురుగా, కేరాఫ్ సర్వేయర్స్ అసోసియేషన్ బిల్డింగ్, గుంటూరు - 4 చిరునామాకు రచయితలు ఆగస్టు 31, 2017వ తేదీ లోపు రచనలు పంపించాలి.

సెల్ నెంబర్: **98 48 96 88 89**

## క్రమశిక్షణా లోపం

టీనేజర్లు క్రమశిక్షణ అలవర్చుకోలేక పోవటానికి కారణాలు అనేకం ఉంటాయి. వీటిల్లో ముఖ్యంగా రెండింటిని ప్రధానంగా చెప్పుకోవచ్చు. బాల్యంలో తల్లిదండ్రులు అతి గారాబం చేసి చెడగొట్టటం కావచ్చు లేక తల్లిదండ్రులకే నియంత్రణశక్తి లేక పోవడంవల్ల, ఆదర్శంగా ఉండాలని కన్నబిడ్డలకు చెప్పలేకపోటమూ కారణం కావచ్చు. చాలామంది తల్లి దండ్రులు 'బాల్యదశలో ఉన్నప్పుడే కట్టుదిట్టంలో పెంచినట్లయితే ఇప్పుడిలా తయారయ్యేవాడు కాదు' అని చెప్పుకోవడం వింటూవుంటాం. 'మొక్కై వంగనిది మానై వంగుతుందా' అనే సామెత ఇలాంటి సందర్భంలోంచి పుట్టిందే. ఇవన్నీ క్రమశిక్ష ణకు సంబంధించినవే. క్రమశిక్షణ లేకపోడం ఒకెత్త యితే ఒక్కోసారి మితిమీరిన క్రమశిక్షణ కూడా టీనేజర్లలో చెడునడతకు కారణంగా ఉంటూ ఉంటుంది.

బాల్యంలో పిల్లవాణ్ణి మితిమీరిన క్రమశిక్షణలో ఉంచడంవల్ల పెద్దయి కాస్త స్వేచ్ఛ లభించే సమ యానికి సంకెళ్లు తెంచుకుని రివోల్టయ్యే అవకాశం ఏర్పడుతుంది. బాల్యమంతా పిల్లాణ్ణి బొటనవేలు కింద నొక్కిపెట్టి తమ నిర్ణయాల్ని పిల్లలపై రుద్దడం వల్ల వారిలో ఆలోచించే జ్ఞానం తగ్గిపోతుంది. పెద్ద య్యాక స్వంత నిర్ణయం తీసుకునే శక్తిసామర్థ్యాలు కొరవడతాయి. దానివల్ల కాలేజీ జీవితంలో ప్రవేశిం చినా కూడా ఈత రానివాడు సముద్రంలో గిలగిల లాడినట్టు ఉక్కిరిబిక్కిరై పోతాడు. ఇలాంటి కుర్రవాళ్లల్లో సంకల్పం, వ్యక్తిత్వం రెండూ లోపించి తమకు దొరి కిన స్వేచ్ఛ, స్వాతంత్ర్యం ఎలా ఉపయోగించుకో వాలో తెలియక వ్యతిరేక ఫలితాలు పొందుతారు. అంతకు మునుపు తల్లిదండ్రులు తమ నిర్ణయాన్ని రుద్దినట్లుగానే ఇప్పుడు తోటి సహచరులు తమ నిర్ణయాల్ని అతని మీద రుద్దుతుంటారు.

## భద్రతాభావం కల్పించాలి



*బాల్యంలో పిల్లలకు భద్రతాభావంతో కూడిన ప్రేమ లభిస్తే భవిష్యత్తులో పిల్లవాడు సమ ర్థంగా, ఆత్మవిశ్వాసంతో జీవితాన్ని ఎదుర్కో గలుగుతాడు. భద్రతా వాతావరణంలో పిల్ల వాడు సాహస ప్రయోగాలు చేయగలుగు తాడు. తద్వారా జీవితానికి అనుగుణంగా తన నుతాను తీర్చిదిద్దుకునే గుణం పెంపొందించు కుంటాడు. భద్రతాపూర్వకమైన ప్రేమ దొరికిన పిల్లలు ఇతరులతో ప్రేమ పూర్వకంగా ఉంటారు, అందరితో కలుపుగోలుగా ఉంటారు.*

## అభద్రతా భావం

మనుషులలో మనోవ్యాకులత అనే అవలక్షణం ఎప్పుడూ ఉంటుంది. దీనివల్ల ఎప్పుడూ టెన్షన్, ఆదుర్దా, ఆందోళనతో ఉంటారు. ఈ న్యూరోసిస్‌కి మూలకారణం భద్రతారాహిత్యం! పసిప్రాయంలో తల్లి అందించే ప్రేమ మీదే పిల్లల భద్రతాభావం ఆధారపడి ఉంటుంది. పిల్లలతో తల్లి అంటీముట్ట నట్టు ప్రవర్తిస్తే, తిరస్కారానికి గురవుతున్నామనే భావం పిల్లల్లో కలుగుతుంది. దాంతో బిడ్డ భద్రతకు సంబం ధించిన భయాందోళనకు లోనవుతాడు. తల్లిప్రేమ ద్వారా లభించే భద్రతాభావం నిస్సహాయులైన పసి పిల్లలమీద ఎంతో ప్రభావం చూపిస్తుంది.

'నీకు నేనున్నాను' అనే భద్రతా భావం తల్లి దగ్గర నుంచి పిల్లవాడికి దొరకనప్పుడు అతనిలో భద్రతా భావం లోపిస్తుంది. పెద్దయ్యాక జీవితాన్ని ఆత్మ విశ్వాసంతో ఎదుర్కోలేడు. నిరాశావాదం, ఆందోళన, బిడియం లాంటివి అతణ్ణి చుట్టుముడతాయి. అందరితో కలుపు గోలుగా ఉండలేడు. ఇతరుల్ని ప్రేమించలేడు. తనను తాను ప్రేమించుకోవడంలోనే మునిగిపోయి ఒంటరిగా మిగిలిపోతాడు. జీవితంలో అతనికి ఇవన్నీ నష్టాన్ని కలుగజేసే అంశాలు. తల్లిదండ్రుల నుంచి ప్రేమ లభించని పిల్లలు నానారకాలుగా ప్రతిస్పందించే అవకాశం ఉంది. భయాందోళనలకు గురికావచ్చు. వైరాగ్యానికి లోనుకావచ్చు. చెల్లెలు లేక తమ్ముడు పుట్టడం మూలంగా తల్లి ప్రేమకు దూరమై నట్టు భావిస్తే మనస్సులో కోపం, ఈర్ష్య పెరిగి, వాటిని ఇతరుల మీద ప్రదర్శిస్తారు. లేకపోతే ఇతరుల నుంచి జాలి పొందే ప్రయత్నం చేస్తారు.

వారి ప్రేమ పొందేందుకు కొన్ని స్వయం కల్పిత పనులను చేస్తారు. ఉదాహరణకు జ్వరం వచ్చి నప్పుడు తల్లిదండ్రులు అతిప్రేమ ప్రదర్శిస్తారు. ఇలాంటి ప్రేమకోసమే కోరి జ్వరం తెచ్చుకుంటారు. లేకపోతే ఒక దెబ్బ తగిలించుకుని తల్లిదండ్రుల నుంచి గారాబం చవిచూడాలని ప్రయత్నిస్తారు. ఇవన్నీ వాళ్ళు తెలిసి, కావాలని చేయరు. మనస్సు అసంకల్పితంగా స్పందించి శరీరం కూడా అలా స్పందించేలా చేస్తుంది. ఈ లక్షణాలన్నీ ప్రేమా దరణ లభించని పిల్లల్లో చోటుచేసుకోవడం సహజం. ముఖ్యంగా ఇద్దరు పిల్లలున్న ఇంట్లో ఈ లక్షణాలు ఎవరికైనా వచ్చే అవకాశాలు ఉంటాయి. తల్లిదం డ్రుల ప్రేమ సంపాదించడానికి కావాలని నొప్పి లేదా జ్వరం వచ్చిందని ఏడ్చినప్పుడు, తల్లిదం డ్రులు నొప్పీలేదు పాడూలేదు ఊరుకో అన్నారను కోండి, నిజంగానే తల్లిదండ్రులు తనను ప్రేమించడం లేదని మరింత బెంగపెట్టుకుంటాడు. అలా కాకుండా తల్లిదండ్రులు వెంటనే స్పందించి గారం ప్రదర్శించి బుజ్జగించారనుకోండి, అప్పుడా పిల్లాడు తల్లిదండ్రుల ప్రేమ సంపాదించడానికి నొప్పి లేదా జ్వరం ఏదో ఒకటి అవసరమని భావిస్తాడు. మనస్సు లోని ఆ భావం శరీరం మీద ప్రభావం చూపి స్తుంది. మాటిమాటికీ పిల్లవాడు అనారోగ్యానికి లోనయ్యేటట్లు చేస్తుంది.

అలాకాకుండా, పిల్లవాడు మాటిమాటికీ ఇలా ప్రవర్తించడానికి మూలకారణం ఏమిటో తెలుసు కుని తదనుగుణంగా పిల్లల్ని పెంచడం తల్లిదండ్రుల ప్రథమ కర్తవ్యం. అలా చేయనప్పుడు ఆ లక్షణాల్ని మనస్సులోనే వాళ్ళు అణిచిపెట్టుకుంటారు. టీనేజ్ లోనో ఆ తర్వాత బయటకు విరుచుకుపడి వికా రంగా ప్రవర్తించేట్లు చేస్తాయి. వీటి నుంచి ఎలా బయటపడొచ్చనేది ముందు ముందు చూద్దాం!

**—లతాకమలం**

lathakamalam@gmail.com

## నిలకడలేని స్వభావం



*టీనేజర్ల స్వభావంలో నిలకడ లేకపోవడానికి మరో కారణం లేత ప్రాయంలో వాళ్ళల్లో పేరుకు పోయే మనో సంక్లిష్టతలు!*

*బాల్యంలో ఏకారణం వల్లనైనా భయాలు, ఆందోళనలు లాంటి వాటిని అణచిపెడితే తాత్కాలికంగా అవి మనస్సు మూలలకు పోయి దాగి కూర్చుంటాయి. అయితే సమయం వచ్చి నప్పుడు మళ్ళీ బయటకి రావడానికి సిద్ధంగా కాచుకుని ఉంటాయి. రెండోకారణం, టీనేజర్లలో ఉరకలెత్తే బలీయమైన అంతర్గత ప్రేరణలు చాలా వరకు సెక్సు పరమైనవై ఉంటాయి. ఈ ప్రేరణలు బలపడే సమయానికి అంతకు ముందున్న కోరికలు, భయాలు, ఆందోళనలన్నిం టినీ అణిచిపెట్టిన శక్తి అంతా బలహీనపడు తుంది. ఏదైతే అదవుతుంది, ఏం చేస్తారువాళ్లు అనే ఒక నెగ్లిజెన్సీ ఏర్పడుతుంది. అదొక రకమైన గుండెధైర్యంగా కట్టలు తెంచుకుని బైటపడు తుంది. ఈ నెగ్లిజెన్సీ తాలూకూ గుండెధైర్యమే టీనేజ్ అవకతవకలకు మూలకారణం! అయితే టీనేజర్లందరికీ ఇది వర్తించదు. అస్తవ్యస్త ప్రవర్త నను ప్రదర్శించే టీనేజర్లలో మాత్రమే ఇది ఉంటుంది.*

# వెట్టి (ది వారియర్)

-మధుబాబు




**ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు ప్రణవి–ప్రత్యూష. ఇద్దరూ కలిసి శివారెడ్డి భార్యవైపు చూశారు. ఆమె ముఖంలో కూడా ప్రతిఫలిస్తోంది అపరిమితమైన ఆశ్చర్యం. 'అత్తమ్మా.. టాబ్లెట్టు వేసుకోవడం పూర్తి అయిందా?' పిచ్చమ్మిని అడిగింది, తన భావాలను కప్పి పెట్టుకోవటానికి ప్రయత్నిస్తూ.**

**'మాత్రని ఇటు ఇవ్వవే... ఎంతసేపు పట్టుకు కూర్చుంటావ్?' ప్రత్యూషని అడిగింది పిచ్చమ్మి.**

**'ఇస్తున్నానమ్మా... ఇస్తున్నా. ఇదిగో' అంటూ తెల్లగా ఉన్న ఒక చిన్న మాత్ర ఆమెకు అందించింది ప్రత్యూష.**

ఊపిరి బిగపట్టి చూస్తున్న సంపంగి తేలికగా గాలిని బయటికి వదిలింది, పెద్ద ప్రమాదం ఏదో తప్పిపోయినట్టు.

కనుచివరల నుంచి ప్రణవివైపు చూసింది ప్రత్యూష, పెదవుల మీదికి రాబోతున్న చిరునవ్వును చాలా బల వంతంగా బిగపట్టుకుంటూ.

'కన్ఫర్మ్ అయిపోయింది. తెల్లవారిన తర్వాత దానికి సర్వమంగళం పాడేయవలసిందే!' పళ్ళు బిగ పడుతూ అన్నది ప్రణవి.

'శాంతం తల్లీ... శాంతం. తొందరపడినందువల్ల ఎటువంటి ఉపయోగం ఉండదు. ఆత్రపడితే మంచి కంటే చెడు ఎక్కువగా జరుగుతుంది' చిన్నకంఠంతో ఆమెను హెచ్చరించాడు శంకరయ్య.

'అమ్మగారూ... నేను కిచెన్‌లోకి పోతున్నా..' శివా రెడ్డి భార్యకు చెప్పి వేగంగా ఆ గదిలో నుంచి బయ టికి వెళ్ళిపోయింది సంపంగి.

'బాజిరెడ్డి ఎందుకు అంత హడావుడిగా వెళ్ళిపోయి నట్టు? నీకేమైనా అర్థం అయిందా రాజీ?' తన భార్యను అడిగాడు శివారెడ్డి.

'మీరు, మీ బాజిరెడ్డి... ఎప్పుడు ఏం మాట్లాడతారో, ఏం చేస్తారో మీకూ తనకే తెలియాలి. ఇంటి గడపదాటి అవతలికి పోని, మాకు ఏం తెలుస్తాయి?' వ్యంగ్యంగా అంటూ పిచ్చమ్మి వైపు చూసింది ఆమె.

'మాత్ర వేసేసుకున్నాను పిల్లా... మంచినీళ్ళు కూడా తాగేశాను' తడుముకోకుండా చెప్పేసింది ఆమె.

'అయితే అందరూ హాల్లోకి నడవండి' ఆర్డర్ ఇచ్చింది శివారెడ్డి భార్య.

'అంత తొందర దేనికి? కాసేపు కూర్చోవచ్చు కదా?' వెంటనే అబ్జెక్ట్ చేశాడు శివారెడ్డి.

'మీరు టాబ్లెట్స్ వేసుకునే టైము అయింది సారూ... వేసుకున్న వెంటనే మత్తుమత్తుగా ఉంటుంది. వాళ్ళని వెళ్ళిపోనీయండి' వెంటనే తాను కూడా మాట్లాడింది హాస్పిటల్ నుంచి వచ్చిన నైట్ డ్యూటీ నర్సు.

ఒకరి తరువాత ఒకరుగా కుర్చీలో నుంచి లేచి, సరాసరి డైనింగ్ హాల్లోకి పోయారు అందరూ.

ప్రణవి తనవైపు చూడగానే వేగంగా పోయి, అక్కడి నుంచి కిచెన్‌లోకి పోయే ద్వారం దగ్గర నిలబడింది ప్రత్యూష.

'ఏంటిది? ఒకటే కంగారు... ఏమయింది?' తన

### జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. కారణాంతరాలవల్ల వెట్టిగా మారతాడు. తన పెత్తనాన్ని సవాలు చేసిన వెట్టిని అంతమొందించాలనుకుంటాడు బాజిరెడ్డి. వెట్టిని చౌడేశ్వరి ఆలయానికి వెళ్ళి రమ్మంటాడు. ఆలయంలో బసవప్పను, అతడి బృందాన్ని చావమోదుతాడు. పఠాన్‌కి ప్రణవినిచ్చి పెళ్ళి చేయడానికి తాంబూలాలు పుచ్చుకుంటారు. గుడిదగ్గర తారసపడిన వ్యక్తిని రాయుడిపల్లిలో దించి, అక్కడ చౌడేశ్వరికి జరిగిన అపచారమేమిటో తెలుసుకుంటాడు వెట్టి. డాక్టరు పిచ్చమ్మిని పరీక్షించి, మూడుమాత్రలిస్తాడు. అడ్డదారి గుండా కదిరి బయలుదేరిన వెట్టికి ఒక పొదలో చౌడేశ్వరి ఆత్మశిల కనిపిస్తుంది. దాంతోపాటు అడవిలో పఠాన్ తారసపడతాడు. యువకుడి ద్వారా సబ్బిరెడ్డిని రప్పించి, పఠాన్‌ను అరెస్ట్ చేయిస్తాడు. ఈలోపు బసవప్ప మనుషులు రాయుడిపల్లి వెళ్ళి, రవీంద్ర ఇంటిముందు వెట్టికోసం ఎదురు చూస్తూ, ఆ ఇంటిముందే బైఠాయిస్తారు . వెట్టి చౌడేశ్వరి గుడి దగ్గరికి చేరుకుని, పిచ్చిపూజారికి ఆత్మశిల గురించి చెప్పి, ఎవరికీ తెలియకుండా ఆ తల్లిని యథాస్థానంలో ఎలా ప్రతిష్ఠించాలో ఆలోచించమంటాడు. చింతలపల్లి నుంచి ఫోన్ రావడంతో శివారెడ్డి భవంతి నుంచి ఆదరాబాదరాగా బయలుదేరతాడు బాజిరెడ్డి.

ఆ తర్వాత...



భర్త దగ్గర్నుంచి వస్తూ ప్రణవిని అనునయంగా అడిగింది శివారెడ్డి భార్య.

'వదినా... ఆ సంపంగిని ప్రాణాలతో ఉంచకూడదు. గొంతు పిసికి ఏదైనా పాడుపడిన బావిలోకి నెట్టి పారేయవలసిందే' పళ్ళు బిగపడుతూ అన్నది ప్రణవి.

'శాంతం... శాంతం బిడ్డ... ఊరికే ఆవేశ పడకూడదు' అంటూ సముదాయించటానికి ప్రయత్నిస్తున్న శంకరయ్య వైపు మరింత అయోమయంగా చూసింది శివారెడ్డి భార్య.

'ప్రత్యూషా' పిలిచింది ప్రణవి.

తాము మాట్లాడుకుంటున్న మాటల్ని చాటుగా వినటానికి సంపంగి ప్రయత్నం చేయటం లేదని నిశ్చయపరుచుకుని, మూడు అంగల్లో అందరి ముందుకు వచ్చింది ప్రత్యూష.

అప్పటివరకూ తమ గుప్పిట్లో పెట్టి పట్టుకున్న టాబ్లెట్లను శివారెడ్డి భార్యకు చూపించింది.

'అవేకదా... అత్తమ్మకి డాక్టరుగారు ఇచ్చినవే కదా!' అయోమయంగానే అడిగింది ఆమె.

'అయ్యో... వదినమ్మా! డాక్టరుగారు ఇచ్చినవి పై కాయితాలు మాత్రమే, లోపల ఉన్నవి మాత్రం కాదు. అవి వట్టి తలనెప్పి మాత్రలు...' అంటూ పిచ్చమ్మి వేసుకోగా మిగిలిన రెండు టాబ్లెట్లను చూపించింది.

వాటి అంచులు చించి... మళ్ళీ నేర్పుగా అతికించి ఉండటాన్ని గమనించి గుండెల మీద చెయ్యి వేసుకున్నది శివారెడ్డి భార్య.

'దున్నపోతు మాదిరి ఇంటిచాకిరీ చేస్తోందని చెప్పి అడిగినంత జీతం ఇస్తున్నాను. తన కూతురు పెళ్ళి అంటే కట్నం డబ్బు మొత్తం నేనే ఇచ్చాను. అన్నీ మర్చిపోయి ఇంతటి ద్రోహం చేస్తుందా?' అంటూ కిచెన్‌వైపు తిరిగింది ఆమెను పిలవటానికి.

'తల్లీ... తొందరవద్దు. సంపంగి మీద అనుమానం వచ్చి మనం ముందుగానే జాగ్రత్తలు తీసుకున్నాము. తనకంటే ముందుగా ఆ కాయితాల్ని చింపి ఆ మాత్రల్ని వేరుచేశారు. మన వెనుకే వచ్చి తను మార్చినవి కూడా తలనెప్పి మాత్రలే' అన్నాడు శంకరయ్య.

'తను తప్పు చేసింది. క్షమించకూడని తప్పు. ఈ మాట ఆయనకి తెలిస్తే వసిక్రలతో ఒళ్ళు హూనం చేయించమని చెపుతారు' వేడిగా అన్నది శివారెడ్డి భార్య.

ఆ సంభాషణ మొదలుపెట్టిన ప్రణవి, తన మాటలకు వత్తాసు పలకకుండా ఎటో చూస్తూ ఉండడం కనిపించేసరికి బ్రేకు పడింది ఆమె వేగానికి.

'ఏంటి ప్రణవీ... ఏమయింది?' అని అడుగుతూ తను కూడా అటుకేసి చూసి, అప్రయత్నంగా గుండెల మీద చేయి వేసుకున్నది.

అందరితో పాటు చకచకా వచ్చింది అక్కడికి పిచ్చమ్మి. హ్యాపీగా కుర్చీలో సెటిల్ అయింది. అంతే. ఆ తరువాత తలను డైనింగ్ టేబిల్ మీద వాల్చి గాఢ నిద్రలో మునిగిపోయింది.

'ప్రత్యూషా... తీసుకుపోయి బెడ్‌రూమ్‌లో పడుకోబెట్టాలి, కమాన్' అంటూ ముందుకు అడుగు వేయబోయిన ప్రణవిని.. భుజం మీద చేయివేసి ఆపేసింది శివారెడ్డి భార్య.

'డాక్టరుగారు ఇచ్చిన మాత్ర బ్రహ్మాండంగా పని చేస్తున్నట్టు కనిపిస్తోంది.

ఇప్పుడు కదిలిస్తే నిద్ర చెడి లేనిపోని తలనొప్పులు మొదలుకావచ్చు. ఇక్కడే పడుకోనిద్దాము' అంటూ కిచెన్ వైపు తిరిగి 'సంపంగీ' అని పిలిచింది.

అటువంటి పిలుపు చెవులపడిన వెంటనే పరిగెత్తుకుంటూ రావాల్సిన సంపంగి, అప్పుడు మాత్రం అస్సలు ముఖం కూడా చూపించలేదు.

'ఏమయింది దీనికి? కళ్ళు నెత్తికి ఎక్కాయా? ఏమని అనుకుంటోంది తనని గురించి' కోపంగా అంటూ ఇంకో కేక పెట్టబోతుండగా, తల అడ్డం తిప్పి, కిచెన్ చివరి భాగంవైపు చేయి చూపించింది ప్రత్యూష. తనతో రమ్మనమని సైగచేసి, అటుకేసి కదిలింది.

అధికం అయిపోతున్న కోపాన్ని అతి బలవంతంగా అదుముకుంటూ ఆమెను అనుసరించింది శివా



**గాఢనిద్రలో ఉన్నాడు సబ్బిరెడ్డి. గురకలు తీస్తున్నాడు. పక్కనే ఉన్న ఒక గదిలో ఉన్నాడు పఠాన్. నేలమీద కూర్చొని కునికిపాట్లు పడుతున్నాడు. సబ్బిరెడ్డి... ఓయ్ సబ్బిరెడ్డీ... బాజిరెడ్డి అరుపులతో బయటకి వచ్చాడతను. పఠాన్‌ని వదిలిపెట్టమని, లేకపోతే పరిస్థితులు తీవ్రంగా ఉంటాయని హెచ్చరించాడు బాజిరెడ్డి. తోడుగా ఇద్దరు లాయర్లు కూడా ఉన్నారు. మరి సబ్బిరెడ్డి పఠాన్‌ని విడిచిపెట్టాడా? లేదా?**

రెడ్డి భార్య.

నూట యాభై అడుగుల దూరం పోయిన తర్వాత షార్ప్‌గా ఒక మలుపు తిరిగింది వారు అడుగుపెట్టిన కారిడార్ వంటి దారి.

కిచెన్‌కి దూరంగా ఉంటాయి వంట సామాన్లు నిలువచేసే స్టోర్ రూము వంటి గదులు. ఆ గదులకు ఆవల కనిపిస్తోంది ఆ భవంతి వెనుక భాగంలో ఉండే పెరటి తోట.

ఆ తోటలో ఉన్న ఒక కొబ్బరిచెట్టు కింద నిలబడి అతి రహస్యంగా తన ఫోన్లో ఎవరితోనో మాట్లాడుతూ కనిపించింది సంపంగి.

***

'అయ్యబాబోయ్... పఠాన్‌బాబును అరెస్టు చేశారా? సబ్బిరెడ్డి సారే స్వయంగా వచ్చి రెయిడింగు చేశాడా? నిజమేనా?' తన చెవుల్ని తానే నమ్మలేకపోతున్నట్టు అన్నది సంపంగి.

'నిజం కాకపోతే బాజిరెడ్డి సారును బలవంతంగా బయటికి రప్పించటం జరుగుతుందా? నువ్వో పెద్ద పిచ్చిమొఖానివి. ఇంతకీ అనుకున్న పని సజావుగా పూర్తి అయిందా?' అడిగింది అవతలి కంఠం.

'బాజిరెడ్డి సారు చెయ్యమన్నట్టుగానే చేసేశాను. నా దగ్గిర ఉన్న ఒళ్ళునెప్పుల మాత్రలు ఆ కాయితాల్లోకి నెట్టి, అన్నం మెతుకులతో గట్టిగా అంటించేశాను..' చెప్పింది సంపంగి.

'ఆ మాత్రలు ఏం చేశావు?' అడిగింది అవతలి కంఠం.

'ఏం చేస్తాను? మురుగు గుంటలోకి విసిరి కొట్టాను'.

'మంచి పని చేశావు. ఫోను పెట్టేసి, పోయి నీ పని చూసుకో' అంటూ కనెక్షన్‌ని కట్ చేసేసింది కాబోలు అవతలి కంఠం, తన ఫోన్‌ని జాకెట్‌లో భద్రపరుచుకుంటూ బిల్డింగ్ వైపు తిరిగింది సంపంగి.

లోగొంతుకతో ఆమె జరిపిన ఆ సంభాషణను ఆలకించటానికి ఎంతగా ప్రయత్నించినా, ఉపయోగం లేకపోవటంతో, వెంటనే వెనుతిరిగారు ప్రత్యూష, శివారెడ్డి భార్య. డైనింగ్ హాల్లోకి వచ్చి విశ్రాంతిగా నిలుచున్నారు.

'అమ్మా.. ఏమైనా తీసుకురమ్మంటారా?' మూడు నిమిషాల తర్వాత ద్వారం దగ్గరికి వచ్చి వినయాతి వినయంగా అడిగింది సంపంగి.

అప్రయత్నంగా డైనింగ్ టేబుల్‌మీద ఉన్న వాటర్ జగ్ మీద పడింది శివారెడ్డి భార్య చేయి.

'అది బాగానే ఉన్నది వదినమ్మా.. మార్చాల్సిన అవసరం లేనే లేదు' సడన్‌గా హెచ్చరించింది ప్రణవి.

సంపంగి తలకేసి గురిపెట్టి బలంగా విసిరేయాలన్నంత కోపంతో రగులుకుపోతున్నది శివారెడ్డి భార్య. ఆ మాటలతో చన్నీళ్ళు చిలకరించినట్టు చల్లారిపోయింది ఆమె కోపం.

'నిమ్మకాయ పిండిన మజ్జిగ ఏమైనా తీసుకు రమ్మంటారా?' చిటికెలో తనకు తప్పిపోయిన ప్రమాదం గురించి ఏమీ తెలియని సంపంగి, అమాయకంగా అడిగింది మరోసారి.

'మజ్జిగలు, టీలు ఏమీ వద్దుగాని, బాజిరెడ్డి అంత అర్జంటుగా చింతలపల్లి పోవాల్సిన కారణం ఏమిటో నీకేమైనా తెలిసిందా?' తియ్యగా అడిగింది ప్రత్యూష.

ఉలికిపడినట్లు ఒక అర అడుగు వెనక్కివేసి అంతలోనే తమాయించుకుంది సంపంగి.

'అటువంటివి నాకు ఎలా తెలుస్తాయి ప్రత్యూషమ్మ? మీకు తెలవనివి నాకు పొరపాటున కూడా తెలవ్వు. అందులోను బాజిరెడ్డి సారు మాటలు అస్సలు తెలవ్వు..' అంటూ అర్జంటు పని ఏదో అప్పుడే గుర్తుకు వచ్చినట్టు హడావుడిగా వెనక్కి వెళ్ళిపోయింది.

'నిజమే ప్రత్యూషా... ఎందుకు అంత అర్జంటుగా పరిగెత్తి ఉంటాడు?' ప్రత్యూషని అడిగింది శివారెడ్డి భార్య.

'ఇంకెందుకు? ఆ విఠల్‌బాబు మళ్ళీ ఏదో పెటకం పెట్టే ఉంటాడు. అందుకే పోయి ఉంటాడు' చెప్పింది ఆమె.

'ఈ విఠల్‌బాబు సంగతి నాకు కొంచెంగా కూడా అంతుపట్టడం లేదు. ఎప్పుడనగానో వచ్చేసి ఉండాలి. అమెరికా, ఐర్లాండుకో పోయినట్టు రోజులకు రోజులు కనిపించకుండా పోతున్నాడు' విసుగ్గా అన్నది శివారెడ్డి భార్య.

'ఆ మాట నేను అంటే మీరందరూ కలిసి బలవంతంగా నా నోరు మూయిస్తారు' మూతి ముచ్చటగా మూడు వంకరలు తిప్పుతూ అన్నది ప్రణవి. 'నన్ను అడిగితే అసలు మనం కూడా ఒకసారి ఆ గుడి దగ్గరికి పోయివస్తే ఎలా ఉంటుంది?'

వంద కాండిల్స్ బల్బు వెలిగినట్టు ఒక్కసారిగా ప్రకాశవంతమైంది ప్రత్యూష వదనం.. 'తెల్లారి వస్తానని చెప్పి ఇంటికి వెళ్ళారు రమణయ్యపంతులుగారు. కబురు చేసి పిలిపించనా?' అడిగింది కుతూహలంగా.

పెద్దగా నవ్వేసింది ప్రణవి. ఆమె నవ్విన కారణం తనకు తెలియకపోయినా, తను కూడా జత కలిపింది శివారెడ్డి భార్య.

ఒక్క శంకరయ్య ముఖం మాత్రం ఎలా ఉన్నది అలాగే ఉండిపోయింది. 'మీరు ఎందుకు నవ్వుతున్నారో నాకు అర్థం కాలేదు. చెపితే నేను కూడా నవ్వుతాను' అన్నాడు.

'నువ్వు నవ్వేందుకు ఇంకొంచెం టైము ఉంది బాబాయ్. ఇప్పటికి మేము నవ్వుకుంటుంటే చూసి సంతోషించు. రమణయ్యపంతులుగారికి ఫోన్ చేసి పిలువ్' అన్నది ప్రణవి.

ఆమె ఎటువంటి మాట మాట్లాడినా రెండో ఆలోచన లేకుండా తల ఊపవలసిన శంకరయ్య, అప్పుడు మాత్రం తల అడ్డం తిప్పాడు.

'విఠల్‌రెడ్డి విషయంలో మీరు మీ సొంత నిర్ణయాలు తీసుకోకండి. కాళ్ళు చేతులు కట్టి పడేసినట్టు రకరకాల ఇబ్బందుల్లో తలమునకలుగా ఉన్నాడు. అతను తిరిగివచ్చి జరిగింది ఏమిటో మనకు చెప్పేంత వరకూ గమ్మున కూర్చోండి' ఖచ్చితమైన కంఠంతో చెప్పాడు.

'ఏదో మాటవరసకు చెప్పినదాన్ని పట్టుకుని పెద్ద పెద్ద డైలాగులు వల్లించటం దేనికిలే బాబాయ్. విఠల్‌బాబు వచ్చిన తర్వాతనే గుడిదగ్గరికి పోయే విషయం గురించి ఆలోచిస్తాం,. నువ్వు ఆవేశపడకు' అంటూ ప్రత్యూష వైపు చూసింది ప్రణవి.

'తను వెళ్ళేటప్పుడు ఏదైనా ఫోను ఇచ్చి పంపించినట్లయితే చాలా బాగుండేది. మర్చిపోయాము' చిన్నగా నిట్టూరుస్తూ అన్నది ప్రత్యూష.

విఠల్‌బాబుని వదిలేయ్. ఈ వీరభోజుడి గురించి ఆలోచించు. ఏం జరిగి ఉంటుంది చింతలపల్లిలో?' తనలో తను అనుకుంటున్నట్టు పైకే అన్నది ప్రణవి.

ఏదో సమాధానం ఇవ్వటానికి నోరు తెరిచింది ప్రత్యూష. మాట బయటికి రాకముందే చిన్నగా వైబ్రేట్ అయింది ఆమె దగ్గర ఉన్న ఫోను.

'హల్లో... ఎవరూ?' తనకు తెలియని నంబర్ కని



పించటంతో ఆశ్చర్యంగా అడిగింది ఆమె.

'నేను హాస్పిటల్ నుంచి మాట్లాడుతున్నాను. డాక్టర్ గారిని... ప్రత్యూషేనా?' అడిగింది అవతలి కంఠం.

'అవును డాక్టరుగారూ! ప్రత్యూషనే మాట్లాడుతున్నాను. చెప్పండి' వెంటనే ఎలర్ట్ అవుతూ అన్నది ఆమె.

'అమ్మగారు ఎలా ఉన్నారు? టాబ్లెట్ వేసుకున్నారా?' అడిగాడు డాక్టరుగారు.

డైనింగ్ టేబుల్ మీద తల ఆనించి, అటూ ఇటూ కదలకుండా అలాగే నిద్రపోతున్న పిచ్చమ్మ వైపు చూస్తూ, ఆ విషయాన్ని ఆయనకి చెప్పింది ప్రత్యూష.

'ఒళ్ళు తెలియనంతగా నిద్రపోవటం అంటే ఆ మాత్ర అద్భుతంగా పనిచేస్తున్నట్టే లెక్క. సంతోషంగా ఉంది' అంటూ ఒక్క క్షణం ఆగి,

'ప్రత్యూషమ్మ... అక్కడ వదినమ్మ ఉన్నారా?' అడిగాడు ఆయన.

'ఒక్కక్షణం... ఫోను వదినమ్మకు ఇస్తున్నాను' అంటూ శివారెడ్డి భార్యకు ఫోను అందించింది ప్రత్యూష.

'చెప్పండి డాక్టరుగారు' అన్నది ఆమె.

'ఎవరో బళ్ళారివైపు నుంచి వచ్చిన గ్రానైట్ మైన్స్ వాళ్ళట. బసవప్ప అని వాళ్ళకి చాలా బాగా కావాల్సిన మనిషట.. చౌడేశ్వరిగుడి దగ్గర చావుదెబ్బలు తిన్నాడు. ఇంకా కోమాలోనే ఉన్నాడు. బాజిరెడ్డి జనంలో ఇద్దరి పరిస్థితి కూడా అదే మాదిరిగా ఉంది. మన హాస్పిటల్లోనే చేర్పించాడు బాజిరెడ్డి.'

'ఎప్పుడు? ఎప్పుడు జరిగింది ఇది?' ఆశ్చర్యంగా అడిగింది శివారెడ్డి భార్య. అంతలోనే వచ్చింది ఆమెకు ఒక అనుమానం.

ఉన్నవాడు ఉన్నట్టుగా పరుగుపరుగున పోయాడు బాజిరెడ్డి. అర్జంటు పని అన్నాడు. అది ఇదేనా?

'డాక్టరుగారూ..' అంటూ తన అనుమానం బయట పెట్టబోతుండగా, 'తల్లీ... మీరు నన్ను క్షమించాలి. ఇది జరిగి ఇరవై నాలుగు గంటలు అయింది. ఇవాళ ఉదయం మేము మీ దగ్గరికి వచ్చే సమయానికి వాళ్ళు హాస్పిటల్లో జాయిన్ అయి ఉన్నారు. అమ్మగారి మాటల్లో పడి మీకు చెప్పటం మర్చిపోయాను.' చిన్న కంఠంతో చెప్పాడు.

'మరేం ఫరవాలేదు. మేము ఏమీ అనుకోవటం లేదు. ఇంతకీ వాళ్ళ పరిస్థితి ఎలా ఉంది?' అడిగింది ఆమె.

'నమ్మకం లేదు తల్లీ. తెల్లారేసరికి తెలివి రాకపోతే కర్నూలుగాని, బెంగుళూరుగాని పంపించాలి. మనం ట్రీట్‌మెంట్ చేయలేం' అన్నాడు డాక్టరు.

'డాక్టరుగారూ, ఆ పని చేసింది ఎవరో బయటికి వచ్చిందా?' అడిగింది ఆమె.

'నేను ఫోను చేసింది అది చెప్పటానికే తల్లీ. ఇది మీ యంగ్‌మ్యాన్ చేసినట్టుగానే అనుకుంటున్నారు వాళ్ళు. అతన్ని పడగొట్టడానికి కొంతమంది జనం వెళ్ళటం కూడా జరిగింది' అంటూ రెండు క్షణాలు ఆగి, 'ఏ మాత్రం అవకాశం ఉన్నా ఆ యంగ్‌మ్యాన్‌కి కబురు అందించడం చాలా బాగుంటుంది తల్లీ. ఎదురు పడిన వెంటనే ఏదో ఒకటి చేసేస్తారని వినబడుతోంది' అన్నాడు డాక్టరు. అనటంతో ఆగలేదు 'ఉంటాను తల్లీ' అంటూ ఫోన్ పెట్టేశాడు.

## కొంప ముంచుతున్న అతి



*గత కొన్ని సంవత్సరాలుగా ప్రియమణికి సినిమాలే కరవయ్యాయి. కారణం సినిమాల ఎంపికలో ఆమె చేస్తున్న అతే అంటున్నారు సినీ జనాలు. ఏ సినిమా ఎవరితో చేయాలి? అన్న విషయంలో ప్రియమణికి క్లారిటీ లేదనీ, దాని వల్లే కొన్ని మంచి సినిమాలను కూడా మిస్ చేసుకుంటోందనీ చెబుతున్నారు. ఇటీవల అరవింద్ స్వామితో చేసే అవకాశం వచ్చినా దానికి 'నో' చెప్పిందనీ, ఈ పాత్ర సిమ్రాన్ చేతికి వెళ్ళింది అన్న సంగతి తెలిసిందే! ఈ సినిమాని ప్రియమణి ఎందుకు వదులుకుందో తెలియడం లేదని, ఈ పాత్ర చాలా పవర్‌ఫుల్ పాత్ర అని అంటున్నారు. అలాంటి పాత్రలను కూడా వదులుకొని 'మన ఊరి రామాయణం' వంటి సినిమాలు చేస్తూ ఉన్న పేరును కూడా పోగొట్టుకుంటోందని ఆమె సన్నిహితులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.*

'ఏమిటి వదినమ్మా? ఏమిటి సంగతి?' కుతూహలంగా అడిగింది ప్రణవి.

'విఠల్‌బాబు ఇంకోసారి బాజిరెడ్డి జనాన్ని చితక్కొట్టేశాడు. ఆ తర్వాత ఇంటికి రావటానికి వీలుపడక చింతలపల్లిలోనే ఆగిపోయి ఉంటాడు. ఎక్కడ ఉన్నాడో తెలిసి ఉంటుంది. బాజిరెడ్డి పరిగెత్తింది అందుకే అయి ఉంటుంది' చెప్పింది ఆమె.

చిన్నబోయింది ప్రణవి మొఖం. ప్రత్యూష కాటుక కళ్ళు తడి అయినాయి.

శ్రద్ధగా వింటున్న శంకరయ్య మాత్రం చాలా తేలికగా నాలుక చప్పరించేశాడు. 'విఠల్‌బాబు తెలివి తక్కువవాడు కాదు. ఈ మట్టిమొఖాల చేతికి దొరికే అవకాశం లేదు. మీరెవ్వరూ కంగారు పడవలసిన అవసరం లేదు' అన్నాడు.

'అసలు అక్కడ ఏం జరుగుతోందో మనకి ఎలా తెలుస్తుంది?' ఉన్నట్లుండి అడిగింది ప్రణవి. అడగటంతో ఆగలేదు 'రమణయ్యపంతులుగారికి ఫోన్ చెయ్యి' అంటూ ప్రత్యూషకి చెప్పింది.

***

నడిరోడ్డు మీద నిలబడి ఉన్న బాజిరెడ్డి డ్రైవర్ ఉన్నట్లుండి రోడ్డు పక్కకు జంప్‌చేశాడు.

'ఎవడ్రా? ఎవడ్రా అంత స్పీడు? ఎవడ్రా నువ్వు?' కోపంగా అడుగుతూ కిందినుంచి ఒక రాయిని తీసుకుని ముందుకు విసరబోయాడు.

సుడిగాలి మాదిరి దూసుకు వస్తున్నది, అతన్ని భయపెట్టిన వెహికల్. అతను విసరబోతున్న రాయి గనుక తగిలితే కంట్రోల్ తప్పి రోడ్డు పక్కనే ఉన్న గోతిలోకి పల్టీ కొట్టేస్తుంది.

పల్టీ కొట్టించాలనే అనుకుంటూ రాయిని మరింత గట్టిగా పట్టుకున్నాడు అతను. అయితే అతను ఊహించినట్టు వేగంగా అవతలికి దూసుకుపోలేదు అది. కీచుధ్వనులు చేస్తూ అతనికి సమీపంలోనే ఆగింది.

స్వయంగా స్టీరింగ్ ముందు కూర్చుని ఉన్న ముఖాన్ని చూడగానే అదిరిపడి రాయిని కిందకు వదిలేశాడు డ్రైవర్.

'సారూ... మీరు? మీరేంటి ఈ టైములో..' దగ్గరికి పోతూ అడిగాడు.

'వాడేమైనా కనిపించాడా?' అడిగాడు బాజిరెడ్డి.

'కనిపిస్తే మేము ఇక్కడే ఎందుకు ఉంటాము సారూ... మీ దగ్గరికి వచ్చి ఉండేవాళ్ళం కదా' అన్నాడు అతను.

'ఏడిచారు... తినటం, పీకలదాకా తాగి తూలటం తప్ప మీకు ఏమీ చేతకాదు. వాడు మళ్ళా మనకి టోకరా ఇచ్చాడనే అనిపిస్తోంది. పదపద... మనం చింతలపల్లి పోయి వద్దాం' అన్నాడు బాజిరెడ్డి.

'చింతలపల్లికా? వాడు అక్కడ దిగుతున్నట్టు తెలిసిందా?' ఆశ్చర్యంగా అడిగాడు డ్రైవర్.

'వాడు కాదు... మన పఠాన్‌బాబు ఆ సబ్బిరెడ్డికి దొరికిపోయాట్ట. అదేమిటో వివరం తెలుసుకోవాలి' అంటూ స్టీరింగ్ ముందునుంచి జరిగాడు బాజిరెడ్డి.

క్షణం కూడా ఆలస్యం చేయకుండా తను వెహికల్‌లో కూర్చున్నాడు డ్రైవర్. యాక్సిలేటర్ అదిమి ముందుకు దూకించబోతుండగా వచ్చింది అనుమానం. వెనక్కి చూశాడు.

సీటు వెనక్కి వాలి కునికిపాట్లు పడుతున్నారు ఇద్దరు లాయర్లు.

'సబ్బిరెడ్డితో మాట్లాడి బెయిల్ తీసుకోవాలి. ఆలస్యం చేయకూడదు. ఆలస్యం చేస్తే మన ప్లానులన్నీ తల్లకిందులు అయిపోతాయ్" అన్నాడు అతని ఆలోచన ఏమిటో అర్థం చేసుకున్న బాజిరెడ్డి.

తల ఊపి బండి కదిలించాడు డ్రైవర్. అంతకు ముందు కంటే అధికం అయిపోయింది స్పీడు. అర్ధరాత్రి అనుకున్న సమయంలో చింతలపల్లి సెంటర్లో ఆగింది.

***

'సబ్బిరెడ్డి ఎక్కడ ఉంటాడో తెలుసుకో..' కారు దిగి ఒళ్ళు విరుచుకుంటూ చెప్పాడు బాజిరెడ్డి.

నిశ్శబ్దంతో నిండి ఉందా సెంటరు. ఒకటి రెండు

శునకాలు తప్ప మనిషి అనేవాడు ఎవడూ కనిపించడం లేదు.

తను కూడా కిందికి దిగి కనులు చిట్లిస్తూ చుట్టూ చూసిన డ్రైవర్‌కి ఒక చిన్న బడ్డీకొట్టు పక్కన అగుపించారు ఇద్దరు మనుషులు.

పెద్దపెద్ద అడుగులు వేస్తూ అక్కడికిపోయి వారిద్దరినీ మాట్లాడించటానికి ప్రయత్నం మొదలు పెడుతూ, కాళ్ళ కింద సడన్‌గా నిప్పులు ప్రత్యక్షం అయినట్టు అదిరిపడ్డాడు అతను.

'మీరా? ఇక్కడ ఉన్నారు?' తనకు తెలియకుండానే అన్నాడు.

'బాజిరెడ్డి డ్రైవర్ వచ్చాడప్పా... సిటీలో ఏదో జరిగింది..' వెనక్కిచూస్తూ అన్నాడు ఆ ఇద్దరిలో ఒకతను.

అంతే... బిలబిలమంటూ బడ్డీ వెనుకనుంచి వీధిలోకి వచ్చేశారు జనం. 'ఏంటప్పా.. ఏం జరిగింది? ఎలా ఉన్నాడు మా బసవప్ప?' అడుగుతూ డ్రైవర్ షర్టు పట్టుకున్నాడు వారి లీడర్.

తడబడిపోయాడు డ్రైవర్. 'చొక్కా వదలండి సారూ... నేను మీకోసం రాలేదు. మా సారుకి ఇక్కడ ఒక పని పడింది. అందుకు వచ్చాను' అన్నాడు, అతను వదలకపోయేసరికి, తానే వదిలించుకోవటానికి ప్రయత్నిస్తూ.

'ముందు మా మాటకు సమాధానం చెప్పు' మరింత మొండిగా అడిగాడు ఆ మనిషి.

'బసవప్ప బాగానే ఉన్నాడు. కళ్ళు తెరవలేదు గాని, కాళ్ళు కాస్తంత కదిలించాట్ట. తెల్లారేసరికి తేరుకోవచ్చని చెప్పాడు డాక్టరు' నోటికి వచ్చిన మాటల్ని గబగబా బయట పెట్టేశాడు డ్రైవర్.

'సరే సరే... ఏడి మీ సారు?' అని అడుగుతూ వీధి మధ్యలో ఆగి ఉన్న కారు దగ్గరికి బయలుదేరాడు లీడర్.

'ఇక్కడ సబ్బిరెడ్డి అని ఫారెస్టు డిపార్ట్‌మెంటు.. ఎక్కడ మకాం పెట్టాడో తెలుసా?' అడిగాడు అతనితో పాటు కదిలిన డ్రైవర్.

ఒక్క క్షణం ఆగి ఒక పెద్ద పెంకుటింటి వైపు చూపించాడు లీడర్. 'అడివిలో చందనం చెట్లు నరుకుతున్న వాళ్ళను పట్టుకుని తీసుకువచ్చారు. తెల్లారగానే హెడ్‌క్వార్టర్స్‌కి తీసుకు పోతారట' అని కూడా చెప్పాడు.

బాజిరెడ్డికి కూడా వినిపించాయి ఆ మాటలు. విసురుగా బయలుదేరాడు అతను ఆ ఇంటివైపు.

***

గాఢ నిద్రలో ఉన్నాడు సబ్బిరెడ్డి. మందపాటి మైనం పట్టాను కింద పరుచుకుని, తల కింద చేయి పెట్టుకుని, చిన్నగా గురకలు తీస్తున్నాడు.

నాలుగు అడుగుల దూరంలో ఉన్న ఒక గదిలో బంధించబడి ఉన్నారు చందనం చెట్లు నరికిన జనం. పఠాన్ కూడా వారితోపాటుగా కటికనేల మీద కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు.

'సబ్బిరెడ్డీ... ఓయ్ సబ్బిరెడ్డీ...' ఇంటి ముందుకు పోయి బిగ్గరగా అరిచాడు బాజిరెడ్డి.

'సారు మంచి నిద్రలో ఉన్నాడు. అరిచి గోల చేయకండి. తెల్లారిన తర్వాత వస్తే మాట్లాడుకోవచ్చు' అంటూ అతన్ని సమాధాన పరచటానికి ప్రయత్నించాడు కాపలా నిలబడిన ఫారెస్టు గార్డు.

'మా ఏరియాలోకి వచ్చి మాకే మాటలు చెప్పేటంత గొప్పవాళ్ళా మీరు? పిలువ్... బయటికి రమ్మని చెప్పు' విసురుగా అన్నాడు బాజిరెడ్డి.

'సారు బాగా టైర్ అయి ఉన్నారు. దయచేసి అరవకండి' వేడుకోలుగా చెప్పాడు ఆ గార్డు.

అతను అలా మెత్తగా మాట్లాడేసరికి మరింత అధికం అయిపోయింది బాజిరెడ్డి విసురు. 'ఓయ్ సబ్బిరెడ్డీ.. బయటికి రా.. వచ్చేయ్' ఉన్నట్టుండి అంతకు ముందు కంటే గొంతును పెంచి అరిచాడు.




ఉలిక్కిపడి కనులు తెరిచాడు సబ్బిరెడ్డి. ముఖం మీద వాలి రక్తాన్ని పీలుస్తున్న రెండు దోమల్ని అరచేత్తో ఎడాపెడా అవతలికి తరుముకుంటూ బయటికి వచ్చాడు.

'ఎవరో ఎదవలు అడవిలో ఏదో ఎదవ పని చేస్తుంటే వాళ్ళను పట్టుకోవాల్సింది పోయి నువ్వు నా బిడ్డడిని తీసుకు వచ్చావట. ఏంటి కథ?' నడుము మీద చేయి వేసుకుంటూ అడిగాడు బాజిరెడ్డి.

'సారుకు ఒక కుర్చీ వేయండి' ఆవులిస్తూ గార్డుకు చెప్పాడు సబ్బిరెడ్డి.

అడవిలోనుంచి చందనం దుంగలు తీసుకువచ్చి ఆ ఇంటిముందే పడవేశారు గార్డులు. లావుగా ఉన్న ఒక దుంగను బాజిరెడ్డి దగ్గరికి దొర్లించాడు గార్డు.

'ఇది మా హెడ్‌క్వార్టర్సు కాదు. సరయిన వసతులు ఇక్కడ లేవు. ఉన్నవాటితో తృప్తిపడాలి. కూర్చోండి సారూ' మృదువుగా చెబుతూ ఆ పెంకుటింటి మెట్ల మీద కూర్చున్నాడు సబ్బిరెడ్డి.

'నేను కూర్చోవటానికి రాలేదు. ముందు నా బిడ్డడిని వదిలిపెట్టు' మరింత బింకంగా అన్నాడు బాజిరెడ్డి.

'మీ బిడ్డడు మాకు స్మగ్లింగ్ స్పాట్‌లో రెడ్‌హాండెడ్‌గా దొరికాడు. వదిలిపెట్టే ప్రసక్తే లేదు' కామ్‌గా చెప్పాడు సబ్బిరెడ్డి.

'చూడు సబ్బిరెడ్డీ... మాటల్తో పూర్తి అయ్యే పనికి చేతలదాకా తీసుకుపోవటం మంచిది కాదు' కోరగా చూస్తూ వార్నింగ్ ఇచ్చాడు బాజిరెడ్డి.

'సారీ సారు... నేను చేయగలిగింది ఏమీ లేదు. మీ బిడ్డడిని వదిలిపెట్టటం మాత్రం జరిగే పని కాదు' అన్నాడు సబ్బిరెడ్డి.

అప్పుడు అతను ఆ మాటలు అన్నప్పుడు బాజిరెడ్డి పక్కకు వచ్చారు అతను తీసుకు వచ్చిన లాయర్లు.

'ఓకేసార్! మీ రూల్స్ మీకు ఉంటాయ్. కాదని మేము అనడం లేదు. మీకు కావాల్సిన పూచీకత్తు సబ్మిట్ చేస్తాము. వారి బిడ్డడికి స్టేషన్‌బెయిల్ ఇవ్వండి. మీరు ఎప్పుడు ఎక్కడికి రమ్మని కబురు పంపితే అక్కడికి వచ్చి అటెండెన్స్ వేయించుకుంటాడు' నెమ్మదిగా చెప్పారు.

'సారీ... ఆ పని కూడా జరగదు. తను ఒక్కడే మాకు దొరికి ఉన్నట్లయితే మీరు అడగక ముందే బయటికి పంపించి ఉండేవాడిని. అతనితోపాటు ఇంకా చాలామంది సరెండర్ అయ్యారు. వాళ్ళందర్నీ వదిలిపెట్టి ఇతను ఒక్కడినే బయటికి పంపించటం బాగోదు' నిర్మొహమాటంగా చెప్పాడు సబ్బిరెడ్డి.

'ఇది చాలా దూరం పోతుంది సబ్బిరెడ్డి' ఉన్నట్లుండి హెచ్చరించాడు బాజిరెడ్డి.

'ఎంత దూరం పోతుందో, ఎలా పోతుందో నాకు బాగా తెలుసు. తీసుకుపొండి. చూసుకుందాం' అంటూ పైకి లేచాడు సబ్బిరెడ్డి.

'దూరంగా పంపించేయ్. అరుపులు కేకలు నిషిద్ధమని చెప్పు...' తన గార్డుకి చెప్పి లోపలికి వెళ్ళిపోయాడు.

'తెల్లవారగానే కోర్టుకి పోయి మేజిస్ట్రేట్ గారితో మాట్లాడి..' అంటూ మొదలుపెట్టిన లాయర్లని కామ్‌గా ఉండమని సైగ చేస్తూ తమ వెహికల్ దగ్గరికి వచ్చాడు బాజిరెడ్డి.

'పోనీ.. త్వరగా ఇంటికి పోనీ. తెల్లారేలోపు శివారెడ్డి దగ్గర్నుంచి వీడికి ఫోను రావాలి. పోనీ' అంటూ కార్లో కూర్చున్నాడు.

'ఆ పనిచేసిన తర్వాతనే మనం ఇక్కడికి వచ్చి ఉంటే బాగుండేది సారూ. బోలెడంత టైము వేస్టు అయిపోయింది' అంటూ లాయర్లు కూడా ఎక్కగానే బండి వెనక్కి తిప్పాడు డ్రైవర్.

'సారూ... బాజిరెడ్డి సారూ....' అంటూ సడన్‌గా దారికి అడ్డం వచ్చాడు గ్రానైట్స్ మైన్స్ జనం లీడర్.

'ఈళ్ళు మనల్ని తగులుకున్నారేంట్రా.. తర్వాత మాట్లాడతామని చెప్పు' విసుగు నిండిన కంఠంతో డ్రైవర్‌కి చెప్పాడు బాజిరెడ్డి.

**(ఇంకావుంది)**

## మైగ్రేన్ (పార్శ్వపు తలనొప్పి)

తరుచుగా తలనొప్పి వస్తే అశ్రద్ధ చేయకూడదు. ఎందుకంటే తలనొప్పికి చాలా కారణాలున్నాయి. రక్తపోటు, మెదడులో కణతులు, రక్తనాళాలలో రక్త ప్రసరణలో మార్పులు, మానసిక ఒత్తిడి, నిద్రలేమి వల్ల, మగవారిలో రక్తపోటు, మానసిక ఒత్తిడి, మెదడులో కణతుల వల్ల తలనొప్పి వచ్చే అవకాశం ఉంటుంది. మైగ్రేన్ తలనొప్పి స్త్రీలలో అధికంగా చూస్తుంటాం. ఈ నొప్పి చాలావరకు తలకు ఒకపక్క వస్తుంది. వాంతులూ ఉండవచ్చు. తలలోని రక్తనాళాలు ఒత్తిడికి లోనయి వాచడం వల్ల ఈ నొప్పి వస్తుంది.

**పార్శ్వపు తలనొప్పికి కారణాలు:** పార్శ్వపు తలనొప్పి కి మానసిక ఆందోళన, ఒత్తిడి ముఖ్య కారణాలు. అనవసరపు ఆలోచనలు, జరిగిపోయిన విషయాల ను తరుచుగా ఆలోచించడం వల్ల వస్తుంది. డిప్రేషన్, నిద్రలేమి, కొందరిలో బయటకు వెళ్ళి నప్పుడు, సూర్యరశ్మి వల్ల, అధికంగా ప్రయాణాలు చేయడంవల్ల వస్తుంది. స్త్రీలలో హార్మోన్ల సమస్యలు ఏర్పడినప్పుడు, ఋతుచక్రం ముందుగా గాని, తర్వాత గాని వచ్చేఅవకాశం ఉంటుంది. గర్భాధారణ సమయంలో స్త్రీలలో ఋతుచక్రం ఆగిపోయినప్పుడు ఈ సమస్య తీవ్రమయ్యే అవకాశం ఉంటుంది. ఓరల్ కాంట్రసెప్టివ్ పిల్స్ లాంటి కొన్నిరకాల మందులువాడటంవల్ల రావచ్చు. **మైగ్రేన్ దశలు-లక్షణాలు:** సాధారణంగా 24-72 గంటల్లో దానంతట అదే తగ్గవచ్చు. ఒకవేళ నొప్పి 72 గంటలు ఉంటే స్టేటస్ మైగ్రేన్ అంటారు. మైగ్రేన్ 4 దశలలో సాగుతుంది. **ప్రోడ్రోమ్ ఫేజ్:** ఇది నొప్పికి ముందు 2 గంటల నుంచి 2 రోజుల ముందు వరకు జరిగే ప్రక్రియల సమూహం. ఈ దశలో చిరాకు, మానసికఆందోళన, డిప్రెషన్, ఆలోచనలో మార్పులు రావడం, వాసన, వెలుతురు పడకపోవడం, మెడనొప్పి ఉంటాయి. **ఆరాఫేజ్:** ఈ దశ నొప్పి ప్రారంభానికి కొద్ది నిమిషాల ముందు ఉంటుంది. చూపు మందగించడం, జిగ్ జాగ్ లైన్స్ కనిపించడం, తలలోసూదులు గుచ్చిన ఫీలింగ్, మాటలు తడబాటు, కాళ్ళలో నీరసం ఉంటాయి. **నొప్పిదశ:** ఈ నొప్పి దశ 2 గంటల నుంచి 3 రోజుల వరకు ఉండే అవకాశం ఉంటుంది. ఈ దశలో వాంతులు ఉంటాయి. చాలా వరకు ఒక వైపునే ఉంటుంది. కాంతికి, ధ్వనికి చాలా సెన్సిటివ్‌గా అంటే చికాగ్గా అనిపిస్తుంది.

**పోస్టడ్రోమ్ ఫేజ్:** నొప్పి తగ్గిన తర్వాత కొద్ది రోజుల వరకు తలభారంగా అనిపిస్తుంది. ఒళ్ళంతా నీరసంగా, నిరాసక్తంగా అనిపిస్తుంది.



**వ్యాధి నిర్ధారణ:** 1 రక్త పరీక్షలు-సీబీపి, ఈఎస్ఆర్ 2. రక్తపోటును గమనించడం. 3.ఈఈజీ పరీక్ష సిటీస్కాన్(మెదడు). 4.ఎం.ఆర్.ఐ పరీక్షలు ఉపకరిస్తాయి. **మైగ్రన్ రాకుండా తీసుకోవాల్సిన జాగ్రత్తలు:** 1. మానసిక ఆందోళన తగ్గించాలి. 2. అతిగా ఆలోచనలు చేయకూడదు. మానసిక ఒత్తిడి తగ్గించుకోవాలి. దీనికోసం యోగా, ప్రాణాయామం చేయాలి. ధ్యానం ద్వారా మానసిక ప్రశాంతత లభిస్తుంది. 3. తలకు నూనేతో మసాజ్ చేసుకుంటే తలలోని నరాలు రిలాక్సవుతాయి.

4. తలనొప్పి వచ్చినప్పుడు ప్రశాంత వాతావరణంలో, లైటు తీసేసి నిశ్శబ్దంగా ఉన్నచోట పడుకోబెట్టాలి.

**హోమియోవైద్యం:** మైగ్రేన్ తలనొప్పికి హోమియోలో మంచి మందులున్నాయి. ఘాటైన వాసనలు పీల్చిన పుడు వస్తే, బెల్లడోనా, లైకోపోడియం, ఇగ్నీషియా ఇవ్వాలి. తరుచు ఎక్కువగా వస్తుంటే, నాట్రంమూర్, సాంగ్యునేరియా, చైనా, సెపియా ఇవ్వాలి. గర్భవతు ల్లో వస్తే బెల్లడోనా, సక్సవామికా, సెపియా ఇవ్వాలి. ఎక్కువగా చదవడం వల్ల వస్తే కాల్కేరియా కార్బ్, నాట్రామూర్, ట్యూబర్కులినమ్. ప్రయాణాల వల్ల వస్తే -ఇగ్నీషియా సెపియా, కాక్యులస్, కాలికార్బ్ ఇవ్వాలి. స్కూల్‌కి వెళ్ళే ఆడపిల్లలో వస్తే - కాల్కేరియా ఫాస్ నాట్రంమూర్, పల్సటిల్లా ఇవ్వాలి. పైన తెలిపిన మందులు కేవలం అవగాహనకు మాత్రమే. వాటిని నిష్ణాతులైన హోమియో డాక్టర్‌ని సంప్రదించి మాత్రమే తీసుకోవాలి.



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**



## నడుంనొప్పికి ఆయుర్వేద చికిత్స

**ప్రస్తుత పరిస్థితుల్లో మానవుని జీవనం ప్రకృతి సహజ విధానాలకు విరుద్ధంగా ఉంటోంది. పెరిగి పోతున్న పని ఒత్తిడి, పోషకాహారం సరిగా తీసుకోక పోవడం వల్ల ఈ రోజుల్లో 40 ఏళ్లకే నడుంనడప్పి వస్తోంది. శారీరకంగా, మానసికంగా సమస్యలు కలిగించే నడుంనొప్పిని దూరం చేయాలంటే ఆయుర్వేద చికిత్సే ఉత్తమమైన మార్గం అంటున్నారు ప్రముఖ ఆయుర్వేద వైద్యులు డాక్టర్ మనోహర్.**

నేటి జీవనవిధానంలో ఆహారలోపాలు, అస్తవ్యస్తమైన దిన చర్యలు, స్వప్న విపర్యం అంటే రాత్రివేళ నిద్రపోక పోవడం, పగటిపూటనిద్రపోవడం వంటి అలవాట్లు శరీర వ్యవస్థను బాగా దెబ్బ తీస్తున్నాయి. ఆందోళన, మానసిక ఒత్తిడి కూడా అనేక అనారోగ్యాలకు కారణ మవుతున్నాయి. వీటిలో అతిముఖ్యమైనది నడుంనొప్పి. ఆయుర్వేదశాస్త్రం నడుం నొప్పికి 'గృధ్రసీవాతం' గా నామకరణం చేసింది. తొంభైశాతం మంది తమ జీవిత కాలంలో ఎప్పుడో ఒక్క సారి నడుంనొప్పి బారినపడతారని కొన్నిఅధ్యయనాల్లో స్పష్టమయింది. **కారణాలు:** ఎక్కువసమయం ఒకే భంగిమలో కూర్చోవటం, స్థూలకాయం, ఎక్కువగంటలు విపరీతంగా శ్రమించడం, అతిగా బరువులు మోయడం, ద్విచక్రవాహనం మీద ఎక్కువ దూర ప్రయాణం చేయడం, రోడ్డు ప్రమాదాలు,దీర్ఘకాలికరుగ్మతలు, వంశ పారంపర్య వ్యాధులు ఇవన్నీ నడుంనొప్పికి కారణాలు. ఈ కారణాల వల్ల వాత ప్రకోపం జరుగుతుంది. ఫలితంగా ముందుగా పిరుదుల పైభాగాన స్తబ్ధతను, నొప్పిని కలిగించి ఆ తరువాత నడుం భాగం, ప్రత్యేకించి ఎల్-4, ఎల్-5 వెన్నుపూసల మధ్య ఉండే సయాటికా నరం మీద ఒత్తిడి పడటంవల్ల నడుంనొప్పి వస్తుంది. డిస్కులో వచ్చే మార్పులు. వెన్నుపూసల మధ్య ఉండే డిస్కుల్లో కొన్ని మార్పులు జరిగినప్పుడు డిస్కుల మీద ఒత్తిడి పెరుగు తుంది. వాపు రావడం, డిస్కుకి రక్త ప్రసరణ సరిగా లేక పోవడం, డిస్కు అరిగి పోవడం వంటి సమస్యల వల్ల ఈ నొప్పి వస్తుంది. డిస్కులలో వాపువస్తే అందులోనుంచి ద్రవం బయటకు వచ్చి మేరుదండం నుంచి వచ్చే నరాల పైన ఒత్తిడి పెరుగు తుంది. దీనివల్ల వెన్ను నొప్పి వస్తుంది. **లక్షణాలు:**నడుంనొప్పి, వాపు, కాస్త శ్రమించినా సూదుల తో గుచ్చినట్లుగా నొప్పి తీవ్రంకావడం, కాళ్ళలో తిమ్మిర్లు, మంటలు ఉంటాయి. సకాలంలో చికిత్స అందకపోతే స్పర్శజ్ఞానం కోల్పోతారు.సమస్య తీవ్రమైతే మలమూత్రాల మీద నియంత్రణ కోల్పోయే ప్రమాదం ఉంది. పెయిన్ కిల్లర్స్ వాడకూడదు. పెయిన్‌కిల్లర్స్‌తో మలబద్ధకం, జీర్ణా శయ సమస్యలు వస్తాయి. వెన్నుసంబంధిత సమస్యలను వెంటనే గుర్తించి చికిత్స తీసుకుంటే ఈ వ్యాధిరాకుండా ఉంటుంది. **ఆయుర్వేదచికిత్స:** నడుంనొప్పిసమస్యకు ఆయుర్వేద శాస్త్రం సూచించి వ సమగ్రమైన చికిత్సా పద్ధతుల్లో నిదాన పరి వర్జనము, శమన చికిత్స, శోధనచికిత్స అని మూడు ప్రధానమైనవి ఉన్నాయి. **నిదానపరివర్జనము:** వ్యాధికి కారణమయిన విషయాలను పాటించక పోవడం. ఉదా। విరుద్ధ ఆహార, విహార సేవన (రాత్రి మేల్కోవటం, పగలు నిద్రపోవటం). **శమనచికిత్సలు:** వ్యాధితాలూకు దోషాలను శమింప చేయుటానికి తెచ్చే ఔషదాలు. ఇందులో రోగ బలాన్నిబట్టి, రోగిబలాన్నిబట్టి చూర్ణాలు, గటికలు, కషాయాలు, లేహ్యాలు, తైలాలు వంటి ఔషదాలు రోగికి ఇవ్వడం జరుగుతుంది. కానీఈ శమన చికిత్సవల్ల ఒక్కో సారి ప్రకోపించిన దోషాలుమళ్ళీ తిరగబడవచ్చు. అందుకే వ్యాధితీవ్రతను బట్టి శమన చికిత్సలతో పాటు కొందరికి పంచకర్మ (శోధన చికిత్స) కూడా అవసరం. ప్రకోపించిన దోషాలను(వాత, పిత్త, కఫ) దీని ద్వారా సమంగా చేసి శరీర శుద్ధిని, అగ్ని బలాన్ని పొందవచ్చు. ఆయుర్వేదంలోని స్వేద కర్మ ద్వారా వెన్ను పూసల మధ్య స్నిగ్ధత్వాన్ని పెంపొందించి కీళ్లకదలికలను సులభతరం చేయవచ్చు. బిగుసుకుపోయిన కీళ్లను స్వేదకర్మ ద్వారా వదులుగా, మృదువుగా మార్చవచ్చు. **కటివస్తి:** ఇది ఆయుర్వేదంలోని ఒక విశిష్టప్రక్రియ. అరిగిపోయిన మృదలాస్థి (కార్టిలేజ్)కి రక్తప్రసరణ పెంచి నొప్పి తీవ్రతను తగ్గించడంలో ఈ ప్రక్రియ ఎంతగానో ఉపయోగపడు తుంది. ఇదే క్రమంలో సర్వాంగధార చికిత్స కూడా వీరికి బాగా ఉపయోగపడుతుంది. వస్తికర్మ ఆయుర్వేద శాస్త్రంలో వస్తికర్మ చికిత్స అత్యంత ప్రాధాన్యాన్ని సంతరించు కుంది. ఈ వస్తికర్మచిన్నపేగులు, పెద్దపేగులలోని ఎంటరిక్‌నర్వస్ సిస్టమ్‌పై ప్రభావం చూపుతుంది. తద్వారా నాడీ కణాలలో ఏర్పడిన లోపాలను సరిచేసి బలం చేకూర్చ వచ్చు. అలాగే పక్వాశయం వాతస్థానం కాబట్టి ప్రకోపించిన వాతాన్నికూడా సహజస్థితికి తీసుకురావచ్చు. **జాగ్రత్తలు:** అవసరమైన పోషకాహారం తీసుకుంటూ వైద్యులు సూచించిన విధానా లను అనుసరించడం చాలా ముఖ్యం. ఔషదచికిత్సల తరువాత క్రమం తప్పకుండా వ్యాయామం కూడా చేస్తే నడుంనొప్పి సమస్యనుంచి శాశ్వతంగా విముక్తి కలుగుతుంది.

**డా.మనోహర్.** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**




**ఆసక్తిగా వింటున్న జనమేజయునికి చెబుతున్నాడిలా వైశంపాయనుడు. శూరమహీపతి పెద్దకుమారుడు వసుదేవునికి రోహిణి ప్రథమ భార్య. ఆమెకు బలభద్రుడు, సారణుడు, శరుడు, దుర్దముడు, శమనుడు, శ్వభ్రుడు, పిండారకుడు, కుశికుడు, గదుడు అని తొమ్మండుగురు కుమారులతో పాటు చిత్ర అని ఓ కుమార్తె కూడా జన్మించింది. ఈ చిత్రనే 'సుభద్ర' అని వ్యవహరించారు తర్వాత. ఆమె అర్జునుని భార్య అయింది. ఇప్పుడు నీకు వసుదేవుని వంశక్రమం వివరిస్తాను, విను. దేవకుని కుమార్తెలందరినీ వసుదేవుడు పెళ్ళి చేసుకున్నాడు. వారిలో దేవకికి శ్రీకృష్ణుడు జన్మించాడు. వసుదేవుని పెద్దకుమారుడు బలరామునికి, రేవతితో వివాహమైంది. వారికి ఉల్ముకుడు ఆదిగా కుమారులు అనేక మంది జన్మించారు. అలాగే మదిర మొదలైన బలరాముని మిగిలిన భార్యలు వల్ల కూడా చాలా మంది కుమారులు జన్మించారు.**

# శ్యమంతకమణి:జాంబవతి

శ్రీకృష్ణుడు రుక్మిణి ఆదిగా ఎనమండుగురు పట్టమహిషులుసహా, పదహారువేలమంది తరుణులను పెళ్ళాడి, వృష్ణి వంశాన్ని పెంపొందించాడు. కృష్ణునికి లక్షా ఎనభైవేలమంది కుమారులు జన్మించారు. వారిలో పెద్దవాడు ప్రద్యుమ్నుడు. మిగిలినవారిలో చారుదేష్ణుడు, సాంబుడు మొదలైనవారు ప్రసిద్ధి చెందారు. వృష్ణి ఆఖరి కొడుకు అనమిత్రునికి శిని జన్మించాడు. అతని కుమారుడే సత్యకుడు. ఆ సత్యకుని కుమారుడే సాత్యకి. అతనిని 'యుయుధానుడు' అని కూడా వ్యవహరిస్తారు. సాత్యకి వంశీయులు 'శైనేయులు' అయ్యారు. యుధాజిత్తు వంశంలో అనమిత్రుడు జన్మించాడు. అతనికి నిఘ్నుడు జన్మించాడు. ఆ నిఘ్నునికి ప్రసేనుడు, సత్రాజిత్తు జన్మించారు. ఆ సత్రాజిత్తు సచ్చరిత్రకెంతో ముచ్చటపడి సూర్యుడు అతనికి ఆత్మీయుడైనాడు.

సత్రాజిత్తు సముద్రతీరంలో నిలిచి, పదకొండు రోజులపాటు ఘోరతపస్సు చేశాడు. దానికి సూర్యుడు ఆనందించాడు. అతని ముందు సాక్షాత్కరించాడు. తన ముందు నిలచిన సూర్యుణ్ణి చూసి పొంగిపోయాడు సత్రాజిత్తు. ఆ వెలుగులు తట్టుకోలేక చేతులు అడ్డం పెట్టుకున్నాడు. తర్వాత మెల్లమెల్లగా అలవాటు పడి, చేతులు తొలగించి చూసి, అన్నాడిలా.

దేవా! ఏమిటి ఈ వెలుగు? నిన్ను తట్టుకోలేకపోతున్నాను. కరుణించి, వెలుగుల్ని కుదించి, కనిపించు.

ఆ మాటలకు సన్నగా నవ్వాడు సూర్యుడు. తర్వాత చెప్పాడిలా.

రాజా! నా కంఠంలో ఉన్న ఈ శ్యమంతకమణి కారణంగానే నన్ను నువ్వు చూడలేకపోతున్నావు. ఒకసారి దీనిని చూడు. అని తన మెడలోని శ్యమంతకాన్ని తీసి చూపించాడు సూర్యుడు. తర్వాత ఆ మణిని సత్రాజిత్తు మెడలో వేసి, అతనిని అలంకరించాడు.

వరమేదైనా కోరుకో! అనుగ్రహిస్తాను అన్నాడు.

నీ అనుగ్రహమే గొప్పవరం. అది చాలదన్నట్టుగా ఈ మణిని ప్రసాదించావు. ఇంకేం కావాలి? అన్నాడు సత్రాజిత్తు. అందుకు ఆనందించి, ఆశీర్వదించి, అదృశ్యుడయ్యాడు సూర్యుడు. మెడలోని శ్యమంతక మణి వెలుగులు రువ్వుతోంటే, సూర్యుడిలా ద్వారకా నగరానికి చేరుకున్నాడు సత్రాజిత్తు. నగరపౌరులు సూర్యుడే నేలకు దిగి వచ్చాడనుకున్నారు. ఆ సంగతి శ్రీకృష్ణదేవునికి విన్నవించారిలా.

శ్రీకృష్ణా! సూర్యుడు మీ దర్శనార్థం వస్తున్నాడు.

ఆయన సూర్యుడు కాదు. సత్రాజిత్తు. సూర్యుని అనుగ్రహంతో శ్యమంతకమణిని సాధించి వస్తున్నాడు అన్నాడు కృష్ణుడు. అవునా! అని ఆశ్చర్యపోయారు పౌరులు.

> **ఘోర తపస్సు ఆచరించి సూర్యుని వరప్రసాదంగా శ్యమంతకమణిని పొందాడు సత్రాజిత్తు. అతడి కుమార్తె సత్యభామ. అక్రూరుడు, కృతవర్మ, శతధన్వుడు ఆదిగా అనేకమంది రాజులు సత్యభామను పెండ్లాడగోరి తిరస్కారానికి గురయ్యారు. చివరకు ఆ శ్యమంతకమణితోపాటు సత్యభామను కూడా శ్రీకృష్ణుడికే సమర్పించాడు సత్రాజిత్తు. మరి అప్పుడు అక్రూరాదులు ఏం చేశారు?**

అంతఃపుర ప్రవేశం చేశాడు సత్రాజిత్తు. మెడలోని మణిని దైవసన్నిధిలో భద్రపరిచాడు. ఆనాటి నుండి ఆ మణి ప్రతిరోజూ ఎనిమిది బారువుల బంగారాన్ని ప్రసాదించసాగింది. అంతేకాదు, ఆ మణి ప్రభావంతో సత్రాజిత్తు సంచరించే చోట ఎలాంటి అశుభాలూ జరగకుండా నిరోధించేది. ఆ మణిని అందిపుచ్చుకోవాలనుకున్నాడు కృష్ణుడు. దానిని ఉగ్రసేనునికి సమర్పించాలనుకున్నాడు. అయితే తనంతట తానుగా మణిని అడగడం బాగోదని ఊరుకున్నాడు. కనిపిస్తే కృష్ణుడు మణిని అడుగుతాడు. ఇవ్వడం తనకి ఇష్టం లేదు. అందుకని కృష్ణుణ్ణి తప్పించుకుని తిరిగేవాడు సత్రాజిత్తు. తలచుకుంటే కృష్ణుడు అధికారాన్ని ప్రయోగించో, అర్థతా, ప్రాభవాలను చూపించో శ్యమంతకాన్ని సొంతం చేసుకోగలడు. అయితే యాదవకులంలో కలతలు రేపడం ఇష్టంలేక ఊరుకున్నాడతను. కాని తన ఆంతర్యాన్ని స్నేహితుల ముందూ, బంధువుల ముందూ వెలిబుచ్చక మానలేదు కృష్ణుడు.

శ్యమంతకం మన దగ్గర ఉంటే బాగుంటుంది. ప్రజలకెంతో మేలుకలుగుతుంది అన్నాడు. ఈ మాటలు సత్రాజిత్తు చెవిన పడ్డాయి. భయపడ్డాడతను. తన దగ్గర మణి ఉంటే కృష్ణుడు భయానో, నయానో అందిపుచ్చుకుంటాడు. దక్కనివ్వడు తనకి. అందుకని ఏం చెయ్యాలి? తీవ్రంగా ఆలోచించి, కృష్ణుని చేతికి అందకుండా మణిని తమ్ముడు ప్రసేనునికి అప్పగించాడు.

శ్యమంతకం పరిశుద్ధుణ్ణీ, పుణ్యాత్ముణ్ణీ మాత్రమే అంటిపెట్టుకుని ఉంటుంది. అపరిశుద్ధుల దగ్గర నిలవదది. పరిశుద్ధులకు మాత్రమే అది స్వర్ణాన్ని ప్రసాదిస్తుంది. అపరిశుద్ధులకు ప్రసాదించదు. స్వర్ణాన్ని ప్రసాదించదు సరికదా, అపరిశుద్ధులకు ప్రాణాపాయాన్ని కలిగిస్తుంది. ఈ సంగతి ఆ అన్నదమ్ములకి తెలియదు.

ఒకనాడు ప్రసేనుడు, శ్యమంతకాన్ని అలంకరించుకుని, గుర్రాన్నెక్కి వేటకి బయల్దేరాడు. ఓ భీకరారణ్యం లోనికి ప్రవేశించాడు. అప్పుడతనిపై ఓ సింహం దాడి చేసింది. చంపివేసింది. అతని మెడలోని శ్యమంతకాన్ని మాంసఖండంగా భావించి, దానిని పట్టుకుని పరుగుదీసింది. దానిని అడ్డుకున్నాడు జాంబవంతుడు. పోరాడి సింహాన్ని చంపివేశాడు. మణిని సొంతం చేసుకున్నాడు. తీసుకుని వెళ్ళి ఆ మణిని కుమారుడు సుకుమారునికి ఆట వస్తువుగా బహూకరించాడు.

కొంతకాలం గడిచింది.

వేటకి వెళ్ళిన ప్రసేనుడు ఇంకా రాలేదేమిటని బంధుమిత్రులు ఆందోళన చెందారు. శ్యమంతక మణికోసం శత్రువులు దాడి చెయ్యలేదు కదా? ప్రసేనుణ్ణి చంపలేదు కదా? అని రకరకాల ఆలోచనలు పోయారు. చివరకు ప్రసేనునిపై కృష్ణుడే దాడి చేసి ఉంటాడనీ, మణిని అపహరించి, అతనిని సంహరించి ఉంటాడనీ ఓ నిర్ణయానికి వచ్చారు. వారు అలా నిర్ణయానికి వచ్చారన్నది విని, కృష్ణుడు కలత చెందాడు. తనకి ఏ పాపమూ తెలియదన్నాడు.

అయినా నమ్మలేదెవరూ. తనపై పడిన అపవాదును పోగొట్టుకునేందుకు కృష్ణుడు ప్రసేనుని వెదకుతూ బయల్దేరాడప్పుడు. పర్వత ప్రాంతాలు వింధ్యమూ, ఋక్షవంతాలను అణువణువూ వెదకసాగాడు.

ఒకచోట క్రూరమృగాలన్నీ పీక్కు తింటున్న ప్రసేనుని మృతదేహాన్ని చూశాడు కృష్ణుడు. అయ్యయ్యో! అని జాలి చెందాడు. సింహాన్ని గట్టిగానే ఎదుర్కొన్నట్టుగా ఉన్నాడు ప్రసేనుడు. అతను అలంకరించుకున్న ఆభరణాలన్నీ చెల్లాచెదురై కనిపించాయక్కడ. చేతి నుండి జారిపోయిన కత్తి అల్లంతదూరంలో పడి ఉంది. ప్రసేనుని గుర్రం కూడా చచ్చిపడి ఉంది. అటూ ఇటూ శ్యమంతకమణికోసం చూశాడు కృష్ణుడు. అదే లేదు. కనిపించలేదెక్కడా. అప్పుడతనికి చచ్చిపడి ఉన్న సింహం కనిపించింది. సింహం దాపున ఎలుగుబంటి అడుగుజాడలు కనిపించాయి. మణి అతిలోకప్రభావం వల్ల ఎలుగుబంటి దానికి ఆశపడి ఉంటుందని గ్రహించాడు కృష్ణుడు. ఎలుగుబంటి అడుగుజాడలు అనుసరించి ముందుకు నడిచాడు. ఒక పర్వత గుహలోనికి దారి తీశాడు. గుహలో జోల పాట వినవచ్చింది. ఆ దిశగా నడిచాడు. బాలుణ్ణి దాది నిద్రబుచ్చుతూ పాడుతోందిలా.

ప్రసేనుణ్ణి సింహం సంహరించింది. ఆ సింహాన్ని జాంబవంతుడు సంహరించాడు. సంహరించి నీకోసం ఇదిగో! ఈ అత్యద్భుత మణి తెచ్చాడు. తీసుకో! ఏడవకు కన్నా! ఏడవకు నాన్నా!

పాటలో ప్రతిమాటా అర్థమై ఇదన్న మాట సంగతి అనుకున్నాడు కృష్ణుడు. దాది చేతిలోని శ్యమంతకాన్ని అందుకోబోయాడు. ఆమె భయపడి, కేకలు వేసింది. ఆ కేకలకి పరుగున అక్కడికి వచ్చాడు జాంబవంతుడు. కృష్ణునితో యుద్ధానికి తలపడ్డాడు. ఇరవై రోజులు ఇద్దరూ యుద్ధం చేశారు.

పర్వతప్రాంతాలకి వెళ్ళి ఎంతకీ తిరిగిరాని కృష్ణుడి కోసం చూసి చూసి, అతనింకా ద్వారకకు రాలేదంటే...మరణించి ఉంటాడని భావించారంతా. విషాదంలో మునిగిపోయారు. కృష్ణుడు మరణించాడనుకుని అతని బంధుమిత్రులంతా పరలోక విధులు ఆచరించారు. భూరిదానాలు చేశారు. వాటి వల్ల అక్కడ జాంబవంతునితో పోరాడుతున్న కృష్ణునికి ఊహించనంత బలం చేకూరింది. ఫలితంగా కృష్ణుడు యుద్ధంలో గట్టిగా నిలబడ్డాడు. జాంబవంతుడి బలం క్షీణించి నీరసపడ్డాడు. ఆఖరికి ఓడిపోయాడు. ఓడిపోయిన జాంబవంతుడు చేతులు జోడించి, కృష్ణునికి నమస్కరించి అన్నాడిలా.

ప్రభూ! దేవతలు, గంధర్వులు, యక్షులు రాక్షసులు నిన్ను గెలవడం అసాధ్యం. నువ్వు మహాబలవంతుడివని నాకర్థమైంది. అజ్ఞానం కాకపోతే జంతువునైన నేను, నీతో పోరాడగలనా? నాకెందుకో నువ్వు నా రాముడివి అనిపిస్తోంది. ఆనాటి రాముడే ఈనాటి కృష్ణుడిగా అవతరించాడనిపిస్తోంది. నిజం చెప్పు ప్రభూ! నువ్వు నా రాముడివే కదూ?

అవునన్నాడు కృష్ణుడు. నాటి రాముడే నేటి కృష్ణుడు అన్నాడు. అంతే! జాంబవంతుని ఆనందానికి అవధులు లేకపోయాయి. సాష్టాంగపడి కృష్ణునికి నమస్కరించాడు. అతన్ని దయతో లేవనెత్తి, గట్టిగా కౌగలించుకున్నాడు కృష్ణుడు. ఆ కౌగిలితో జాంబవంతుని గాయాలూ, అలసటా మటుమాయమయ్యాయి. అప్పుడు జాంబవంతుడు, శ్యమంతకం సహా తన కుమార్తె జాంబవతిని కృష్ణునికి ఇచ్చి, స్వీకరించమన్నాడు. జన్మ ధన్యం చేయమన్నాడు. సరేనని శ్యమంతకంతో పాటు జాంబవతిని స్వీకరించి, ద్వారకకు చేరుకున్నాడు కృష్ణుడు. అతని రాకతో ద్వారక పండగ చేసుకుంది. పౌరులు ఆనంద డోలలూగారు. ఆలోచించి, యదు వృష్ణి భోజాంధక ప్రముఖులతో సమావేశాన్ని ఏర్పాటు చేశాడు కృష్ణుడు. అందరి ముందూ శ్యమంతకమణి దొరికిన విధానం, ప్రసేనుని మరణం గురించి పూసగుచ్చినట్టుగా వివరించాడు. అది విని పెద్దలంతా కృష్ణుణ్ణి వేనోళ్ళ పొగిడారు. శ్యమంతకాన్ని సత్రాజిత్తుకిచ్చి, ఇందులో నా తప్పు ఎంతమాత్రమూ లేదన్నాడు. ఉంటే మన్నించమన్నాడు కృష్ణుడు. కొద్దిరోజుల తర్వాత జాంబవతిని పెళ్ళి చేసుకున్నాడు.

అనుమానం పెనుభూతంగా పరిణమించింది. దేవదేవుడు కృష్ణుణ్ణే అనుమానించాడు తను. తనకిక నిష్కృతి లేదనుకున్నాడు సత్రాజిత్తు. చాలా రోజులు మథనపడి మథనపడి, ఈ బాధ తీరేందుకు కుమార్తె సత్యభామను కృష్ణునికి సమర్పించడమే సరైనది అనుకున్నాడు. ఆసరికే సత్యభామను చాలా మంది ఆశించారు. అక్రూరుడు, కృతవర్మ, శతధన్వుడు ఆదిగా అనేకమంది ఆ సుందరిని కోరుకుని, సత్రాజిత్తును అడిగి, కాదనిపించుకున్నారు. ఇప్పుడు వారంతా తనకు శత్రువులవుతారు. అయినా పర్వాలేదనుకున్నాడు సత్రాజిత్తు. ఏమైతే అది అయిందని సత్యభామను కృష్ణునికి సమర్పించి కృతార్థుడయ్యాడు. సత్రాజిత్తు అనుకున్నట్టుగానే అక్రూరాదులు అతనికి బద్ధశత్రువులయ్యారు. అవకాశం కోసం కాచుక్కూర్చున్నారు. సత్రాజిత్తును సంహరించేందుకు సిద్ధమయ్యారు.



ఒకనాడు వారంతా ఓ రహస్యప్రదేశంలో కూర్చుని మంతనాలు సాగించారు.

మనలో ఎవరికి సత్యను ఇచ్చి పెళ్ళి చేసినా ఎవరికెవరూ బాధపడేవాళ్ళం కాదు. మనల్ని కాదని, ఆమెను కృష్ణునికి ఇచ్చి పెళ్ళి చేశాడు. ఇది భరించరానిది. ఇక ఆలస్యం చెయ్యకూడదు. అవకాశం చూసుకుని, సత్రాజిత్తును సంహరించి, అతని శ్యమంతకాన్ని చేజిక్కించుకోవాలి. నేనా నువ్వా అని కాదు, మనలో ఎవరికి సత్రాజిత్తు చిక్కినా సంహరించి సంతోషిద్దాం అనుకున్నారు. శతధన్వుడు అందుకు అంగీకరించి, సత్రాజిత్తును సంహరించడంలో ముందుండాలనుకున్నాడు.

ఇంతలో పాండవులు లక్క ఇంటిలో కాలిబూడిదయినారని కృష్ణునికి తెలిసింది. పాండవులు చనిపోలేదనీ, వారు చనిపోలేదనీ కృష్ణునికి తెలుసు. అయినా తనకేమీ తెలియనట్టుగా దుర్యోధనుణ్ణి నమ్మించేందుకు అతను బాధగా వారణావతానికి ప్రయాణమయ్యాడు.

**—అరణి**

# అమ్మ కావాలి...

-కోరుకొండ వెంకటేశ్వరరావు

**చందమామరావే... జాబిల్లిరావే... కొండెక్కిరావే... గోగిపూలు తేవే....**

**అమ్మ లాలింపులోని మాధుర్యం అనుభవిస్తూ ఆకాశంలో మిలమిల మెరుస్తున్న నక్షత్రాల సొగసులు ఆస్వాదిస్తూ, ఆమె తినిపిస్తున్న గోరుముద్దలు మింగేస్తూ మురిపాలు పోతు న్నాను. నా బుల్లి చేతులతో విచిత్ర విన్యాసాలు చేస్తుంటే అంతలేసికళ్ళు చేసుకుని మురి పెంగా నన్నే చూస్తోంది అమ్మ. అనురాగ తరంగాలు ఆమె కళ్ళల్లో వెల్లివిరియగా, ముప్పిరి గొన్న ఆనందంతో నన్ను ముద్దులతో ముంచేస్తోంది. ఇక చాలంటూ సైగలతో మారాం చేస్తుంటే- "నా బుజ్జివి కదూ, నా బంగారుకొండవి కదూ, మరి ఇదేమో అమ్మ ముద్దంట... దీనిని ఆం చెయ్యాలంట.." అంటూ శతవిధాల మభ్యపెడుతూ అమ్మ నాకు అన్నం తిని పిస్తోంది.**

ముద్దలు తినిపిస్తూ అమ్మ నాకు ఎన్నెన్నో వింతలు, విడ్డూరాలు చెబుతూ ఉంటుంది. వాటిని నేను ఎనలేని ఆసక్తితో వింటుంటాను. అమ్మ ఎదురుగా ఉంటే చాలు, లోకంలో ప్రేమంతా నా సొంత మయినట్లు ఎంతో గర్వంగా ఉంటుంది నాకు. నాతో ఊసులాడుతూనే, మధ్య మధ్యలో నాకు చక్కిలిగింతలు పెడుతుంది. ఆమె సన్నిధిలో నా మనసు పాలపుంతలా వెల్లివిరిసి ఉల్లాసంతో ఉర కలు వేస్తుంది. మా ఇద్దరి మధ్య ఎన్నో సంబరాలు, సంతోషాలు. అవి మాకే స్వంతం. నిజానికి మా ఇద్దరిదీ ఓ లోకం, ఓ అద్భుత ప్రపంచం. అందులో వేరెవరికీ ప్రవేశం లేదు.

అల్లరి చేయకుండా పెట్టిన అన్నం అంతా తినేస్తే, బదులుగా అమ్మ నాకో కథ చెప్పాలి. అది మా ఇద్దరి మధ్య ఒప్పందం.

"అనగనగా ఒక ఊళ్ళోనేమో...."

అమ్మ చెప్పే కథకోసం నేను ఆసక్తిగా ఎదురు చూస్తున్నాను.

అవి డిసెంబరునెల చివరి రోజులు. శీతల గాలులు మెల్లమెల్లగా సాగిపోతూ, లోకానికి నును వెచ్చని గుబులు పుట్టిస్తున్నాయి. నీలాకాశంలో బారులుతీరిన మబ్బు తెరలు వయ్యారం ఒలక బోస్తూ షికారు చేస్తున్నాయి. అంతటా ఆహ్లాదకర మైన వాతావరణం నెలకొనివుంది.

అమ్మ నా ముంగురులతో ఆడుకుంటూ అడి గింది.

"అన్నట్లు, ఇంతకీ నీకు ఎలాంటి కథ కావాలి? రాజులకథా లేక మాయలు, మంత్రాలకథా?"

"నాకేమో...మరి..." నేను సందిగ్ధంలో పడ్డాను. ఇంతలో హఠాత్తుగా, ప్రచండవేగంతో గాలి వీచింది. అది క్షణాలలో సుడిగాలిలా మారి నలువైపులా కమ్ము కుంది. ప్రకృతి రౌద్రరూపం దాల్చినట్టు మేఘాలు భయానకంగా గర్జించసాగాయి. దుమ్ము, ధూళి ఉవ్వెత్తున కెరటాల్లా పైకిలేచాయి. వెనువెంటనే అవి వలయాలుగా మారి మా ఇద్దరినీ చుట్టేశాయి. భీకరంగా మారిన ఆ దుమారానికి తాళలేక ఇద్దరం వెల్లకిలా నేలమీదకు ఒరిగిపోయాం. ఎవరిదో భార మైన అడుగులశబ్దం క్రమంగా దగ్గరవసాగింది. భయంతో వణకుతూ అమ్మస్పర్శ కోసం వెదికాను. క్షణం క్రితం పక్కనున్న అమ్మ ఏమైందో, దృఢమైన ఓ హస్తం నా జుట్టు బిగించి పట్టుకుని, అమాంతం నన్ను పైకిలేపి గాలిలో వేలాడదీసింది. నా ఒంట్లో నరాలన్నీ జివ్వుమన్నాయి. అసంకల్పితంగా నా కళ్ళు రెండూ విచ్చుకున్నాయి.

నల్లగా మెరుస్తూ, వస్తాదులా ఉన్న ఓ వ్యక్తి నా ఎదురుగా కనిపించాడు. వాడు తన రెండోచేతితో నా చుబుకం పైకి లేపాడు.

"ఏమే... నువ్వేమైనా ఎలిజబెత్ రాణివి అనుకుంటున్నావా, పొద్దోయేదాకా ఇలా ముసు గెత్తి తొంగోడానికి? దమ్మిడీ బిజినెస్‌లేదు గానీ నిద్ర కావాల్సి వచ్చినాదే నీకు ఎదవ



నంజకానా. అసలు నీ అదృష్టం బాగుండిపోయి ఈ ఆదిలక్ష్మి కంపెనీల సొరబడినావు గానీ, నాయాల్ది ఆ పైడితల్లి కంపెనీల గనుక అయ్యుంటే ఈపాటికి నీ ఒల్లంతా జాతరైపోయుండేది కాదేటి? అయినా, వచ్చినకాణ్ణుంచి చూస్తన్నా... ఏం చూసుకునే నీకింత నిక్కు నీలుగూను? ఏటి, ఈ కటింగులు చూసుకునేనా?"

అంటూ ఓపక్క నా జడ గుంజుతూనే తన కుడిచేతిని మెల్లగా నా మెడ క్రిందుగా పోనిస్తున్నాడు. ఇక తట్టుకోవడం నావల్ల కాలేదు. శక్తినంతా కూడదీసు కుని, వాడిచేతిని విసిరికొట్టాను. బదులుగా వాడు పడి పడి నవ్వాడు.

"నా సామిరంగా పిటపిటలాడే నీలాంటి పిట్టకి ఆమాత్రం కూత ఉంటేనే కస్టమర్లకి మస్తు కిక్కు వస్తదిలే. బెట్టుచేసే గజ్జెల గుర్రాలకి మన వైజాగ్‌జిల్లాల నుంచి గిరాకీ ఉంటది తెలుసా?"

జర్దాపాన్ నములుతూ వెకిలిగా సకిలించాడు. ఉన్నట్టుండి అంత ఎత్తు నుంచి నన్ను నేలమీదకు వదిలేశాడు. నా తుంటి ఎముక విరిగినట్లు అనిపించి బాధతో విలవిల లాడాను.

అగ్గిపుల్ల భగ్గుమంది. వాడు వెలిగించిన చుట్టపొగ ఆ గది నిండా గుప్పు మంది. కాసేపటిక్రితం మధురమైన స్మృతులలో ఓలలాడిన నా మనోనేత్రం ఒక్క వేటుతో ఛిద్రమైంది. ఎవరో నన్ను ఈడ్చుకుంటూ తీసుకెళ్ళి ఓ చీకటికొట్లో విసి రేశారు. తలుపులు మూసుకున్నాయి. తలుపులు మూగబోయాయి.

మరికాసేపటికి నాకు స్పృహ తప్పింది.

***

మర్నాడు ఉదయం నా గది తలుపు తెరుచుకుంది. ఎదురుగా టీలు సప్లైచేసే సత్తిగాడు. వాడు నాలుగువైపులా గమనించి నా దగ్గరగా వచ్చాడు. టీ గ్లాసు అందిస్తూ నా చెవిలో ఇలా చెప్పాడు.

"చిన్నప్పుడే మా అక్క చచ్చిపోయింది. అది అచ్చం నీలాగే ఉండేది. అందుకే నీకు సాయం చెయ్యాలనిపించింది. చూస్తుండు నిన్నెలా అయినా ఇక్క ణ్ణుంచి బయట పడేస్తాను."

సత్తిగాడు ప్లాన్ చెప్పాడు. "రెండ్రోజుల్లో ఆదిలక్ష్మి కూతురు పుట్టినరోజు. అంతా మందునిషాలో ఉండగా మనం జంప్ అయి పోవాలి".

అనకాపల్లి స్టేషన్‌రోడ్డులో రామకృష్ణా టాకీస్ పక్క సందులో ఉన్న ఆదిలక్ష్మి కంపెనీ (వేశ్యాగృహం) నుంచి ఎలాగోలా బయటపడ్డాను. సత్తిగాడిచెయ్యి పట్టుకొని ఆ ఇరుకుసందుల్లోంచి ఆయాసంతో రొప్పుతూ తూనీగలా పరు గులు తీశాను. నా గుండెలో అలజడి మొదలైంది. ఆ ఇరవై ఫర్లాంగుల దూరం ఎన్నటికీ తరగని సుదీర్ఘ ప్రయాణంలా తోచింది.

కదలడానికి సిద్ధంగా ఉన్న రైల్లో నన్ను ఎక్కించి,

"అక్కా, జాగ్రత్త... ఆం అన్నట్లు ఇదిగో ఇది ఉంచు. ఖర్చుకి పని కొస్తుంది" అంటూ నిక్కరు జేబుల్లోంచి ఒక యాభై నోటు తీసి నా చేతిలో కుక్కేశాడు. నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఏ జన్మ ఋణాను బంధమో మా ఇద్దరిదీ అనిపించింది. నేను తడబడుతూ టాయిలెట్ పక్కన ముడుచుకుని కూర్చుండి పోయాను. రైలు వేగం పుంజుకుంది. చల్లని గాలికి నా కళ్ళు మూతలు పడ్డాయి. ఎంతసేపలా గడిచిందో, ఒక్క కుదుపుతో రైలు ఆగింది. నేను స్పృహలోకి వచ్చాను.

"ఏమిటిలా వెర్రి చూపులు చూస్తున్నావు. దిగుదిగు, ఇదే ఆఖరిస్టేషన్" ఎవరో గదమాయించారు. గుండెను గుప్పెట్లో పెట్టుకొని మెల్లగా దిగి ప్లాట్‌ఫామ్‌మీద సిమెంట్ బెంచ్‌పై చతికిలబడిపోయాను.

'ఇప్పుడేం చేయాలి, ఎక్కడికెళ్ళాలి...పోనీ ఇంటికి వెళితే?' మరుక్షణం చక్ర వర్తి వెకిలితనం గుర్తుకు వచ్చింది. అన్నట్లు చక్రవర్తి ఎవరో మీకు తెలియదు కదూ, వాడి గురించి తర్వాత చెబుతాను.

నేను కూర్చున్న బెంచీమీద చివరగా ఓ మధ్య వయసు స్త్రీ కూర్చునివుంది. ఆమె వెంకటగిరి జరీచీరలో పెద్దింటి ఆడపడుచులా అనిపించింది.

"ఏం పాపా, నువ్వెక్కడికి వెళ్ళాలి? ఎందుకు అంతలా భయపడుతున్నావు" అంటూ పరామర్శించింది. నేను మౌనంగా ఉండిపోయాను.



"చూస్తుంటే ఏదో కష్టాల్లో ఉన్నట్టు కనిపిస్తున్నావు. నీ అమ్మలాంటిదాన్ని నాతో చెప్పవూ?" ఆమె అలా అడగటంతో నాకు దుఃఖం ముంచుకొచ్చింది.

"ఎక్కడికంటే ఏమని చెప్పను మేడమ్, నాకు...నాకెవ్వరూ లేరు" మాటలు కూడగట్టు కుంటూ అన్నాను.

ఆమె నాపక్కగా వచ్చి కూర్చుంది. నా భుజం మీద చెయ్యివేసి "మరేం భయం లేదు తల్లీ, నీకు నేనున్నాను. ముందు కాస్త వేడివేడిగా కాఫీ తాగితే నీ మనసు కుదుటపడుతుంది. ఆ తర్వాత మా ఇంటికి వెళదాం. మిగిలిన విషయాలన్నీ రేపు తీరిగ్గా మాట్లాడుకోవచ్చు. సరేనా?" నన్ను సము దాయిస్తూ అంది. మౌనంగా తలూపాను.

మేమిద్దరం స్టేషన్ దాటుతుండగా తెలిసింది నేను చేరుకున్నది పక్కనేవున్న వైజాగ్ అని. ఆమె తన గురించి నాతో ఇలా అంది.

"నా పేరు అన్నపూర్ణ. సోషల్ సర్వీసు చేస్తుంటా. నువ్వు నన్ను ఆంటీ అని పిలవవచ్చు. మూడు నెలల క్రితం నీలాగే ప్రియ అనే అమ్మాయి బస్టాండులో తారసపడింది. ఆమె ఇప్పుడు నా కూతురుగా నా ఇంట్లో ఉంటోంది. నువ్వు కూడా ఆమెతో పాటు నా దగ్గరే ఉంటూ ఎంచక్కా చదువుకోవచ్చు. ఓకేనా?"

నా సంతోషానికి అవధులు లేకుండా పోయాయి. అప్పుడు రాత్రి మూడుగంటలు దాటు తోంది. ఇద్దరం ఆటోలో సీతమ్మధారలోని ఆమె బంగ్లా చేరుకున్నాం. ఆ రాత్రి నేను నిశ్చింతగా నిద్రపోయాను.

***

మర్నాడు సాయంత్రం ఇంటి ముందర గార్డెన్‌లో కూర్చొని మేము ముగ్గురం ఐస్‌క్రీం తింటుండగా ఆంటీ నా వివరాలు అడిగింది. నా గతమంతా ఓ జలపాతంలా నా గొంతులోంచి జాలు వారింది.

***

**అదొక అందమైన పొదరిల్లు. చిట్టి పాపాయి తోడుగా చక్కని కాపురం. ఆ తల్లీబిడ్డలదో అందమైన లోకం. ఆ ఇద్దరి ప్రపంచంలో మరొకరికి చోటులేదు. వాళ్ళ మధ్య ఎన్ని ఊసులో, ఎన్నెన్ని ఆటలో. అమ్మస్పర్శ, అమ్మ చెప్పే కథలు, చక్కిలిగింతలే ఆ బిడ్డకు మధురాను భూతులు. ఒక్కసారిగా ఆ అందమైన పొదరిల్లు చెదిరిపోయింది. ఆ తల్లీ బిడ్డలు వేరైపోయారు. మరి వాళ్ళు తిరిగి కలుసుకున్నారా?**

మాది విశాఖపట్నం జిల్లా చోడవరం గ్రామం. నాన్న ప్రకాశరావు, ఓ అయిదు ఎకరాల భూమి కౌలు చేసేవారు. మా అమ్మ పేరు మహలక్ష్మి. పచ్చని పొలాలమధ్య ఉండే మా ఇల్లు ఓ పొద రిల్లు. అమ్మానాన్నలు ఉన్నంతలో నన్ను అల్లారు ముద్దుగా పెంచారు. మా జీవితనౌక ఉల్లాసంగా సాగిపోతుండగా ఒకరోజు ఉదయం పదకొండు కావొ స్తుండగా, అమ్మ వసారాలో కూరలు తరుగు తోంది. నేను పెరట్లో ఫ్రెండ్స్‌తో ఆడుకుంటు న్నాను. పరిగెత్తుకుంటూ వచ్చిన ఓ గ్రామ స్థుడు పిడుగులాంటి వార్త మోసుకొ చ్చాడు.

పొలంలో పనిచేస్తున్న నాన్న పాము కాటుకు బలైపోయాడు. అమ్మ దుఃఖాన్ని ఆపడం ఎవరితరం కాలేదు. మాకు భవి ష్యత్తు అంతా శూన్యంగా తోచింది. అమ్మా నేను జీవచ్ఛవాల్లా మిగిలిపోయాం. దేవుడు మాకింతే రాసిపెట్టాడనుకుని సరిపెట్టుకోసాగాం. అప్పటికి అమ్మ వయసు పాతిక కూడా దాటి ఉండదు. అమ్మ చాలా అందంగా ఉండడంతో ఎంతో మంది ఆమెకు చేరువవడానికి ప్రయత్నించే వారు. కానీ తను మాత్రం ఎలాంటి ప్రలోభాలకీ లొంగ లేదు. బట్టలు కుడుతూ కుటుంబభారం మోయడా నికి సిద్ధపడింది.

రోజులు అలా నిర్లిప్తంగా గడుస్తుండగా ఓరోజు మా గ్రామ సర్పంచి బావమరిది చక్రవర్తి మా పల్లెలో అడుగుపెట్టాడు. అతను ఆరడుగుల అందగాడు. నవ్వుతూ నవ్విస్తూ అందరినీ అలరించే వాడు. అతను సినిమాలలో వేషాలు వేసేవాడు. అతని షోకులకు అమ్మ పూర్తిగా దాసోహమైపోయింది. మూడు నెలలు తిరక్కుండానే అమ్మ మెడలో తాళి కట్టాడు. అప్పటి నుంచే నాకు కష్టకాలం మొదలైంది.

ఈ నాన్న, నాన్న ప్రవర్తన ఆయన వ్యవహారం గానీ మొదటినుంచీ నాకు నచ్చేవికావు. అతను నావైపు ఆబగా తినేసేలా చూసేవాడు. అతని చూపులు నాకు కంపరం పుట్టించేవి. ఏదో ఒక మిషతో నన్ను తాకడానికి ప్రయత్నించేవాడు. అత నునుంచి దూరంగా ఎక్కడికైనా పారిపోవాలనిపిం చేది. పగలంతా తెలుగు మాస్టారి ఇంట్లో గడిపే దాన్ని. ఆయన నాచేత ఎన్నో పుస్తకాలు చదివించే వాడు. ఆయన సాంగత్యంలో ఎన్నో విషయాలు

## ఐటెంసాంగ్ అడిగిన చార్మి

హీరోయిన్‌గా కెరీర్ అంతం అయిపోయాక అడపాతడపా ఐటెంసాంగ్స్‌తో నెట్టుకొస్తున్న చార్మికి ఆ అవకాశాలు కూడా అడుగంటిపోయాయి. దాంతో ఎవరు ఛాన్స్ ఇస్తారా? అని కళ్ళు కాయలు కాచేలా ఎదురుచూస్తోంది. ఈ సమయంలో బాలకృష్ణతో పూరీ ఓ సినిమా చేయబోతున్నట్టు వార్తలు వచ్చాయి. ఎలాగైనా ఈ సినిమాలో అవకాశం దక్కించుకోవాలనుకుంది చార్మి. పాత పరిచయాన్ని పురస్కరించుకొని బాలకృష్ణ సినిమాలో ఐటెంసాంగ్‌కి అవకాశం ఇమ్మని పాత స్నేహితుడు పూరీని రిక్వెస్ట్ చేసిందట చార్మి. చార్మి లెగ్ మహిమ తెలుసు కనుక పూరీ ఈ విషయంలో ఎలాంటి హామీ ఇవ్వలేదట! చార్మికి చివరికి ఐటెంసాంగ్‌లకి కూడా అడుక్కోవలసిన పరిస్థితి వచ్చిందని సినీజనాలు అంటున్నారు. ఇలా అవకాశాల కోసం అడుక్కునే బదులు హాయిగా పెళ్ళి చేసుకొని సెటిల్ కావచ్చుగా అని కొందరు అంటున్నారు.

తెలుసుకునేదాన్ని. ఏది ఏమైనా నా ఇంట్లో నేను పరాయిగానే ఫీలయ్యేదాన్ని.

నేను పదహారో ఏట ప్రవేశించాను. చక్రవర్తి బిడ్డకి తల్లి అయ్యింది అమ్మ. అతని వెకిలిచేష్టల గురించి అమ్మకి చెప్పడానికి ప్రయత్నించేదాన్ని. ఆశ్చర్యంగా అమ్మ తిరిగి నన్నే మందలించేది. తమ్ముడి ఆటపాటలతో ఎలాగోలా ఓ సంవత్సరం గడిచిపోయింది.

ఓ రోజు రాత్రి భోజనాల దగ్గర అమ్మ నాతో ఇలా అంది.

"ఏదో పౌరాణిక సినిమా షూటింగ్ ఉందట. మీ నాన్నకు హైదరాబాద్‌లో చాలామంది తెలిసిన వాళ్ళు ఉన్నారుకదా, నీ కోసం మంచి పాత్ర రిజర్వ్ చేసి పెట్టారట. రేపే నీ ప్రయాణం."

అంది. అమ్మమాట తిరస్కరించే అధికారం, అవకాశం రెండూ నాకు కరువయ్యాయి. మర్నాడు సాయంత్రం చక్రవర్తితో బస్‌లో అనకాపల్లి చేరు కున్నాను. అతను బుక్‌చేసిన హోటల్‌లో బస చేశాం. భోజనాలయ్యాక మత్తుమందు కలిపిన కూల్‌డ్రింక్ నాచేత తాగించాడు. నేను క్షణాలలో బెడ్‌పై వాలిపోయాను.

ఆ రాత్రి నిద్రలో నాపై చక్రవర్తి లైంగికంగా దాడి చేశాడు. జుగుప్సాకరమైన ఆ పాశవికచర్యకు నేను మానసికంగా చలించిపోయాను. ఆ క్షణంలో నన్నునేను దహించుకుని చచ్చిపోవాలనిపించింది. చాలాసేపు నాలో నేను కుమిలి కుమిలి ఏడ్చాను. అలా నా వ్యధలో నేనుండగా, వెనుకమాటుగా వచ్చి క్లోరోఫాం అద్దిన నేప్‌కిన్‌తో మళ్ళీ స్పృహ తప్పేలా చేశాడు. ముందుగా కుదుర్చుకున్న ఒప్పందం ప్రకారం ఓ దళారికి నన్ను అమ్మేసి చల్లగా అక్కణ్ణుంచి జారుకున్నాడు.

మర్నాడు కళ్ళు తెరిచి చూసేసరికి నేను ఆది లక్ష్మి కంపెనీలో ఉన్నాను. మూడు రోజుల చిత్ర హింసల తరువాత అక్కణ్ణుంచి ఎలాగోలా తప్పించు కొని రైలెక్కేశాను. ఆ తర్వాత నా అదృష్టం బావుండి మీరు పరిచయం అయ్యారు" అంటూ ముగిం చాను.

"జరిగిందంతా ఓ పీడకలలా మరిచిపో తల్లీ" అంటూ ఆంటీ నన్ను ఓదార్చింది. ఆ తర్వాత సిని మాలు, షికార్లతో ఓ మూడు నెలలు హాయిగా గడిచి పోయాయి. ఆంటీ సంరక్షణలో క్రమేపీ నాలో ఆత్మ విశ్వాసం పుంజుకోసాగింది. ఏదైనా జాబ్ సంపాదించి నా కాళ్లమీద నేను నిలబడాలి అనుకునేదాన్ని.

మార్చిలో తప్పిన లెక్క మళ్ళీ సెప్టెంబరులో వచ్చింది. భద్రతా భావం మింగేసిన ఆలోచనలతో తర్కం తప్పుదారి పట్టింది. మరి లెక్క మళ్ళీ మళ్ళీ తప్పక ఏమవుతుంది? తెలియక చేస్తే పొరపాటు, తెలిసి చేస్తే తప్పు. మరి తెలిసీ తెలియకచేస్తే? ఎలా చేసినా ఫలితం ఒక్కటే! ఓరోజు రాత్రి హోటల్‌లో జరి గిన పార్టీ నుంచి ప్రియ, నేను పాత విశాఖపట్నం లోని పైడితల్లి కంపెనీకి బదిలీ అయ్యాము. ఓ వృత్తం అలా పూర్తయింది.

***




## తప్పిపోయాను

చిన్నప్పుడు ఏడో యేట గుంటూర్లో
తప్పిపోయాను
మా ఊర్నించి గుంటూరుకి కాపురం
మార్చేశారు నాన్నగారు
అమ్మ లేదు, నాన్నగారూ నాయనమ్మా
మరొక పనివాడు
కొత్తపేటలో పెద్ద ఇల్లు తీసుకున్నారు
రోడ్ల మీద కార్లు మోటార్ సైకిళ్ళు లేవు
లారీలు బస్సులు అస్సలు లేవు
మా సామాను రెండు రెండెడ్ల బండ్లమీద
వచ్చింది
పనివాళ్ళు సామాన్లు సర్దుతున్నారు
కార్లు కనిపిస్తే చూద్దామని కొంతదూరం
నడిచాను
ఒక కారు కనిపించింది కాని
చూస్తుండగానే
తుర్రుమని వెళ్ళిపోయింది
ఇంకా కొంత దూరం నడిచాను
కార్లేవీ కనపడలేదు
తెలిసిన వాళ్ళెవరూ కనపడ్డంలేదు
మా ఇల్లెక్కడో తెలియలేదు
ఏడుపొచ్చేసింది
ఏడుస్తున్నానని కూడా తెలియటం లేదు
ఎవరో తలమీద చెయ్యేసి
"ఎందుకేడుస్తున్నావ్" అని అడిగాడు
ఏడుపు ఆగలేదు
మా ఇల్లెక్కడ? అన్నాను
నాన్నా (నాయన) అమ్మ అని కూడా
అన్నాను
పక్కనే ఉన్న ఇంటికి తీసుకెళ్ళాడు.
'ఊర్కో- ఏడవొద్దు' అంటూ ఓదార్చాడు
మంచినీళ్ళు తాగించాడు
కాస్సేపటికి తెలిసింది
నేను వాళ్ళకు తెలిసిన వాళ్ళబ్బాయినేనని
వాళ్ళు మా చుట్టాలేనని



కథ సుఖాంతమే!
నాకిప్పుడు డెబ్బయి రెండేండ్లు!
ఇప్పుడీ విశ్వక్రీడోత్సవంలో
తప్పిపోయిన నన్ను
నా స్వస్థలానికి ఎవరు చేరుస్తారు?

**—కడియాల రామమోహనరాయ్**
**సెల్:99597 78698**

మా ప్రమేయం లేకుండానే మేమిద్దరం నీచాతి నీచమైన వేశ్యావృత్తిలోకి బలవంతంగా నెట్టివేయ బడ్డాం. రెండు సంవత్సరాలు గడిచిపోయాయి. ఆ కాలంలో నాలో ఎన్నో మార్పులు వచ్చాయి. సిగ్గు మాలిన ఆ వృత్తిలోపడి నేను సిగ్గంటే ఏమిటో మరచి పోయాను. స్త్రీ ఆత్మగౌరవానికి చిహ్నమైన స్త్రీత్వాన్ని క్రమంగా కోల్పోయాను. నా మెదడు గ్రహింపు శక్తికి, మనసు స్పందనకు, శరీరం సున్నితత్వానికి దూరమైంది. నిర్జీవంగా బ్రతకడం అలవాటయి పోయింది.

మా మండీలో రాత్రి ఎనిమిది దాటితే సందడి మొదలయ్యేది. ఎవరో రావడం, మేమంతా సింగా రించుకుని నిలుచోవడం, ఎంపిక పూర్తయ్యాక ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోవడం, ఆ చక్రం అలా తిరగాల్సిందే!

ప్రతిరాత్రి అక్కడ మద్యం ఏరులైపారేది. ఐటమ్ పాటల హోరుతో చెవులు చిల్లులుపడేవి. చుట్ట, బీడి, సిగరెట్, చికెన్ బిర్యానీల మిశ్రమ వాసన లతో వికారం కలిగేది. అక్కడ ఆడతనం ఆనవాలు కైనా కనబడేది కాదు.

ప్రతిఘటించే స్త్రీల ఆర్తనాదాలు ఓవైపు, శాడి స్టుల వికృతచేష్టలకు మైనర్ బాలికలు పెట్టే ఆక్రం దనలు మరో వైపు. ఒక్క ముక్కలో చెప్పాలంటే అది ఓ చీకటి సామ్రాజ్యం, దానికి పహారా కాస్తూ కొందరు పోలీసు దొరలు!

కొత్తదనం కోరుకునే రసజ్ఞులను రంజింపచే యడానికి, హైదరాబాద్ నుంచి ఓ రోజు పదిమంది అమ్మాయిలను రప్పించారు. బదులుగా, మమ్మల్ని ఆరుగురిని అక్కడికి తరలించారు.

స్థలం మారినా, నా బ్రతుకులో మార్పురాలేదు. కష్టాల కొలిమిలో కాగుతున్న నాకు అమ్మ జ్ఞాప కాలు ఊరడించేవి. అలా జీవచ్ఛవంలా బ్రతుకు తుండగా ఓ రోజు మా కంపెనీ మీద రెయిడ్ జరి గింది. ఎప్పటిలా ముందస్తు సమాచారం అంద లేదు. కారణం అది, మహిళల అక్రమ రవాణా అరికట్టేదిశగా అహర్నిశలూ కృషిచేస్తున్న ప్రజల

సంస్థ, పోలీసుశాఖ సహకారంతో జరిపిన మెరుపు దాడి కావడమే!

మేమంతా కలిసి ఇరవై ఆరుగురం. అందరినీ వ్యాన్‌లో పోలీస్ స్టేషన్‌కి తీసుకుపోయారు. కొన్ని ఫార్మాలిటీస్ పూర్తయ్యాక ఆ సంస్థ మమ్మల్ని దత్తత తీసుకుంది. అక్కణ్ణుంచి హైదరాబాద్ పాతబస్తీలో వారి పునరావాస కేంద్రానికి వెళ్ళాం.

ప్రజ్వల వాలంటీర్ ఆశాజ్యోతి ద్వారా నాకు చాలా విషయాలు తెలిశాయి. పద్మవ్యూహం లాంటి వ్యభిచారవృత్తిలో చిక్కుకున్న నిస్సహాయస్త్రీలను చెర విడిపించి వారికి పునరావాసం కల్పించి, వారిలో ఆశావహ దృక్పథం పెంపొందించే దిశగా ఈ సంస్థ ఉద్యమిస్తున్నది. డాక్టర్ సునీతాకృష్ణన్ ఆధ్వ ర్యంలో ఈ సంస్థ సామాజిక ప్రక్షాళన దిశగా శరవే గంతో దూసుకుపోతోంది.

విమోచన పొందిన మహిళలకు వృత్తి విద్య లలో శిక్షణనిచ్చి ఉపాధి అవకాశాలు కల్పిస్తారు. వాళ్ళను వారిళ్ళకు చేర్చడానికి ప్రయత్నిస్తారు. నా వివరాలు తెలుసుకుని మా ఊళ్ళో వాకబు చేశారు. నన్ను హోటల్‌లో వదిలేశాక, చక్రవర్తి మళ్ళీ మా ఊరు వెళ్ళలేదట. సంవత్సరం క్రితం అమ్మ ఎవరో స్కూల్ టీచర్‌ని మూడోపెళ్ళి చేసుకున్నట్టు తెలిసింది.

సునీతగారు కార్లో నన్ను మా ఊరికి తీసు కెళ్ళారు. అమ్మను చూడబోతున్న ఆనందంతో ఆ ముందురోజు రాత్రంతా నాకు నిద్రపట్టలేదు. మా ఊరు వదిలి అప్పటికి మూడేళ్ళు దాటింది. మా ఇల్లు దగ్గరవుతుంటే నా గుండె గూటిలో పది లంగా దాచుకున్న జ్ఞాపకాలు ఉప్పెనలా నన్ను చుట్టుముట్టాయి. పట్టరాని సంతోషంతో నా మనసు పరవళ్ళు తొక్కింది.

సునీతగారిని సాదరంగా ఆహ్వానించింది అమ్మ. అప్పుడు ఇంట్లో అమ్మ ఒక్కతే ఉంది. నా చిన్ననాటి సంగతులు మదిలో దోబూచులాడగా నేను ఇల్లంతా తిరుగుతూ పిచ్చిగా గంతులు వేశాను. కిచెన్‌లో కాఫీ కలుపుతున్న అమ్మను వెనుకమాటుగా వెళ్ళి కౌగిలించుకున్నాను. "నిజంగా నిన్ను మళ్ళీ చూస్తా ననుకోలేదమ్మా. ఎన్నో రాత్రులు భయంతో నాకు నిద్ర పట్టేదికాదు తెలుసా? నీ జ్ఞాపకాలే వెంటా డేవి. అదంతా ఓ పీడకల. పోనీలే. ఎలా అయితేనేం దేవుడు నన్ను మళ్ళీ నీ దగ్గరికి చేర్చాడు. నాకది చాలు" ఆ క్షణాలు ఎక్కడ చేజారిపోతాయో అన్న ట్లుగా అమ్మకు మరింతగా హత్తుకుపోయాను. నా ఎదలోని వ్యధ కన్నీరై అమ్మ జాకెట్‌ను పూర్తిగా తడిపేస్తోంది.

"ఎలా ఉన్నావమ్మా?" ఆర్తిగా అడిగాను. అందుకు అమ్మనుంచి ఎలాంటి స్పందన రాలేదు. "ఎలా ఉంటాను? బాగానే ఉన్నాను. చూస్తున్నా వుగా" తటస్థంగా అంది. "వెళ్ళి వసారాలో ఆ మేడమ్ పక్కన కూర్చో. నేను అక్కడికే వస్తాను" ఆమె మాటల్లో కరుకుదనానికి నివ్వెరపోయాను. ఉప్పొంగిన ఉత్సాహమంతా చప్పున చల్లారిపోయింది.

కాఫీలయ్యాక, "మీ అమ్మాయిని దూరంచేసు కుని మీరెంతో మథనపడి ఉంటారు. ఎలా అయి తేనేం చివరికి మీ చిన్నారి మీ ఇంటికి చేరుకుంది. గాడ్ ఈజ్ గ్రేట్! పోతే, కొన్నికాగితాల మీద మీరు సంతకాలు చేయాల్సి ఉంటుంది. ఇంకా..."

సునీతగారి మాటల్ని అమ్మ మధ్యలోనే తుంచే సింది.




"ఆc అన్నట్లు మీరు తీసిన 'నా బంగారు తల్లి' సినిమా చూశాం. నిజంగా చాలా బాగుంది. మీకు చెప్పదగిన దాన్ని కాదనుకోండి. జీవితం వేరు, సినిమా వేరు, ఏమంటారు? దయుంచి మీరు అన్యథా భావించకండి. మేం సమాజం నిర్దేశించిన పరిధిలో బ్రతికే సగటు మనుష్యులం. కట్టుబాట్లు ఎదిరించి నిలువగలిగే తెగువలేని పిరికివాళ్ళం. ఇకపోతే, మీ సంరక్షణలో మా అమ్మాయి నిశ్చింతగా జీవించగల దనే నమ్మకం మాకుంది. మీరు మమ్మల్ని క్షమిం చాలి" అంటూ అమ్మలేచి నిల్చుంది.

నేను హతాశురాలినయ్యాను.

"ఓకే మేడమ్... థాంక్స్ ఫర్ యువర్ కాఫీ" సునీతగారు కూడా లేచి అమ్మకు నమస్కరించారు. అచేతనావస్థలో దిగ్భ్రమలో నిలుచుండిపోయిన నా చెయ్యి పుచ్చుకొని "పద, ఇక వెళదాం" అన్నారు.

గడపదాటుతూ, "వెళ్ళొస్తానమ్మా!" గద్గద స్వరంతో అన్నాను.

"సరే వెళ్ళమ్మా, కానీ మళ్ళీ రాకపోతేనే అంద రికీ మంచిది. అర్థం చేసుకో!" దృష్టి ఎటో సారిస్తూ అంది.

నేను స్తబ్దుగా కారువైపు నడిచాను. గుండెలో ఎవరో గునపంతో కలచివేస్తున్న ఫీలింగ్. నా వెనుక దభీమని తలుపు మూసుకుంది. నా ప్రపంచం అంతా ఒక్కసారిగా తలకిందులైంది.

ప్రజ్వల సంస్థకు చేరేవరకు ఇద్దరం మౌనంగా ఉండిపోయాం. కారు దిగాక సునీతగారు నా భుజంమీద చేయివేసి నన్ను నడిపించసాగారు.

"అసలు ఇందులో నా తప్పేముంది మేడమ్ మీరే చెప్పండి" అంటూ ఆమె గుండెలో తలదాచు కుని మనసారా ఏడ్చాను.

నన్ను ఊరడిస్తూ ఆమె నాతో ఇలా అంది. "చూడమ్మా! ఇక్కడ తప్పొప్పులు ఎవ్వరివి అన్నది కాదు ప్రశ్న. మీ అమ్మ కూడా ఈ సమాజంలో బ్రతికే ఓ సాధారణవ్యక్తి అనే విషయం నువ్వు మరచిపోతున్నావు. నిజాన్ని నిజంగా స్వీకరించ గలిగే మానసిక స్థైర్యాన్ని నువ్వు సాధించాలి. కేవలం నీ తల్లి గురించి, పల్లె గురించి కాకుండా ఇంకా విస్తృత స్థాయిలో నీ ఆలోచన సాగాలి. అదే నేను నీలో కోరుకునేది" అంటూ నవ్వారు.

ఆరాధన భావంతో ఆమెను చూస్తూ ఉండి పోయాను.

"నీ మనసును పంచుకోవడానికి నీకు అమ్మ కావాలి, అంతేగా! పోనీ, ఓ విషయం చెప్పు, నీకు అమ్మనయ్యే అర్హత నాకు లేదంటావా" ఆమె కనులు కరుణను వర్షించసాగాయి.

తన సంకల్పబలంతో ఎందరో బహిష్కృత మహిళల్ని చెర విడిపించి వారిలో ఆశాజ్యోతులు వెలిగిస్తున్న ఓ చైతన్యమూర్తి తనబిడ్డగా దరికి రమ్మని నాకు ఆహ్వానం పలుకుతోంది. ఎవరికో కాని దొరకని ఆ అరుదైన అదృష్టానికి నా కళ్ళు చెమర్చాయి. అప్రయత్నంగా వంగి ఆమె పాదాలు స్పృశించాను. ఆమె నా భుజాలు పట్టుకొని పైకి లేపారు.

"బిడ్డ స్థానం అమ్మపాదాల దగ్గర కాదు, అమ్మ గుండెల్లో!" పసిపిల్లలా ఆమెను హత్తుకుపోయాను. ఆ మాతృమూర్తి స్పర్శతో ఓ నవజీవన చైతన్య స్ఫూర్తి నా అణువణువునా ప్రసరించిన అను భూతికి లోనయ్యాను.

ఆ విశ్వమాత నేతృత్వంలో ఉంటూ నాలాగే అమ్ముడుపోయిన ఎందరో అమ్మాయిలకు నేను "అమ్మ"ను కావాలనే బలీయమైన ఆకాంక్ష ఆ క్షణం నాలో ఊపిరి పోసుకుంది.

నాకు జన్మనిచ్చిన అమ్మ నా మస్తిష్కంలో కేవలం ఒక జ్ఞాపకంలా మిగిలిపోయింది.

సెల్: 9505747932

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో

## గర్భాశయ కణితుల సమస్యకు సరైన పరిష్కారం


డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్




ఈ మధ్యకాలంలో స్త్రీలు ఎదుర్కొంటున్న ఆరోగ్య సమస్యలలోకెల్లా యుటెరైన్ ఫైబ్రాయిడ్స్ (గర్భాశయ కణితులు) అతి ముఖ్యమైనవి. ఈ వ్యాధి వలన ఏర్పడే తీవ్ర ఇబ్బందుల వలన కొన్ని సార్లు వీటిని శస్త్రచికిత్స ద్వారా తొలగించినప్పటికీ, ఇవి మళ్ళీ ఏర్పడటం మరియు వీటి యొక్క తీవ్రత అధికంగా ఉన్నట్లయితే – మరొక శస్త్రచికిత్స ద్వారా గర్భాశయపు తొలగింపు చర్యకు కూడా ఇవి కారణమవుతున్నాయి. తద్వారా చాలా మంది స్త్రీలు ఎన్నో తీవ్రమైన దుష్ప్రభావాలకు గురికావడం జరుగుతోంది. సహజంగా ఈ ఫైబ్రాయిడ్స్ 80% వరకు 50 సం॥ లోపు వయస్సు గల వారిలో ఎక్కువగా ఏర్పడుతున్నందున, 30 నుండి 77% వరకు పిల్లలను కనే వయస్సు గల మహిళలలోనే అధికంగా ఏర్పడటం వలన సంతానలేమికి కూడా ఇవి కారణమవుతున్నాయి. కాబట్టి వీటి పట్ల అవగాహన పెంచుకుని, వీటిని సత్వరమే గుర్తించడం ద్వారా మరియు సరైన హోమియో చికిత్సను అందించడం ద్వారా వీటిని పూర్తిగా నయం చేసే అవకాశం ఉంటుంది.

గర్భాశయంలో ఏర్పడే కణితులను లేదా గడ్డలను యుటెరైన్ ఫైబ్రాయిడ్స్ అని అంటారు. ఇవి సాధారణంగా గర్భాశయపు కండర కణజాలంలో ఏర్పడతాయి. ఈ కణితులు ఒకటిగా గానీ లేదా చిన్న చిన్న కణితులు – గుంపులుగా గానీ ఏర్పడతాయి. ఈ యుటెరైన్ ఫైబ్రాయిడ్స్ పరిమాణం రీత్యా, మిల్లీమీటరు మొదలుకొని కొన్ని సెంటీమీటర్ల వరకు పెరుగుతాయి. గర్భాశయంలో ఈ కణితులు ఏర్పడే ప్రాంతపు ఉనికి–ఎదుగుదల రీత్యా ఇవి 3 రకాలుగా కనిపిస్తుంటాయి. **(1) సబ్ సీరోసల్ ఫైబ్రాయిడ్స్:** గర్భాశయపు వెలుపలి గోడలపై ఇవి ఏర్పడతాయి. 'సంతానలేమి'పై వీటి ప్రభావం చాలా తక్కువగా ఉంటుంది. కానీ ఈ కణితుల పరిమాణం పెరిగే కొద్దీ 'సంతానలేమి'పై ప్రభావం పడటం జరుగుతుంది. **(2) ఇన్‌ట్రామ్యూరల్ ఫైబ్రాయిడ్స్:** గర్భాశయపు గోడల మధ్యలో ఇవి ఏర్పడతాయి. ఇన్‌ట్రామ్యూరల్ ఫైబ్రాయిడ్స్ చాలా సాధారణమైనవి. వీటి పరిమాణాన్ని బట్టి గర్భాశయపు కుహరాన్ని (గదిని) చిన్నదిగా చేసి పిండం ఎదుగుదలను అడ్డుకుంటాయి లేదా గర్భస్రావాన్ని కలిగిస్తాయి. **(3) సబ్‌మ్యూకోసల్ ఫైబ్రాయిడ్స్:** గర్భాశయంలో ఉండే మ్యూకోసల్ పొరలో ఇవి ఏర్పడతాయి. ఇవి పిండం యొక్క ప్రతిస్థాపనను (Implantation) మరియు ఎదుగుదలను అడ్డుకొని సంతానలేమికి దారితీస్తాయి. • ముఖ్యంగా ఇవి గర్భాశయపు అంచులోని ఫెలోపియన్ ట్యూబ్స్‌పై ఒత్తిడి పెంచడం లేదా అడ్డంకులను ఏర్పరచటం వలన గానీ సంతానలేమికి దారి తీస్తాయి. • మరికొందరిలో గర్భాశయపు ముఖద్వారం అనగా సర్విక్స్‌లో ఫైబ్రాయిడ్స్ ఏర్పడటంతో శుక్రకణాలు వెళ్ళే దారిలో అవి అడ్డు తెరలుగా రూపొందుతాయి. దీనివలన కూడా సంతానలేమి సమస్యలు ఏర్పడవచ్చు. • యుటెరైన్ ఫైబ్రాయిడ్స్ ఉండే గర్భిణీలలో, పిండంతో పాటుగా ఫైబ్రాయిడ్స్ ఎదగడం వలన గర్భాశయంలో ఉండే పిండానికి సరైన పోషణ అందక గర్భస్రావం అయ్యే అవకాశాలు కూడా ఉన్నాయి.



**కారణాలు:** ఋతుచక్రము త్వరగా ప్రారంభమయ్యే స్త్రీలలో ముఖ్యంగా 10 సంవత్సరాలకే రజస్వల కావడం వలన మరియు హార్మోన్‌ల అసమతుల్యత కారణంగా – ముఖ్యంగా ఈస్ట్రోజన్ మరియు ప్రొజెస్టిరాన్ హెచ్చుతగ్గుల వలన ఫైబ్రాయిడ్స్ ఏర్పడే అవకాశం ఉంటుంది. కాబట్టి ఋతుస్రావము ఆగిపోయిన స్త్రీలలో ఈ హార్మోన్‌ల ఉత్పాదన చాలా వరకు తగ్గడంతో, వీరిలో ఫైబ్రాయిడ్స్ వచ్చే అవకాశం తక్కువగా ఉంటుంది. స్థూలకాయం మరియు వంశపారంపర్యత మొదలైన కారణాల వలన కూడా గర్భాశయ కణితులు ఏర్పడే అవకాశాలు ఉంటాయి.

**లక్షణాలు:** గర్భాశయ కణితుల లక్షణాలు – అవి ఏర్పడిన స్థలము, పరిమాణము మరియు వాటి యొక్క సంఖ్యను బట్టి ఉంటాయి. కణితులు చిన్నవిగా ఉంటే లేదా మెనోపాజ్ వచ్చే దశలో ఉంటే – దాదాపు ఎలాంటి లక్షణాలు కనిపించకపోవచ్చు. ఇంతేకాకుండా ఋతుచక్రము ఆగిపోయిన స్త్రీలలో ఇవి కుంచించుకుపోయే అవకాశం ఉంటుంది. **ప్రధానంగా కనిపించే లక్షణాలు:** ఋతుచక్రములో అధిక రక్తస్రావము లేదా ఋతుస్రావము ఎక్కువ రోజులు కొనసాగటం, నడుము నొప్పి, కడుపు నొప్పి, కాళ్ళ నొప్పులు • ఫైబ్రాయిడ్స్ వలన మూత్రాశయంపై ఒత్తిడి పెరిగి, తరచూ 'మూత్రానికి వెళ్ళాలి' అనిపించడం • ప్రేగులపై ఒత్తిడి పెరగటం వలన మలబద్ధకం ఏర్పడటం మరియు కడుపుబ్బరంగా ఉండటం • అధిక రక్తస్రావము వలన రక్తహీనత కలిగే అవకాశం కూడా ఉంటుంది.

**నిర్ధారణ పరీక్షలు:** వ్యాధి లక్షణాలను బట్టి గానీ మరియు పెల్విక్ ఎగ్జామినేషన్, అల్ట్రాసౌండ్, ట్రాన్స్ వెజైనల్ స్కాన్, రక్తపరీక్ష, యమ్.ఆర్.ఐ. బయాప్సీ, హిస్టిరోస్కోపీ, హిస్టిరో సాల్పింగోగ్రఫీ, లాప్రోస్కోపీ వంటి పరీక్షల ద్వారా గానీ వ్యాధిని నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో – గర్భాశయ కణితులు పూర్తిగా కరిగించబడేందుకు మరియు, హార్మోన్‌ల అసమతుల్యతను – ఋతుచక్ర సమస్యలను సరిచేసేందుకు గాను జెనెటిక్ కాన్స్‌టిట్యూషనల్ సిమిలిమం ద్వారా సంపూర్ణమైన చికిత్సను అందివ్వడం జరుగుతుంది. అంతే కాకుండా శస్త్రచికిత్స చేయటం ద్వారా గర్భాశయాన్ని తొలగించే అవసరం లేకుండా, కేవలం మందులతోనే ఈ వ్యాధిని పూర్తిగా నయం చేయవచ్చు. తద్వారా 'సంతానలేమి' సమస్యను పూర్తిగా దూరం చేసి, సంతానానికి మార్గం సుగమం చేయవచ్చు.

# క్యాలరీలు కరిగించే ముద్దు



ముద్దు...స్త్రీ పురుషుల మధ్య ప్రేమావేశాన్ని కలిగించే ప్రక్రియ. దీని వలన ఇద్దరి మధ్య ప్రేమ ఒక్కటే జనించదనీ, ఎన్నో ఆరోగ్య లాభాలు పొందవచ్చన్న విషయం తెలిసిందే! నిమిషం పాటు ముద్దు పెట్టుకోవడం వలన 26 క్యాలరీలు ఖర్చు అవుతాయి అంటున్నారు పరిశోధకులు.

అంతే కాకుండా ముఖంలోని కండరాలకు దీనికి మించిన వ్యాయామం లేదని చెబుతున్నారు. చెక్కిళ్లు పటిష్టంగా తయారు కావడానికి ముద్దు దోహదపడుతుందని వారు అంటున్నారు. ముద్దు పెట్టుకోవడం వలన మొత్తం 30 కండరాలు పనిచేస్తాయని చెబుతున్నారు. రోజులో కనీసం రెండు నుంచి నాలుగుసార్లు జీవితభాగస్వామిని ముద్దు పెట్టుకోవడం వలన క్యాలరీలు కరిగి ఆరోగ్యం లభించడమే కాకుండా వారిద్దరి మధ్యా ప్రేమ మరింత బలపడుతుందని వారు అంటున్నారు.






## వయస్సు మార్పులకు ఉపవాసంతో చెక్!

లంకణం పరమ ఔషధం అన్న సంగతి మన పెద్దవాళ్ళు ఎప్పుడో చెప్పారు. ఇప్పుడు అదే విషయం పరిశోధనల ద్వారా మరోసారి రుజువైంది. అమెరికా యూనివర్సిటీకి చెందిన పరిశోధకులు కొన్ని ఎలుకల మీద పరిశోధనలు నిర్వహించారు. వీటికి కొన్ని రోజుల పాటు తక్కువ ఆహారం, ఆ తరువాత ఎక్కువ మొత్తంలో ఆహారం అందించారు. అనంతరం వీటిని పరిశీలించారు. వయస్సు రీత్యా వచ్చే మార్పులని ఎలుకల్లో గమనించారు. తక్కువ ఆహారాన్ని తీసుకున్న ఎలుకలలో బరువు తగ్గడమే కాకుండా అంతకుముందు కన్నా ఉత్సాహంగా తిరగడం వీరు గమనించారు. వీటి కణాల ఉత్పత్తిలో కూడా మార్పురావడాన్ని పరిశీలించారు. అయితే ఉపవాసం లేదా తక్కువ ఆహారం తీసుకోవడం వలన మనుషులమీద కూడా ఇలాంటి ప్రభావాలే ఉంటాయా? అన్న విషయాన్ని వీరు ఇంకా పరిశీలిస్తున్నారు. ఉపవాసం కారణంగా ఆరోగ్యంతో పాటు యవ్వనంగా ఉండే అవకాశం ఉందని వీరు స్పష్టం చేస్తున్నారు.

## అంత నడక మంచిది కాదట

రోజుకి పదివేల అడుగులు నడిస్తే ఆరోగ్యంగా ఉంటారన్న మాట అబద్ధమని అంటున్నారు పరిశోధకులు. రోజులో ఇన్ని వేల అడుగులు నడవడం వలన క్యాలరీలు ఖర్చు కావడం తప్ప మరే ప్రయోజనం ఉండదని స్పష్టం చేస్తున్నారు. ఈ నడక కారణంగా రోజుకి దాదాపు మూడు వేల క్యాలరీలు ఖర్చు అవుతాయనీ, ఊబకాయులకు ఇది మంచిదే అయినా వృద్ధులకూ, ఎలాంటి ఆరోగ్య సమస్యా లేనివారికి హాని జరిగే ప్రమాదం లేకపోలేదనీ హెచ్చరిస్తున్నారు వృద్ధులు ఇన్ని వేల అడుగులు నడవడం వలన వయస్సు రీత్యా వచ్చే కాళ్లనొప్పులతో పాటు మరికొన్ని ఆరోగ్య సమస్యలూ తలెత్తవచ్చని వారు చెబుతున్నారు. ఒక వ్యక్తి తన రోజు వారీ కార్యక్రమాల్లో భాగంగా మూడు వేల నుంచి నాలుగు వేల అడుగులు మాత్రమే నడవగలడనీ, ఈ నడక సాధారణ వ్యక్తికి సరిపోతుందని వారు చెబుతున్నారు. ఇంతకన్నా ఎక్కువ నడవాలనుకునేవారు తప్పనిసరిగా వైద్యుల సలహా తీసుకోవలసిందేనని వారు సూచిస్తున్నారు.





## మైగ్రేన్ నొప్పితో గుండెకు ముప్పు

మహిళల్లో తరచూ కనిపించే మైగ్రేన్ కారణంగా వారిలో గుండెనొప్పి వచ్చే అవకాశాలు ఎక్కువ అవుతాయి అంటున్నారు పరిశోధకులు. గుండెనొప్పి, పక్షవాతాలకు మైగ్రేన్ కూడా ఓ కారణం అవుతుందన్న విషయం వీరి పరిశోధనల్లో వెల్లడైంది. 25 నుంచి 42 సంవత్సరాల వయస్సు ఉన్న సుమారు లక్షన్నర మంది మహిళల ఆరోగ్య డేటాను వీరు సేకరించారు. వీరిలో సుమారు 20 వేల మంది మైగ్రేన్‌తో బాధపడుతున్నారు. 20 సంవత్సరాల పాటు వీరి ఆరోగ్యాన్ని అధ్యయనం చేశారు పరిశోధకులు. మైగ్రేన్‌తో బాధపడుతున్న రెండువేల మందిలో గుండెనొప్పి లక్షణాలు గమనించారు. మిగతా వారితో పోలిస్తే మైగ్రేన్‌తో బాధపడుతున్న వారిలోనే గుండెనొప్పి, పక్షవాతం వచ్చే అవకాశాలు ఎక్కువగా కనిపించడం వీరి దృష్టికి వచ్చింది. కేవలం మైగ్రేన్ కారణంగానే ఇవి వస్తున్నాయా లేక మరేదైనా కారణం ఉందా? అన్న విషయాన్ని వీరు ఇంకా అధ్యయనం చేస్తున్నారు.

—అవినాష్

మంచి ఎక్కడవున్నా నేర్చుకోవాలి. పాశ్చాత్య దేశాల నుంచి కూడా మనం నేర్చుకునే కొన్ని మంచి అలవాట్లు ఉన్నాయి. వాటిల్లో కొన్నింటిని మనమూ అలవరుచుకుంటే ఆరోగ్యంగానూ, ఆనందంగానూ ఉండే అవకాశాలున్నాయి. ఒక సర్వే ప్రకారం ప్రపంచంలో అందరికంటే ఎక్కువగా ఆరోగ్యవంతులు జపనీయులు. ఎక్కువ సమయం పనిచేస్తున్నా అలసిపోకుండా ఉంటారు. అందుకు కారణం వారు పాటించే ఆహార, వ్యాయామ పద్ధతులే.

మరి వారు ఎలాంటి పద్ధతులు పాటిస్తారో మీరూ తెలుసుకోండి. ఇక్కడ ఉన్న కాలమానం, పరిస్థితులకు అనుగుణంగా మనమూ వాటిని పాటిస్తే సంపూర్ణ ఆరోగ్యం సొంతం చేసుకోవచ్చు. వారి పద్ధతులను పాటించడంవల్ల బరువు కూడా తగ్గుతారట. మరి జపనీయులు పాటించే ఆరోగ్య సూత్రాలేంటో మీరూ తెలుసుకోండి!



# జపనీయుల ఆహార అలవాట్లు ఫాలో అవుదామా?

జపనీయులు చాలామంది నాజూగ్గా, ఆరోగ్యంగా ఉంటారు. వారు అవలంబించే ఆరోగ్య అలవాట్లే వారి నాజూకుతనం రహస్యం. అన్ని వెరైటీలూ ఉండేలా, తినడానికి ఆసక్తి కలిగించేలా తమ ఆహారాన్ని సిద్ధం చేసుకుంటారు జపనీయులు.

సాధారణంగా వారు తినే ఆహారంలో ఒక చిన్న కప్పు అన్నం, మీసో సూప్, మూడు సైడ్ డిష్‌లుంటాయి. ఈ మూడింటిలో ఒకటి చేప, మాంసం, లేదా టోఫూతో చేసిన వంటకం ఉంటుంది. దాంతోపాటు కూరగాయలు, ఆకుకూరలతో చేసిన మరో రెండు వంటకాలు వారు తీసుకుంటూ ఉంటారు. ఆహారంలో పండ్లకు కూడా చోటు కల్పిస్తారు. జపనీయుల తరహాలో మనమూ రోజూ కూరగాయలు, పండ్లు ముడిధాన్యాలు, చేపలు, మాంసం లాంటివి ఆరోగ్యకరమైన పద్ధతిలో వండి తీసుకుంటే ఎప్పటికీ యవ్వనంగా, ఆరోగ్యంగా, నాజూగ్గా ఉండే వీలుంటుంది.

## విభిన్నమైన భోజనం

భోజనం అంటే అన్నం, పప్పు, కూర..ఇలా ఒకే రకం ఆహారం అంటే ఎవరికైనా బోర్ కొట్టేస్తుంది కదా, అందుకే అప్పుడప్పుడు మన ఆహారం విభిన్నంగా ఉండేలా ప్లాన్ చేసుకోవాలి. జపనీయులు కూడా తమ ఆహారం ఒకే తరహాలో కాకుండా విభిన్నంగా ఉండేలా ప్లాన్ చేసుకుంటారు. ఫాస్ట్‌ఫుడ్ కూడా తింటారు. అయితే చాలా తక్కువ మోతాదులో ఉంటుంది. భోజనం చేసేందుకు వారు ఉపయోగించే ప్లేట్లు కూడా చాలా చిన్నగా ఉండడం వల్ల తక్కువ తిన్నా ఎక్కువ మోతాదులో తిన్న ఫీలింగ్ కలుగుతుంది. అందుకే మనం కూడా డైటింగ్ పేరుతో పూర్తిగా కడుపు మాడ్చుకోకుండా ఆరోగ్యకరమైన ఆహారం తీసుకోవడానికి ప్రయత్నించాలి. అలాగే ఫాస్ట్‌ఫుడ్ తినాలనిపిస్తే కాస్త తక్కువ మోతాదులో తీసుకోవచ్చు.

## క్రమం తప్పని వ్యాయామం

మనవాళ్ల వ్యాయామం చేయడం చాలా తక్కువ. కానీ జపనీయులకు బాల్యం నుండీ వ్యాయామం జీవితంలో ఒక భాగంగా మారిపోతుంది. అందుకే అక్కడ పెద్దవాళ్ళుకూడా వ్యాయామం క్రమం తప్పకుండా చేస్తుంటారు. జపాన్‌లో వ్యక్తిగత వాహనాల వినియోగం చాలా తక్కువ. చాలా తక్కువ మంది ఉంటారు. పబ్లిక్ ట్రాన్స్‌పోర్టే ఎక్కువగా ఉపయోగిస్తారు. అక్కడ స్కూల్‌కి, దగ్గరలోవున్న ఆఫీసులకు వెళ్ళాలంటే వెహికల్స్ ఉపయోగించరు. నడుస్తూనో సైకిల్స్ మీదనో వెళ్తారు. దీనివల్ల వారికి రోజూ కనీసం గంటపాటు సాధారణస్థాయి వ్యాయామం అందుతుంది. దానివల్ల ఆరోగ్యంగా ఉండగలుగుతారు. .

## ముడిధాన్యాలే ఎక్కువ

జపాన్‌లో ఎక్కువమంది ఆహారంలో వరి అన్నానికి కూడా ప్రాధాన్యమిస్తారు. ముడిబియ్యం వండుకుని తినేందుకే ఎక్కువ మక్కువ చూపిస్తారు. మన బియ్యం కంటే ఈ బియ్యం కాస్త భిన్నంగా ఉంటాయి. దీనివల్ల వారికి వివిధ రకాల పోషకాలు ఎక్కువ మోతాదులో లభిస్తాయి. దాంతో అన్నంలో ఉండే కార్బోహైడ్రేట్ల వల్ల గ్లైసెమిక్ ఇండెక్స్ పెరుగుతుందన్న భయం ఉండదు. వివిధ రకాల పోషకాలు ఎక్కువ మోతాదులో లభించడమేకాదు, చాలా తక్కువ నూనె లేదా అసలు నూనె లేకుండా ఉడికించి చేసే పదార్థాలనే జపనీయులు ఆహారంలో తీసుకుంటారు. అప్పుడప్పుడూ పచ్చి కూరగాయలు తింటారు. రోజూ అన్నిరకాల పోషకాలను శరీరానికి అందించేలా వారు ఆహార ప్రణాళిక రూపొందించుకుంటారు. దీనివల్లనే వారు ఆరోగ్యంగా ఉండగలుగుతున్నారు. స్లిమ్‌గా ఉండగలుగుతున్నారు. ఇలాంటి సూత్రాలు కొన్ని మన జీవితంలోనూ భాగంగా చేసుకుంటే మనమూ ఆరోగ్యవంతంగా ఉండగలుగుతాం.

–నివేదిత



# మహానంది



-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**నంది ఆ ఇద్దర్నీ చిరునవ్వుతో చూశాడు. "సర్వసంగ పరిత్యాగులం. అన్నీ వదులుకున్న సన్యాసులం. మా వద్ద ఏముంటుంది నాయనా?"**

**ఒక దొంగ నంది ముఖంలోకి ఎర్రగా చూసి, చెట్టు బోదెను దాటుకుని, శకటం వైపు వచ్చాడు. బండిలోపల కూర్చుని, తొంగి చూస్తున్న లాలసను నిదానించి చూశాడు. గొల్లున నవ్వుతూ నంది వైపు చూశాడు.**

**"అన్నీ వదులుకున్నోడికి ఆడకూనెందుకురా బైరాగోడా? ఆ కూన సవులకూ, ముక్కుకూ బెమ్మాండమైన సొమ్ములున్నాయి గదరా! అవిచ్చుకో!" బండి వెనకవైపు వెళ్తూ అన్నాడు మొదటి దొంగ. ఒకసారి దగ్గి గొంతు సవరించుకున్నాడు.**

ఆ దగ్గు సంకేతాన్ని అర్థం చేసుకున్న రెండవ చోరుడు బండి ముందు వైపు చేరాడు.

"కూనా! సొమ్ములు ఒలిచి ఇచ్చుకో!" బండి వెనుక నిలుచున్న దొంగ బెదిరింపుగా అన్నాడు.

లాలస అప్రయత్నంగా ముందుకు జరిగి, నంది భుజం మీద చేతిని వేసింది. నంది నేల మీదికి దూకాడు. బండి వెనక ఉన్న దొంగ దగ్గరగా వెళ్ళాడు. వాడికీ, బండికీ మధ్య అడ్డుగా నిలుచున్నాడు. వాడి కళ్ళల్లోకి తదేకంగా చూశాడు.

"దారికి అడ్డంగా వేసిన చెట్టును తీసివేసి, దూరంగా వెళ్ళిపొండి!"

"ఏయ్ బైరాగోడా! ఈ కోనలో ఏలుబడి మాదేరా! తిరగబడితే బొమికెలిరుగుతాయ్! చెక్క భజన చేయడానికి చేతుల్లెగవ్వు ఆనక!"

"సుంకం ఇవ్వం! ఏం చేస్తావ్." నంది తీక్షణంగా చూస్తూ అన్నాడు.

"బైరాగులతో సుద్దులేంటి గిడ్డన్నా! ఏసెయ్!" రెండో దొంగ బిగ్గరగా అంటూ వాళ్ళ దగ్గరగా వచ్చాడు.

గిడ్డన్న అనే మొదటి దొంగ చేతిలోని దుడ్డు కర్రను పైకెత్తాడు. నంది చేతిని అడ్డుగా పెట్టి, కండరాల్ని బిగించాడు. కండరాల్ని ఇనుపచువ్వల్లా చేస్తూ అతని పిడికిలి బిగుసుకుంది. గిడ్డన్న చేతిలోని దుడ్డుకర్ర కత్తిలాగా నంది చేతిమీద వాలింది. చప్పుడు చేస్తూ రెండు ముక్కలుగా విరిగిపోయింది. గిడ్డన్న నిర్ఘాంతపోతూ నోరు తెరిచాడు.

నంది కుడికాలు సమ్మెటలా గిడ్డన్న మోకాలిని తాకింది. ఎముక విరుగుతూ చప్పుడు చేసింది. గిడ్డన్న భయంకరంగా కేక పెట్టి, ముందుకు వంగాడు. రెండవ దొంగ కనుగుడ్లను గుండ్రంగా చేసుకుని, క్షణంసేపు ఆశ్చర్య ప్రతిమలా ఉండిపోయాడు.

తేరుకుని నందివైపు నిప్పులు కక్కుతూ చూశాడు. దుడ్డుకర్ర ఉన్న అతని చెయ్యి పైకి లేచింది. నంది చెయ్యి చివాలున కదిలింది. అతని వేళ్ళు దొంగ మణికట్టును చుట్టేశాయి. తన మణికట్టు చుట్టూ పట్టకారులా బిగుస్తున్న నంది వేళ్ళను ఆందోళనగా చూశాడు చోరుడు. అతని ప్రయత్నం లేకుండానే దుడ్డుకర్ర పట్టుకున్న అతని వేళ్ళు వదులవుతున్నాయి. క్షణంలో దుడ్డుకర్ర నేలమీద పడి

చప్పుడు చేసింది. నంది పట్టు మరింత బిగిసింది. దొంగ కెవ్వుమన్నాడు. అతని ఎడమ చేయి నంది వైపు గున్న ఏనుగు తొండంలా సాగింది.

నంది కుడిచేతి వేళ్ళు అతని మణికట్టు చుట్టూ బిగుసుకున్నాయి. నంది చేతి కదలికలోని వేగం అతన్ని ఆశ్చర్యంలో పడవేసింది. నంది అతని ముఖంలోకి చిరునవ్వుతో చూశాడు.

"బైరాగోడితో సుద్దులేంటా? ఏసెయ్యాలా?" అంటూ రెండు చేతుల్నీ ఒకేసారి మెలిపెట్టసాగాడు.

పళ్ళబిగువున కాసేపు బాధ భరించిన అతని కంఠంలోంచి మూలుగు వెలువడింది. బడితె దెబ్బ తిన్న పందిలా కర్ణకఠోరంగా మూలిగాడతను. నంది వైపు భయంగా చూస్తున్న అతని కళ్ళల్లో ఆశ్చర్యం, ఉక్రోషం జంటగా ప్రత్యక్షమవుతున్నాయి. నంది తటాలున అతని చేతుల్ని వదిలేశాడు. అతని రెండు చేతులూ పురి వదులైన మోకుల్లా వేలాడాయి. నంది చేతులు కదిలాయి. అరచేతులు దొంగ చేతుల్ని పగలేస్తూ పెద్దగా చప్పుడు చేశాయి. దొంగ బిగ్గరగా అరిచాడు. వెనక్కి తూలుతూ అడుగులు వేశాడు. నంది రెండు చేతుల్తో అతన్ని పట్టుకున్నాడు. ఒక్కసారిగా పైకెత్తి కొద్దిగా కోలుకుని లేవబోతున్న గిడ్డన్న మీదికి గడ్డిమోపును వేసినట్టు వేశాడు. గిడ్డన్న కెవ్వుమన్నాడు.

రెండవ దొంగ చేతిలోంచి కిందపడిన బెత్తం అందుకున్నాడు. కఱ్ఱ నంది చేతిలో మెరుపులా కదల సాగింది. దొంగల శరీరాల మీద తన స్పర్శ ముద్రలుగా వాతలు గీస్తోంది. దొంగలు భీకరంగా అరుస్తున్నారు. కఱ్ఱ నంది చేతిలో నాట్యం చేస్తోంది.

"నందీ!" బండి చివరకి జరిగి, జరుగుతున్న నాటకాన్ని చూస్తున్న లాలస పిలిచింది.

నంది ఆమెవైపు తలతిప్పి చూశాడు.

"చాలు..వదిలెయ్" అంది లాలస.

నంది దొంగల వైపు, కిందకి చూశాడు. ఇద్దరి ముఖాలూ చెమటతో తడిసిపోయి ఉన్నాయి.

## జరిగిన కథ

కామరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడిని రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగారశిక్ష విధించాడు మహారాజు కుబేరవర్మ. రుద్రాక్షుడి కొడుకు నందికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తాడు. స్వయంవరం రోజున యువరాణి లాలసాదేవి మాయమవుతుంది. తనను అపహరించిన కళింగరత్న చెరనుంచి తప్పించుకున్న లాలసను నంది రక్షిస్తాడు. కళింగరాజ్యం నుంచి నిష్క్రమిస్తారిద్దరూ. మార్గంలో ఎదురవుతున్న ఆపదల నుంచి తప్పించుకుంటూ, సారంగ రాజ్యంలోకి ప్రవేశిస్తారు. అక్కడ తమను బంధించటానికి ప్రయత్నిస్తున్న వారినుంచి తప్పించుకుని, లాలససహా మళ్లీ అడవిదారి పడతాడు నంది. గంగిరెద్దును కొనుగోలు చేసి, ఇద్దరూ తమ వేషాలు మార్చుకుంటారు. వేషానికి తగ్గట్టుగా తన మెడలో పసుపుతాడు కట్టమన్న లాలసకు, తన గతాన్ని వివరిస్తాడు నంది. ఆమె అభ్యర్థనను తిరస్కరిస్తాడు. కాలినడకన కేదారిక రాజ్యంలోకి ప్రవేశిస్తారు. ఆ రాజ్యం కామరూప రాజ్యానికి పొరుగురాజ్యమని తెలుసుకుంటారు. లాలస నందిని కామరూప రాజ్యప్రవేశానికి ఒప్పించి, పథకం సిద్ధం చేస్తుంది. ఇద్దరూ సన్యాసి వేషాల్లో, అశ్వశకటంలో కామరూప రాజ్యానికి బయలుదేరతారు. అడవిమధ్యలో ఇద్దరు దొంగలు వాళ్ళను అడ్డుకుంటారు. ఆ తర్వాత....

కళ్ళల్లో భయం కాపురం చేస్తోంది. నంది వైపు దీనంగా చూస్తూ ఇద్దరూ చేతులు జోడించారు.



నంది కర్రను రెండుగా విరిచి పొదల్లోకి విసిరాడు.

"సుంకం చాలా, ఇంకా కావాలా?" నంది ఇద్దర్నీ కలియజూస్తూ అన్నాడు.

"సన్యాసుల్లో ఇంత సత్తా ఉంటుందని ఎరుక లేదు సాములూ...బుద్దొచ్చింది సాములూ... తప్పయి పోనాది.." మొదటి దొంగ గిడ్డన్న బొంగురుగా అన్నాడు.

"సన్యాసుల్లో ఆత్మబలంతో పాటు కండ బలమూ, గుండె బలమూ అన్నీ ఉంటాయి గిడ్డా! వచ్చిన బుద్ధిని పదిలంగా ఉంచుకుని, కాయకష్టం చేసుకుని బతకండి. ఇలాగే దారి దోపిడీలు కొనసా గిస్తే ఎవడి కత్తికో, బాణానికో బలైపోతారు."

"కాలిరిగి పోయినట్టుంది సాములూ, ఇంకేం దారికాస్తాను సాములూ? అట్టాగే..సాములూ!" గిడ్డన్న ఏడుపు గొంతుతో అన్నాడు.

***

దేవలుడు అశ్వశకటాన్ని నూతనోత్సాహంతో, వేగంగా నడుపుతున్నాడు. తన పక్కనే కూర్చున్న నిత్యనిర్మలానందుల వైపు ఓరగా చూశాడు. ఆయ నంటే తనలో ఏర్పడిన కొద్దిపాటి భక్తి కొండంత భక్తిగా ఎదిగింది. దానికి తోడుగా భయం వేసింది!

"స్వామీ..." దేవలుడు భయభక్తులతో పిలిచాడు.

"ఏమిటి నాయనా..?" నంది సౌమ్యత ఉట్టి పడేలా అడిగాడు.

"మీరు సన్యాసులో, మహావీరులో అర్థం కావడం లేదు. ఖడ్గమృగం లాంటి ఇద్దరు దొంగలను ఒంటి చేత్తో చావబాదేశారు. దారికి అడ్డంగా ఉన్న చెట్టు బోదెను అవలీలగా పక్కకి జరిపారు. సన్యాసులకు అదెలా సాధ్యం స్వామీ?"

నంది చిరునవ్వు నవ్వాడు. "ఆ దొంగలకే చెప్పా నుగా నాయనా? మాకు ఆత్మబలం ఉంటుంది. దానితో పాటు గుండెబలం ఉంటుంది. దానికి అను బంధంగా కండబలం ఉంటుంది..."

"అదే ఆశ్చర్యంగా ఉంది..." దేవలుడు అన్నాడు.

"నేను మొదట్లో బౌద్ధ భిక్షకుడిగా ఉండేవాణ్ణి. 'మహాయానం' అనే శాఖ నుండి 'హీనయానం' అనే శాఖలోకి మారాను. ఆ శాఖ ఆత్మరక్షణార్థం వజ్ర ముష్టి అనే యుద్ధ విన్యాసం నేర్పుతుంది. అందులో నేను చక్కటి శిక్షణ పొందానులే!" నంది తెలివిగా అన్నాడు.

"మీ గతం చాలా గొప్పది గురుదేవా!" అంది నంది మాటలు విన్న లాలస.

"ఔను కల్యాణీ... నా గతం గొప్పదే. నేటి వరకూ అడుగు మోపిన ఊరే నా ఊరయింది! మన వేద భూమి అంతా నా జన్మస్థలం అయిపోతుందను కున్నాను!" నంది నర్మగర్భంగా అన్నాడు.

"దేశమంతా తమ ఊరే అనుకోవడం, భూమండల మంతా తమ దేశమే అనుకోవడం చాలా గొప్ప ఆలోచన స్వామీ! ఆ విధంగా గొప్పగా ఆలోచించడం తమవంటి సర్వసంగ పరిత్యాగులకే సాధ్యం స్వామీ!" దేవలుడు మెచ్చుకున్నాడు.

"అంతే నాయనా! పుట్టిన ఊరు నీ ఊరు కాన ప్పుడు, మెట్టిన ఊరే నీ ఊరు. జన్మించిన దేశం నీ దేశం కానప్పుడు, తలదాచుకున్న దేశమే నీ దేశం! భూలోకమంతా ఒకే కుటుంబం అన్న భావన కదా మనది!" నంది చిరునవ్వుతో అన్నాడు.

"నా అశ్వశకటంలో మీరు ప్రయాణం చేయడం నా అదృష్టం స్వామీ!" దేవలుడు చేతులు జోడిస్తూ అన్నాడు.

"నిజం చెప్పుకోవాలంటే, నీ అశ్వశకటం లభిం చడం మా అదృష్టం నాయనా. లేకపోతే కామరూప నగరానికి కాలినడకన వెళ్ళాల్సి వచ్చేది!" నంది అన్నాడు.

దేవలుడు ఉత్సాహంగా అశ్వాలను అదలిం చాడు.

***

సాయంకాలం కావస్తోంది. అశ్వశకటం కామ రూప నగర ప్రవేశద్వారం సమీపిస్తోంది. లాలసలో, నందిలో ఉద్వేగం ఉప్పెనలా పొంగుతోంది. దూరమైన తల్లిదండ్రులకు దగ్గర అవుతున్న ఉద్వేగం ఒకరిది. బహిష్కరించబడిన దేశంలోకి, నగరంలోకి మారు వేషంతో ప్రవేశిస్తున్న ఉద్వేగం ఒకరిది. ఉద్వేగంతో పాటు నందిలో ఏదో ఉత్సాహం ఉరకలు వేస్తోంది. జీవిత ధ్యేయాన్ని సాధించే సువర్ణావకాశం తనకు లభిస్తోంది. యువరాణి లాలస చొరవతో, ధైర్యంతో తనకు ఆ అవకాశాన్ని అందిస్తోంది.

తన కామరూప నగర ప్రవేశం శిరచ్ఛేద శిక్షకు అవకాశం ఇచ్చే సాహసం. అది శాసన ధిక్కారం. అయితే తన తర్కంతో లాలస తనను ఒప్పించింది. అన్యాయాన్ని కూలగొట్టడానికీ, న్యాయాన్ని నిలబెట్ట

**అశ్వశకటం కామరూప నగరంలోకి ప్రవేశించింది. ఇద్దరిలోనూ ఉద్వేగం. తెలిసిన పరిసరాలు, వీధులు, భవనాలు, మనుషులు... పుట్టినగడ్డ గాలి, మట్టివాసన వాళ్ళను పారవశ్యంలో ముంచెత్తుతున్నాయి. తననెవరయినా గుర్తుపడతారో లేదో తెలుసుకోవాలనుకున్నాడు నంది. అందరినీ చిరునవ్వుతో చూస్తున్నాడు. మరి ఎవరయినా నందిని గుర్తుపట్టారా?**

డానికీ తను శాసన ధిక్కారం చేస్తున్నాడు. తన పరిధిలో ధర్మ రక్షణ కోసం శాసన ధిక్కారం చేస్తున్నాడు. తండ్రినీ, చెల్లినీ విముక్తుల్ని చేశాక శాసన ధిక్కార శిక్షను ధైర్యంగా, సంతోషంగా అనుభవిస్తాడు తను. ఛేదించబడటానికి శిరస్సు వంచుతాడు!

"నందీ..." తగ్గు స్వరంతో పిలిచిన లాలస వెంటనే సర్దుకుంటూ "గురుదేవా" అంది.

నంది వెనక్కి తిరిగి బండిలోనికి చూశాడు. లాలస ముఖం కళకళలాడుతోంది. కళ్ళు వత్తులు ఎగసనదోసిన జ్యోతుల్లా వెలిగిపోతున్నాయి.

"చాలా కాలం తరువాత నిండుగా స్వచ్ఛమైన ప్రాణవాయువును పీల్చినట్టుంది!" లాలస పారవ శ్యంతో అంది.

"అంతే కదా! ఎంత సన్యసించినా జన్మస్థలం జన్మస్థలమే కద! పుట్టిన గడ్డ గాలి వేరు. ఆ గడ్డ మీది మట్టివాసన వేరు!" నంది చిరునవ్వుతో అన్నాడు.

"చక్కగా చెప్పారు గురుదేవా!" లాలస అంది.

అశ్వశకటం నగర ప్రవేశద్వారంలో శిల్పకళ ఉట్టి పడుతున్న శిలాతోరణం కిందకి చేరింది. నగర వాసులు తనను గుర్తు పడతారేమో! బండి లోపలికి వెళ్ళాలనిపించింది నందికి. మరుక్షణం ఒక విజ్ఞత ఆ ఆలోచనను తొక్కివేసింది. కాషాయ వస్త్రాల్లో మెడ నిండా రుద్రాక్ష మాలలతో, నుదురు మీద ఊర్ధ్వ పుండ్రాలతో, ఆ విభూతి రేఖల మధ్య నిప్పుకణిక లాంటి ఎర్రటి కుంకుమ బొట్టుతో, శిఖలా చుట్టిన జుత్తుతో, పెరిగిన గెడ్డంతో, మీసాలతో ఉన్న తనను ఎవరైనా పోల్చుకోగలరేమో తను పరీక్షించాలి! తాను ధరించిన సన్యాసి వేష ప్రభావాన్ని పరీక్షిం చాలి! నంది అంతసేపూ తన శరీరాన్ని కప్పిన కాషాయ వర్ణ ఉత్తరీయం తీసి, భుజం మీద వేసు కున్నాడు. తన శరీరం అవకాశం ఉన్నంత మేరా అందరికీ కనిపించాలి! అశ్వశకటం రాజవీధిలోకి ప్రవేశించింది. నంది వెనుదిరిగి బండి మధ్యలో కూర్చున్న లాలస వైపు చూశాడు. అతని కళ్ళు ఆశ్చర్యంతో కొద్దిగా విచ్చుకున్నాయి. లాలస ముఖం మేలి ముసుగులో దాగి ఉంది! నగర ప్రవేశం చేయగానే ఆమె మునుపటిలా అంతఃపుర కన్యగా మారిపోయింది!

"కల్యాణీ!" నంది పిలిచాడు.

"స్వామీ..."

"అది అమ్మాయిగారి పేరా స్వామీ?" దేవలుడు అడిగాడు.



"ఔను నాయనా, ఏం?"

"ఏం లేదు స్వామీ...ఊరికే అడిగాను.." దేవ లుడు అన్నాడు.

"కల్యాణీ, నగరంలో ఎక్కడికి వెళ్ళాలి?" నంది అడిగాడు.

"ముందు కామరూపాంబిక ఆలయానికి వెళ్ళి దర్శనం చేసుకుందాం గురుదేవా. ప్రశస్తమైన ఆలయం!"

"నాయనా దేవలా! రాజవీధిలో శకటాన్ని చాలా నెమ్మదిగా పోనీ నాయనా!" నగరవాసులకు తనను బాగా చూసే అవకాశం కల్పించాలన్న ఆలోచనతో ఉన్న నంది అన్నాడు.

అశ్వశకటం వేగం తగ్గింది. రాజవీధిలో జనసం చారం బాగా ఉంది. అటూ ఇటూ నడుస్తున్న వాళ్ళూ, ఇళ్ళ అరుగుల మీద కూర్చున్న వాళ్ళూ గుర్రాల మీద వెళ్తున్న వాళ్ళూ, వస్తున్న వాళ్ళూ తన వైపు ఒకసారి చూసి, చూపులు తిప్పుకుంటున్నారు. ఎవ్వరూ తనను తేరిపార చూడటం లేదని నంది గ్రహించాడు. రాజవీధిలో రాకపోకలు సాగిస్తున్న వాళ్ళందరూ తనకు తెలిసినవాళ్ళే! తమ నివాస గృహం రాజవీధిలోనే ఉంది.

తనను చూసిన కొందరు స్త్రీలూ, వృద్ధులూ చేతులు జోడించి నమస్కరిస్తున్నారు. వాళ్ళ దృష్టిలో తను నంది కాదు. ఎవరో సాధుపుంగవుడు! లాలస ముందుచూపును మెచ్చుకోకుండా ఉండలేకపో యాడు నంది. తన స్వరూపం బైటపడుతుందన్న భయం ఇంక లేదు! కొద్దిగా మాట తీరు మార్చు కుంటే చాలు!

రాజవీధి మధ్యలో నెమ్మదిగా వెళ్తోంది శకటం. ఇరువైపులా చూస్తున్నాడు నంది. చిన్ననాటి నుండీ చూసిన గృహాలూ, ముఖాలూ నందిలో ఏదో తెలి యని ఆనందం తొణికిసలాడుతోంది. ఉన్నట్టుండి అతని కళ్ళు మెరిశాయి. రాజవీధిలో తమకు ఎదురుగా ఒక యువకుడు వస్తున్నాడు. ఆ యువకుడు తన ప్రాణ మిత్రుడు...మానితుడు! మిత్రుణ్ణి గొంతెత్తి పిలవాలన్న కోరిక బలవంతాన అణగద్రొక్కుతూ, అతని వైపే తదేకంగా చూస్తూ ఉండిపోయాడు నంది.

అది తన మారువేషానికి పరీక్ష! తన ప్రాణ మిత్రుడు మానితుడికి పరీక్ష! మెల్లగా నడుస్తున్న మానితుడి దగ్గరగా వెళ్ళింది అశ్వశకటం. మాని తుడు శకటం మీదున్న కాషాయ వస్త్రధారిని క్షణ కాలం చూసి, తన దారిన వెళ్ళసాగాడు. తన మారు వేషం బాల్యమిత్రుడి కళ్ళు గప్పింది. మానితుడి కళ్ళుగప్పిన తన అవతారం అందరి కళ్ళనూ కప్పు తుంది. సందేహం లేదు! భయం లేదు!

నంది అసంకల్పితంగా కుడివైపు చూశాడు. విశా లంగా ఉన్న ఆవరణలో ఎత్తుగా ఉన్న భవనం. తను పుట్టి పెరిగిన భవనం. సర్వసైన్యాధ్యక్షుడైన తన తండ్రి నిర్మించిన భవనం. జన్మనిచ్చిన తల్లి నడయా డిన భవనం. చెల్లి దీపాంకురా, తనూ ఆడిపాడిన అందాల భవనం. తమ కుటుంబానికి శిక్ష విధించి, చక్రవర్తి స్వాధీనం చేసుకుని, మరెవరో రాజోద్యోగికి ధారాదత్తం చేసిన భవనం.

చెమ్మగిల్లుతున్న నంది చూపులనుండి భవ నాన్ని దూరం చేస్తూ, అశ్వశకటం ముందుకు సాగి పోయింది. కామరూపాంబిక ఆలయ మార్గం తనకు తెలుసు. అయినా తెలియనట్టు నటించాలి తను! శకటం మరికొంత దూరం రాజవీధిలో ముందుకు వెళ్ళింది. గుర్రపు డెక్కల చప్పుడు. నంది తల తిప్పి చూశాడు. ఇందాక గుర్రంతో నడిచి వెళ్ళిన మాని తుడు అశ్వాన్ని అధిరోహించి వస్తున్నాడు!

గుర్రం మీద తన సమీపానికి వచ్చిన మాని తుణ్ణి చిరునవ్వుతో చూశాడు నంది. "నాయనా, కామరూపాంబిక ఆలయానికి దారి చెప్పగలవా?"

మానితుడు తన గుర్రాన్ని కొద్దిగా నిలువరిం చాడు. "ఇది రాజవీధి. కొంచెం దూరం వెళ్ళాక, కుడి వైపున శిలాతోరణం కనిపిస్తుంది. ఆ శిలాతోరణం కింద నుంచి వెళ్ళండి స్వామీ. ఆలయానికి చేర్చే దారి అదే" మానితుడు వివరంగా చెప్పి, గుర్రం మీద వేగంగా వెళ్ళిపోయాడు. నంది తనలో తనే నవ్వుకున్నాడు. మానితుడు తన రూపాన్నీ, తన కంఠస్వరాన్నీ పోల్చుకోలేకపోయాడు! నంది తేలి కగా నిట్టూర్పు విడిచాడు. కామరూప నగరంలో నిర్భయంగా సంచరించవచ్చు. శిరస్సు మీద చుట్టిన శిఖ, పెరిగిన గెడ్డం, మీసాలు, మెడ నిండుగా వక్ష భాగాన్ని సగం పైగా కప్పి వేసిన పొట్టి, పొడుగూ రుద్రాక్ష మాలలు, నుదురును దాచిన విభూతి, దాని మీద కుంకుమ, కాషాయ వస్త్రాలు ఇవన్నీ తన నిజ స్వరూపాన్ని సమర్థవంతంగా దాచిపెడుతున్నాయి.

అశ్వశకటం ఆలయ మార్గంలో వెళుతోంది. భక్తులు ఆలయంవైపు నడుస్తున్నారు. అమ్మవారి సంధ్యా దర్శనం కోసం....అశ్వశకటం ఆలయ గోపురం వద్ద ఆగింది. నంది అప్పటికే చేతిలోకి తీసు కున్న నాణేలను దేవలుడికి ఇవ్వడానికి చేయి చాచాడు.

"నాయనా, ఇదిగో నీ శ్రమకూ, నీ అశ్వాల శ్రమకూ ప్రతిఫలం" అన్నాడు.

దేవలుడు తీసుకోకుండా చేతులు జోడించాడు. "మీరు ఆత్మబలం, గుండెబలం, కండబలం అన్నీ ఉన్న మహా సాధువులు. నన్ను దీవించండి. మీ దీవె నలే పదివేలు నాకు!"

నంది చిన్నగా నవ్వాడు. "నా దీవెనలు ఈ వరహా లలో ఉన్నాయి. మాలాంటి వ్యక్తులు ఏది ఇచ్చినా తీసుకోవాలి నాయనా... తిరస్కరించకూడదు!"

దేవలుడు వినయంగా దోసిలి పట్టాడు. నంది చేతిలోని వరహాలు గలగలలాడుతూ అతని దోసిట్లో పడ్డాయి.

"నాయనా, నీ తిరుగు ప్రయాణం?"

"ఈ రాత్రి ఏ సత్రం వద్దో విడిది చేస్తాను స్వామీ. వేకువజామున బయలుదేరుతాను" దేవ లుడు అన్నాడు. "ఆ దోపిడీ దొంగలున్న అరణ్య మార్గంలో కాకుండా మరో దారిలో వెళ్తాను."

"మంచిది నాయనా. క్షేమంగా వెళ్ళిరా!" నంది చిరునవ్వుతో అన్నాడు. అప్పటికే బండి వెనుక వైపు నుండి కిందకి దిగి, ముఖం కనిపించకుండా కాషాయ వర్ణం పైట బాగా కప్పుకున్న లాలస వైపు నడిచాడు నంది.

అశ్వశకటం వెనుకకు తిరిగింది. దేవలుడు నందికి మళ్ళీ నమస్కరించి, అశ్వాలను అదిలిం చాడు.

"గురుదేవా, దేవీదర్శనం చేసుకుందాం!" తమ వైపు ఆసక్తిగా చూస్తూ ఆలయం లోపలకీ, ఆలయం లోంచీ వెలుపలికీ వెళ్తున్న స్త్రీ పురుషుల్ని గమనిస్తూ అంది లాలస.

"సరే కల్యాణీ, పద!" అంటూ నంది కదిలాడు. గోపురం కింద నుండి ఆలయ ప్రాంగణంలోకి ప్రవే శించిన ఇద్దరూ ధ్వజస్తంభాన్ని సమీపించారు. లాలస ధ్వజస్తంభాన్ని రెండు చేతులతో స్పృశించి,

## రెచ్చిపోతున్న సారా అలీఖాన్



ఇంకా ఒక్క సినిమా అన్నా చేయలేదు. అప్పుడే అందాల ప్రదర్శనకు శ్రీకారం చుట్టేసింది సైఫ్ కూతురు సారా అలీఖాన్. సైఫ్ ముద్దుల భార్య కరీనా ఇటీవల తన ఇంట్లో ఓ పార్టీ ఏర్పాటు చేసింది. షరా మామూలుగా ఈ పార్టీకి సెలబ్రిటీలను ఆహ్వానించింది. పనిలో పనిగా పెద్ద మనసు చేసుకుని సవతి కూతురు సారాను కూడా రమ్మంది. పినతల్లి పిలిస్తే కూతురు రాకుండా ఉంటుందా? సారా కూడా వచ్చింది. మామూలుగా వస్తే వార్తే కాదు. కానీ పార్టీలో అందరికన్నా హాట్ హాట్‌గా డ్రస్ చేసుకుని అందరి కన్నూ తనమీద పడేలా చేసుకుంది. కూతురు సినిమాల్లోకి రావడం ఆమె కన్నతల్లి అమృతాసింగ్‌కు ఇష్టం లేదట కూడా! తల్లి ఇష్టా ఇష్టాలతో పనిలేకుండా సారా రెచ్చిపోవడం ఇపుడు బాలీవుడ్‌లో హాట్ టాపిక్ అయింది.

కళ్ళకు అద్దుకుంది. ఆమె చేతులు వణుకుతున్నాయి.

"నీ చేతులు వణుకుతున్నాయి...." నంది మెల్లగా అన్నాడు.

"సర్వస్వమూ వణికిపోతోంది. ఉద్వేగం!" లాలస వణికే కంఠంతో అంది. "ముందుకు వెళ్దాం" అంటూ దారి తీసింది.

ప్రధానార్చకుడు మంత్రపఠనం చేస్తూ భక్తులకు తీర్థం ఇస్తున్నాడు. లాలస మేలి ముసుగులో నుంచే కామరూపాంబికా దేవి విగ్రహాన్ని దర్శించింది. వణుకుతున్న చేతులు జోడించి, ఆ దేవతకు కృతజ్ఞతలు చెప్పుకుంది. ఆమె విశాల నేత్రాలకు అడ్డుగా ఆనందబాష్పాలు మేలి ముసుగు లోపల మరొక పల్చటి తెరను సృష్టిస్తున్నాయి.

తన ప్రయత్నం ఫలించేలా చేయమని నంది కామారూపాంబికను మౌనంగా ప్రార్థించాడు. అర్చకుడు వాళ్ళ ముందుకు వచ్చాడు. నంది తీర్థం తీసుకున్నాడు. అర్చకుడు లాలసవైపు తీర్థంతో నిండిన ఉద్ధరణిని చాపాడు. లాలస తన తలను అతని తల వైపు వాల్చింది.




"కాత్యాయనాచార్యులవారూ, మీతో రహస్యంగా మాట్లాడాలి. నేను యువరాణి లాలసను.."

తన చెవిలో గుసగుసగా అన్న యువతి వైపు, మేలి ముసుగులో దాగిన ముఖంవైపు కళ్ళు చిట్లిస్తూ చూశాడు కాత్యాయనుడు. లాలస తన ముఖాన్ని కప్పిన పల్చటి మేలి ముసుగును కొద్దిగా పైకెత్తింది. కాత్యాయనుడి కళ్ళూ, నోరూ తెరుచుకున్నాయి ఆశ్చర్యంతో. ఉద్ధరణి పట్టుకున్న అతని చెయ్యి వణికింది. ఉద్ధరణి చిన్నగా చప్పుడు చేస్తూ తీర్థం గిన్నె ఉన్న పళ్ళెంలో పడింది.

"అమ్మా.."

"అందరినీ పంపించేయండి!" లాలస అర్చకుడికి మాత్రమే వినిపించేలా అంది.

అర్చకుడు తేరుకుని లాలసకు తీర్థం ఇచ్చాడు. "మీరు సాధువులు. గర్భాలయం ముందున్న మండపంలోకి దయ చేయండి. దర్శనానికి వచ్చిన సాధువులను సత్కరించడం ఆలయ సంప్రదాయం" కాత్యాయనుడు అన్నాడు. సహాయకుడి వైపు తిరిగాడు.

"భక్తులను వెలుపలికి పంపివేసి కాసేపు తలుపులు మూసివేయి నాయనా!" అన్నాడు సహాయకుడితో.

***

కామారూపాంబిక విగ్రహం ముందున్న మండపంలో లాలస, నందీ నిలుచున్నారు. వాళ్ళముందు అర్చకుడు కాత్యాయనుడు కొద్దిగా వణుకుతున్న చేతుల్ని నలుపుకుంటూ నిలుచున్నాడు. లాలస మెల్లిగా ముసుగు తొలగించింది.

"తల్లీ, యువరాణీ...ఎక్కడికెళ్ళావమ్మా? ఎలా అంతర్ధానమయ్యావమ్మా?" అర్చకుడి కంఠం వణికింది.

"అన్నీ వివరంగా తరువాత చెప్పుకుందాం ఆచార్యా. వీరు...నన్ను రక్షించిన పుణ్యాత్ములు. నిత్య నిర్మలానందయోగి గారు. మీరు మందిరానికి వెళ్ళండి. నాన్నగారినీ, అమ్మగారినీ తీసుకురండి. కామరూపాంబిక సన్నిధిలో తల్లిదండ్రులను కలుసుకోవాలి నేను.." లాలస అంది.

కాత్యాయనుడు నంది వైపు చేతులు జోడించాడు. "అయ్యా, తమరు దైవస్వరూపులు. మా యువరాణిగారిని సురక్షితంగా తీసుకు వచ్చిన తమరు మా అందరికీ ఆరాధ్యులు!"

"ఆర్యా, ముందు రాజదంపతులను తీసుకు రండి. కన్నవారు కన్నబిడ్డను కలుసుకోనివ్వండి. పునఃస్సమాగ ఆనందం అనుభవించనీయండి!" నంది చిరునవ్వుతో అన్నాడు.

"చిత్తం!" కాత్యాయనుడు ద్వారంవైపు తిరిగాడు.

***

"దయచేయండి ప్రభూ! ఆనాడు యువరాణిగారు అంతర్ధానమైన దుర్వార్తను తమకు నివేదించిన దురదృష్టం నాది. ఈనాడు యువరాణిగారు ప్రత్యక్షమైన శుభవార్తను నివేదించిన అదృష్టమూ నాదే! దయచేయండి మహారాణీ! తమ పుత్రికా రత్నం కామరూపాంబికాదేవి సన్నిధిలో ఉన్నారు!" రాజదంపతులను ఆలయ అంతర్భాగానికి ఆహ్వానిస్తూ అన్నాడు అర్చకుడు కాత్యాయనుడు.

"మిమ్మల్ని తగువిధంగా సత్కరిస్తాం ఆచార్యా!" కుబేరవర్మ సంతోషంగా అన్నాడు.

"ఎంతమాట! ప్రభువుల సంతోషమే నాకు సత్కారం!" అర్చకుడు అన్నాడు, తలుపుల్ని లోపలికి తోస్తూ.

రాజదంపతులు లోపలికి వెళ్ళారు. కాషాయ వస్త్రాలతో ఎదురుగా నిలుచున్న లాలసను ఉద్వేగంతో చూశారు.

"అమ్మా! నాన్నా!" లాలస వణికే కంఠంతో గద్గదికంగా అరుస్తూ వాళ్ళ వైపు పరుగెత్తింది.

రాజదంపతుల కళ్ళు చెమ్మగిల్లుతున్నాయి. వాళ్ళ పెదవులు అదురుతున్నాయి. లాలస చేతులు ఇద్దరినీ చుట్టివేశాయి.

"తల్లీ..." మహారాణి ఏడుస్తూ అంది. ఆమె చేతులు లాలసను పొదివి పట్టుకున్నాయి.

మహారాజు కుబేరవర్మ కుమార్తె భుజాల చుట్టూ చేతిని వేశాడు.

తనముందు ఆవిష్కృతమవుతున్న వాత్సల్య దృశ్యాన్ని నంది చిరునవ్వుతో చూస్తూ ఉండిపోయాడు. తలుపును చేరవేసిన అర్చకుడు రాజకుటుంబం పేరిట కామారూపాంబికా దేవికి అర్చన చేస్తున్నాడు. క్షణాలు గడుస్తున్నాయి. రాజదంపతులనూ, లాలసనూ కుదిపివేసిన భావోద్వేగం నెమ్మదిగా తగ్గుముఖం పట్టింది. పోగొట్టుకున్న మహా ఐశ్వర్యాన్ని తిరిగి పొందిన ఆనందానుభూతి తల్లిదండ్రుల ముఖాలలో, పుత్రిక ముఖంలో నూతన కాంతిలా వెల్లివిరుస్తోంది.

అర్చకుడు అమ్మవారికి కర్పూర నీరాజనం సమర్పించి, హారతి పళ్ళెంతో వాళ్ళ ముందుకు వచ్చాడు. రాజదంపతులూ, లాలసా కర్పూరహారతిని కళ్ళకద్దుకున్నారు. అర్చకుడు నంది ముందుకు వెళ్ళాడు. నంది హారతి కళ్ళకు అద్దుకున్నాడు.

"నాన్నగారూ, అమ్మా...గురుదేవులు నిత్యనిర్మలానందయోగి గారు. అపహరించిన దుర్మార్గుల బారి నుండీ నన్ను రక్షించిన పుణ్యాత్ములు" లాలస నందివైపు చూస్తూ పరిచయం చేసింది.

మహారాజు కుబేరవర్మ, మహారాణి మహిమాదేవి నంది ముందుకు వెళ్ళి నమస్కరించబోయారు.

"ఆగండి మహారాజా!" నంది వారిస్తూ అన్నాడు.

రాజదంపతులు ప్రశ్నార్థకంగా చూశారు.

"క్షమించాలి. ఇది దేవత సన్నిధానం. ఆలయంలో అధిష్ఠానదేవతకూ, అధిష్ఠానదైవానికీ మాత్రమే నమస్కరించాలి. మానవులు ఎంత పెద్దవారైనా సరే ఆలయంలో నమస్కరించరాదు. అర్చకులకు కూడా! అందుకే వారించాను!" నంది వివరించాడు.

"మాకు పుత్రికా భిక్ష పెట్టారు. మీలో ఆ దైవాన్ని చూశాను.. అందుకే నమస్కరించబోయాను.." కుబేరవర్మ వినయంగా అన్నాడు.

"అవును స్వామీ. గతించిపోయిందనుకున్న మా కన్నబిడ్డను మా కళ్ళముందు నిలిపారు. మాకు మీరే దైవస్వరూపులు!" మహారాణి అంది.

"ఆర్యా...మీరు మా మందిరానికి దయ చేయాలి!" కుబేరవర్మ ఆహ్వానిస్తూ అన్నాడు.

"అవును. అక్కడ మా అభివాదాలనూ, అర్చనలనూ స్వీకరించాలి!" మహారాణి అంది.

"అమ్మా, గురుదేవులు మన అతిథిగా ఉండాలి!" లాలస అంది.

"అంతకంటేనా?" కుబేరవర్మ అన్నాడు.

**(ఇంకా వుంది)**

# సురభి



## నీటిగర్భంలో రెస్టారెంట్

రోజూ ఇంటి భోజనమేనా? అనుకునేవారు రెస్టారెంట్లకు పరుగెడతారు. అబ్బా... ఎప్పుడూ అవే రెస్టారెంట్లా? అనుకుని బాధపడే వారు కూడా కొంతమంది ఉన్నారు. అలాంటివారి కోసమే బ్రస్సెల్స్‌లో 'ద పెర్ల్ రెస్టారెంట్ వెలిసింది.

బెల్జియం రాజధాని నగరం బ్రస్సెల్స్‌లో నీటి అడుగున భోజనం చేసే అవకాశాన్ని 'ద పెర్ల్ రెస్టారెంట్ కల్పిస్తోంది. ఈ రెస్టారెంట్‌కి వెళ్లాలంటే మాత్రం స్కూబా ఎక్విప్‌మెంట్ తొడుక్కోవాల్సిందే! ఎందుకంటే ఈ రెస్టారెంట్ స్విమ్మింగ్‌పూల్ అడుగున నీటిలోపల ఐదు మీటర్ల లోతులో ఉంటుంది. లోపలికి వెళ్లాక, ఎక్విప్మెంట్ తీసేసి తెల్లని పాడ్‌లోకి వెళ్ళాలి. మీరు ఆర్డరిచ్చిన ఫుడ్‌ని వెయిటర్లు తెచ్చి టేబుల్ మీద సర్వ్ చేస్తారు. స్కూబా డైవర్లే వెయిటర్లిక్కడ. నలుగురు కూర్చోడానికి అనువుగా ఉంటుంది. శ్వాసకి వీలుగా ఆక్సిజన్ సప్లయి చేస్తారు. నీటి అడుగున భోజనం... తలుచుకుంటేనే ఆహా అనిపిస్తుంది, మరి నిజంగా అక్కడికి వెళ్ళి భోంచేస్తే...!

## హెల్ బెల్స్!

ఆ గుహలోకి అడుగుపెడితే బోలెడు గంటలు కనిపిస్తాయి మనకు. కానీ అవి మోగే గంటలు కావు. సైజులో కూడా ఆషామాషీగా ఉండవీ గంటలు. మరి వీటిని చూడాలంటే మెక్సికో వెళ్ళాల్సిందే! మెక్సికోలోని యుకటనాలో కెనోట్ జాపోట్ అనే చిన్నపాటి కొలను ఉంది. ఈ కొలను ఉపరితలం నుంచి వంద అడుగుల లోతులో ఓ గుహ ఉంటుంది. ఈ గుహలోనే నరకపు గంటలు (హెల్ బెల్స్) కనిపిస్తాయి. ఇవి నిజమైన గంటలు కావు, గంటల ఆకారాల్లో ఏర్పడ్డ నిర్మాణాలు. పైనుంచి వేలాడుతూ కనిపించే వీటి స్వరూపాన్ని బట్టి ఏనుగు పాదం, బూర, షవర్ హెడ్స్ అంటూ రకరకాల పేర్లున్నాయి. ఈ గుహలోకి వెళ్ళాలంటే కాస్తంత కష్టమే. ఎందుకంటే దారి సన్నగా, ఇరుగ్గా ఉంటుంది మరి. ఈత వచ్చిన వారు మాత్రం ఎంచక్కా గుహలోపలికి వెళ్ళి ఆ గంటల అందాలు తనివితీరా ఆస్వాదించేయచ్చు.





## భూకంప మ్యూజియం!

నేలపై బీటలు... కుంగిపోయిన నిర్మాణాలు... భూకంపం వచ్చి భూమంతా నెర్రెలతో ముక్కలయ్యిందనిపించే ఆనవాళ్లు... ఇవన్నీ 'వెన్‌చువన్' మ్యూజియం సంగతులు. చూడాలంటే చైనాలోని కుషాన్ పట్టణానికి వెళ్ళాల్సిందే.

భవనమంతా ఎగుడుదిగుడుగా నేలలోకి చొచ్చుకుపోయినట్టు, భవంతి పైకప్పు పగుళ్లతో ఉన్నట్టు, వాటిలో పచ్చని మొక్కలు మొలకెత్తినట్టు... కావాలనే ఈ మ్యూజియాన్ని ఇలా విచిత్రంగా నిర్మించారు. 2008లో వచ్చిన భూకంపం సృష్టించిన విషాదానికీ, మృతుల స్మృతికీ చిహ్నంగా అదే ప్రాంతంలో ఈ మ్యూజియం రూపొందించారు. కాయ్ యోంజీ అనే కళాకారుడు ఈ భవన ఆకృతికి 2013లో రూపకల్పన చేశాడు. లోపలికి వెళితే భూకంప బీభత్సాన్ని ప్రతిబింబించే వేలాది ఫొటోలు, రకరకాల శిల్పాలు, ఆయిల్ పెయింటింగ్స్ కనిపిస్తాయి. ఇక్కడికి ఏటా వేలాది మంది పర్యాటకులు వస్తుంటారు.

## భలే మజా ఫ్రిస్బి

రోలర్ కోస్టర్ ఎక్కితే గుండెలు చిక్కబట్టుకుంటారు. ఇక డెలిరియమ్ రైడ్‌కి వెళితే అంతే సంగతులు...!

అమెరికాలోని డోస్‌వెల్‌లోని 'కింగ్స్ డొమినియన్ థీమ్ పార్క్'లో ఈ డెలిరియమ్ రైడ్ ఏర్పాటు చేశారు. వంద అడుగుల ఎత్తయిన నాలుగు స్తంభాలతో, మధ్యలో లోలకంలా వేలాడే చక్రం ఉంటుంది. బటన్ నొక్కటం ఆలస్యం గిర్రుగిర్రున రౌండ్లు వేస్తూ, పైకీ కిందకీ ఊయలలా ఊపేస్తుంది. పల్టీలు కొడుతూ స్తంభాల కన్నా ఎత్తులోకి వెళ్ళి 120 డిగ్రీల కోణంతో ఊపేస్తుంది. నేలపై నుంచి 115 అడుగుల ఎత్తుకి తీసుకెళ్ళి మళ్ళీ కిందకు తెచ్చేస్తుంది. ఇదంతా 90 సెకన్లలో జరిగిపోతుంది. ఈ రైడ్‌నే 'ఫ్రిస్బి' అని కూడా పిలుస్తుంటారు. భలే మజాగా ఉంటుందిలే అనుకునేవారు ఈ రైడ్‌కి వెళ్ళి తమ సరదా తీర్చుకోవచ్చు.



## కార్టూన్స్ విలేజ్

ఆ ఊరికి వెళితే డోరెమాన్, యాంగ్రీబర్డ్స్, ట్రాన్స్‌ఫార్మర్లు అన్నీ కనిపిస్తాయి. నిజంగా అనుకునేరు... గోడల మీద పెయింట్ల రూపంలో దర్శనమిస్తాయి ఇవన్నీ.

తైవాన్ లోని హూజా గ్రామంలో అడుగుపెట్టగానే త్రీడీ సినిమాల్లో ఎంతగానో ఆకట్టుకున్న స్పాంజ్‌బాబ్ ఎదురవుతాడు. నడుస్తున్న కొద్దీ డోరెమాన్, నవ్వించే టోటోరో, మనకెంతో సుపరిచితమైన మిక్కీమౌస్, బగ్స్ బన్నీ, పండ్ల కార్టూన్లు, సరదాల మీనియన్స్, జంతువుల చిత్రాలు ఇలా ఒక్కటేంటి ఊరంతా వందలాది కార్టూన్ పాత్రలే. ఇంటి బయటా లోపలా, గుడీ, బడీ తేడాలే లేవు. ఎక్కడ చూసినా, ఎటువైపు చూసినా కార్టూన్ క్యారెక్టర్లే! ఈ బొమ్మల గ్రామం ఇలా మారడానికి కారణం ఓ ముగ్గురు అక్కాచెల్లెళ్లట. 2014లో తమ అమ్మమ్మగారింటికి వచ్చిన ఈ ముగ్గురూ ఇంటినంతా రంగురంగుల కార్టూన్ పాత్రలతో నింపేశారు. వాటిని చూసి, మిగతా గ్రామస్థులందరూ ఆ ముగ్గురినీ ఫాలో అయ్యారు. అలా ఆ ఊరు కార్టూన్ పాత్రలతో పర్యాటకులను తెగ ఆకర్షిస్తోంది.



–నర్మద వాసిరెడ్డి



# జీవితమే ఒక ప్రతిఘటన

(కోట శ్రీనివాసరావు కథాకథనం) 24

**అయితే 'బాహుబలి', లేకుంటే 'గౌతమిపుత్ర శాతకర్ణి' లాంటి సినిమాలు తప్ప మిగిలిన వన్నీ ఇంచుమించు కాస్త కథ అటూ ఇటూగా ఒకేరకంగా అనిపిస్తుంటాయి నాకు. పాత చిత్రాలు అలా లేవా? అని అడిగితే ఉండేవేమో. కాకపోతే ఏదో గమ్మత్తుగా, కాస్త పట్టుతో ఉండేవి.**

రాఘవేంద్రరావుగారు, దాసరి నారాయణరావు గారు, కె.విశ్వనాథ్‌గారు, జంధ్యాలగారు, ఈవీవీ... ఇలా ఎవరి పంథాలో వారు సినిమాలు చేసేవారు.

దాసరిగారు, జంధ్యాలగారు, ఈవీవీగారితో

## అప్పటినుండి అంతా నన్ను 'పెద్దాయన' అంటున్నారు

నేను చాలా సినిమాలే చేశానుగానీ, రాఘవేంద్రరావు గారితో మాత్రం అడపాదడపాగానే చేశాను. మహను భావుడి సినిమాల్లో నాకు సరైన వేషాలు పడలేదు. ఎందుకో ఇప్పటికీ అర్థం కాదు. ఆ బాధే కె.విశ్వనాథ్ గారి చిత్రాల విషయంలోనూ ఉంది.

### విశ్వనాథ్‌గారి మాటలే ఒక సర్టిఫికెట్

ఇక్కడ ఒకమాట తప్పకుండా గుర్తుచేసుకోవాలి. ఒకసారి కె.విశ్వనాథ్‌గారు నాతో ఒక మాట అన్నారు. ఆ మాటే కొన్ని కోట్ల రూపాయలకు సాటి. భారతీయ సినిమా వందేళ్ళ వేడుక సమయంలో మద్రాసులో పెద్దలందరూ ఒకచోట కూర్చున్నారు. నేను వెళ్ళి 'నమస్కారమండీ' అని అందరినీ పలక రించా. కె.విశ్వనాథ్‌గారు కూడా అక్కడే ఉన్నారు. ఉన్నట్టుండి ఆయన 'కోట శ్రీనివాసరావుగారిని నా సినిమాల్లో వాడుకోవడంలో నేను ఫెయిలయ్యా నండీ. ఆయనలోని నటుణ్ణి సరిగా వాడుకోలేకపో యాననే బాధ నాకు ఎప్పుడూ ఉంటుంది. వండర్ ఫుల్ ఆర్టిస్ట్. మామూలోడు కాదు. ఏ గ్లాసులో పోస్తే ఆ షేప్‌లో కనిపించే నీరు లాంటి నటుడు. చాలా వెరైటీ ఉన్న ఆర్టిస్ట్' అని ఒక్క నిమిషం నా గురించి మాట్లాడితే అందరూ శ్రద్ధగా వింటూ నవ్వుతూ చూడసాగారు. ఆ మాటలు నాకో సర్టిఫికెట్‌లా అని పించాయి.

రవిరాజా పినిశెట్టిగారు కూడా నా జీవితంలో ఒక ప్రత్యేకమైన వ్యక్తి. ఇప్పటికీ నేను చెన్నై వచ్చానని తెలిస్తే ఆయనే వచ్చి కలుస్తారు.

'ఎందుకండీ, నేనే వచ్చి కలిసేవాణ్ణిగా' అంటే, 'ఫర్వాలేదండీ. మీలాంటి వారిని నేను వచ్చి కలవ డమే కరెక్ట్' అంటారు. వాళ్ళబ్బాయిలకి పరిచయం చేసి 'లెజండరీ పర్సనాలిటీరా' అని నా గురించి చెప్పిన మాట మర్చిపోలేను. ఆర్టిస్ట్‌గా నేను సంపా దించుకున్నది రూపాయిలతో కొలిచేదీ కాదు, దాచి పెట్టేదీ కాదు.

సినిమారంగంలో నాకు హితులు చాలా మంది ఉన్నారు. సన్నిహితుల్లో తప్పక చెప్పుకోవాల్సింది కెమెరా మేన్ ఎస్.గోపాలరెడ్డిగారు. నిర్మాతగానూ ప్రసిద్ధులే అనుకోండి. నిర్మాతలు కె.ఎల్.నారాయణగారు, డి.సురేశ్‌బాబుగారితోనూ చాలా మంచి అనుబంధం ఉంది.

### రానా లీడర్

సురేశ్ బాబుగారి పేరు గుర్తురాగానే చెప్పాల్సిన చాలా విషయాలు నా మనసులో క్యూ కడుతున్నా యండీ. ఇప్పుడు గుర్తుకొచ్చింది 'లీడర్' చిత్రం. శేఖర్ కమ్ములగారు ఒక రోజు ఫోన్ చేసి 'కోటగారు ఒక సారి మిమ్మల్ని కలవాలండీ' అన్నారు.

మినర్వా కాఫీ షాప్ లో అనుకుంటా, కలిశాం.

'చూడండి. ఈ వేషం మీకు చాలా పేరు తెస్తుంది. మీరు చేస్తారని, మీరే చేయాలని రాసుకు న్నాను. మామూలు పొలిటికల్ వేషమే. సూపర్ వేషం అయితే కాదు. మీరు చాలా సినిమాల్లో చేసిన రాజకీయ నాయకుడి వేషం వంటిదే. కానీ ఇది టిపి కల్‌గా ఉంటుంది. సినిమా పూర్తయ్యాక మీరే నా మాట ఒప్పుకుంటారు' అన్నారు. సరేనని వచ్చేశా.

ఆయన దర్శకత్వంలో కొన్నిసార్లు అనుకున్నది అనుకున్నట్టు జరగదు.

'రేపు చేద్దామండీ కోటగారు' అనవచ్చు. వాయిదా పడినా, ముందే చేసినా ఆయన చెప్పే మాటల్లో ఒక జెన్యూన్ రీజన్ ఉంటుంది. అందులో నేను చేసింది 'పెద్దాయన' వేషం. ఆ సినిమా తర్వాత నన్ను అందరూ 'పెద్దాయనా నమస్తే' అనడం మొదలు పెట్టారు.

ఆ సినిమా పూర్తయి గుమ్మడికాయ కొట్టిన తర్వాత శేఖర్ కమ్ములగారు నన్ను కావలించుకుని 'చాలా అద్భుతంగా వచ్చింది సార్ మీ పోర్షన్' అని సంతోషం వ్యక్తం చేశారు. విజయవాడలో ఆ సినిమా సక్సెస్ మీట్‌లో నేను రానా గురించి కూడా చాలా బాగా చెప్పా. ఎందుకంటే రానా చాలా బాగా చేశాడు. ఒక నటుడిగా నాకు అనిపించింది చెబుతున్నా. నా మాటలు కొంతమంది యాక్సెప్ట్ చేయొచ్చు, చేయక పోవచ్చు, అదంతా వేరే విషయం. తొలి సినిమాలో అంత క్యారక్టర్ చేయడం చాలా కష్టం. అందులోనూ ఆ సినిమాలో డ్యాన్సులు, ఫైట్లు లేవు. సెటిల్డ్‌గా వెళ్ళాలి. అవతలేమో సుహాసినిగారు, మామూలు నటి కాదు. అంతటి అనుభవం ఉన్న వారితో చేసే టప్పుడు సహజంగానే టెన్షన్ ఉంటుంది. అవన్నీ దాటుకుని సినిమా చేయడం మామూలు విషయం కాదు. అయినా చేసి మెప్పించగలిగాడు. రానాలో ఒక మంచి నటుడు నాకు ఆ రోజే కనిపించాడు. ఆ సినిమా రానాకే కాదు, నాక్కూడా చాలా మంచి పేరు తెచ్చిపెట్టింది. ఆ సినిమా తర్వాత నేను ఎక్కడ



# పోయాక కూడా నటుడిగా బతకాలి



'మీ చివరి కోరిక ఏమిటి?' అని ఇంటర్వ్యూలు చేసేవారు అడుగుతూ ఉంటారు. ఏముంటుంది? న..ట...న. ఈ మూడు అక్షరాలే శ్వాసిస్తున్నాను. నటనతోనే జీవించాను. చివరి వరకు కీర్తినే మోయాలని అనుకుంటున్నాను. ఇప్పటికీ సినిమాల్లో చేస్తూనే ఉన్నాను. ఇక మీదట కూడా చేస్తాను. భవిష్యత్తులోనూ చేయగలను. భగవంతుడి దయవల్ల శరీరం అనుకూలిస్తూనే ఉంది. ఒక్క మాటలో చెప్పాలంటే, 'తెలిసో తెలియకో ముఖానికి రంగు వేసుకున్నాను. అందువల్ల నా ప్రాణం ఉన్నంత వరకు నేను నటించాలి. పోయిన తర్వాత కూడా నటుడిగా బతకాలి, అంతే. నన్ను మనిషిగా కంటే నటుడిగా అందరూ మెచ్చుకోవాలి. అదే నాకు చాలా గొప్ప సర్టిఫికెట్'.

ఇన్ని చెప్పానంటే పూర్వీకులు పెద్దలు, క్యారక్టర్ ఆర్టిస్టులు చాలా మంది ఉన్నారు. గుమ్మడిగారు, లింగమూర్తిగారు. నాగభూషణంగారు, గౌరినాథ శాస్త్రిగారు, నాగభూషణం వంటివారు చాలా మంది ఉన్నారు. వాళ్ళందరూ కేరక్టర్ ఆర్టిస్టులుగా నిరూపించుకున్నారు. వారందరూ మహానుభావులు. నా తరానికి వచ్చేసరికి కైకాల సత్యనారాయణగారు, రావు గోపాలరావుగారు, నూతనప్రసాద్‌లాంటివారు చాలామంది ఉన్నారు. కానీ వారందరికీ దక్కని అదృష్టం నాకు దక్కింది. అదే పద్మశ్రీ. ఎందుకంటే హీరోలకి రావడం వేరు, క్యారక్టర్ ఆర్టిస్ట్‌కి రావడం వేరు. అదే నాకు చాలా ఆనందంగా అనిపించింది. ఏదో నాకు ప్రాప్తం. అందుకే నాకు ఆవగింజంత అదృష్టం ఉందని ఫీలవుతా. దాన్ని నేను గౌరవంగా భావిస్తాను తప్ప, గర్వంగా భావించను.

కనిపించినా అందరూ 'పెద్దాయనా' అని పిలవసాగారు.

నా లైఫ్‌లో నా అదృష్టం ఏంటంటే నాకు కేరక్టర్లు వన్ బై వన్ పడసాగాయి. కేవలం నా వయసు పెరగడమే కాదు, దానికితగ్గ పాత్రలు కూడా పడసాగాయి. కోట పెద్దాయన అయ్యాడ్రా అని అందరూ అనుకునే సమయానికి కరెక్ట్‌గా 'పెద్దాయన' అని శేఖర్ కమ్ముల పాత్ర రాయడం ముమ్మాటికీ నా అదృష్టమే.

## బృందావనం తాత

ఇలాంటిదే ఇంకో గొప్ప సినిమా 'బృందావనం'. తారక్ (ఎన్టీఆర్)తో కొన్ని సినిమాలు చేసినప్పటికీ 'బృందావనం' నాకు చాలా తృప్తినిచ్చింది. అందులో నాది తాత వేషం.

'ఏమైనా సరే ఆ వేషం కోటగారే చేయాలి' అని నిర్మాత దిల్‌రాజుగారు కచ్చితంగా చెప్పారట. 'బృందావనం' సినిమా టైమ్‌లోనే మా అబ్బాయి పోయాడు. సరిగ్గా అబ్బాయి పోయిన నెలరోజులకు ఆ సినిమా షూటింగ్ మొదలైంది. క్లైమాక్స్‌లో ఒక సీన్లో నేను కూర్చుని తాగుతూ, అటుగా వచ్చిన తారక్‌ని చూసి, 'రా తాతా రా' అని పిలుస్తా. 'నేను తాగుతానురా రోజూ' అంటా.

'నేనూ ఎప్పుడైనా తాగుతాను తాతా' అని అతను ఒప్పుకుంటాడు. అతని నిజాయతీ నచ్చి,

'ఆర్నెల్లు అక్కడ, ఆర్నెల్లు ఇక్కడ ఇదిగో దీనితో గడిపేస్తుంటా' అని గ్లాసులో మందు చూపిస్తా. ఆర్నెల్లు పెద్దబ్బాయి ఇంట్లో, ఆర్నెల్లు చిన్నబ్బాయి ఇంట్లో ఉంటానన్నది నా మాటలకు అర్థం. ఆ సీన్ చాలా అద్భుతంగా ఉంటుంది. పైడిపల్లి వంశీగారు ఆ సీన్ చాలా బాగా తీశారు. ఆ చిత్రంలో తారక్ చాలా టిపికల్ క్యారక్టర్ చేశాడు. అతని తల్లిదండ్రులు కోటీశ్వరులు. వాళ్ళంటే అతనికి అపారమైన గౌరవం. కొడుకంటే వారికి గొప్ప నమ్మకం. ఇటు ప్రేయసి కోసం ఇంకో అమ్మాయికి ప్రియుడిగా నటిస్తుంటాడు. అలాగని కొత్తగా పరిచయమైన అమ్మాయిని ఇరకాటంలో వదిలేసి వెళ్ళలేడు. ఇలా తారక్ పాత్ర గమ్మత్తుగా ఉంటుంది. ఆ టెంపో అతను బాగా మెయింటెయిన్ చేశాడు. నిజంగా చేయక పోయి ఉంటే తేలిపోయేవాడు. ఎందుకంటే అవతల దిగ్గజాల్లాంటి నటులు శ్రీహరి, ప్రకాశ్‌రాజ్. అన్నదమ్ముల పాత్రలు. నేనేమో తండ్రిని. ఇంతమంది ముందు ఆ పాత్రలో నెగ్గుకు రావడం చాలా కష్టం. అయినా తారక్ చాలా సులువుగా చేయడం నాకు ముచ్చటనిపించింది.

## విగ్గు స్టోరీ

'బృందావనం' లో నా పాత్ర కోసం మా మేకప్ మేన్ తెల్లటి విగ్గు రెడీ చేయించాడు. శ్రీహరికి, ప్రకాశ్ రాజ్‌కి తండ్రి అంటే బాగా ముసలిగా కనిపించాలి కదా అని మా ఉద్దేశం. మొదటి రోజు సెట్‌కి ఆ విగ్గు పెట్టుకుని వెళ్ళాను. అందరూ చాలా బావుందన్నారు. కానీ కాసేపటికి వాళ్ళల్లో వాళ్ళు మాట్లాడుకుంటున్నారు. ఎంతసేపటికీ నాతో షాట్ తీయరు. కాసేపటికి డైరక్టర్ వంశీ వచ్చి, 'విగ్గు లేకుండా ఉంటేనే బావుంటుందేమో శ్రీనివాసరావుగారూ' అన్నారు. అప్పటికప్పుడు మేకప్‌మేన్‌ని పిలిపించి విగ్గు గురించి చెప్పాం. అదృష్టం బావుండి ఆ వేళ విగ్‌మ్యాన్ కూడా సెట్‌లోనే ఉన్నాడు. తన దగ్గర ఇంకో విగ్గు ఉంది. అది నాకు చాలా బాగా సెట్ అయింది. అప్పుడు అందరూ కుదుటపడి విగ్గు ఓకే అనుకుని షూటింగ్ మొదలుపెట్టారు.

## నా అనుమానమే నిజమైంది

బృందావనం సినిమా గురించి ఇంకో ముఖ్య విషయం చెప్పాలి. ఇందులో ప్రకాశ్‌రాజ్, శ్రీహరి ఇద్దరూ డైలాగ్స్ చాలా బాగా చెబుతారు. ప్రకాశ్‌రాజ్ మంచి ఆర్టిస్ట్ మాత్రమే కాదు. చక్కటి డైలాగ్ డిక్షన్, పలికే ప్రతి పదంలో అప్ అండ్ డౌన్స్ వంటివన్నీ చాలా చక్కగా ఉచ్చరించడం అతని క్వాలిఫికేషన్స్. శ్రీహరి తక్కువ తిన్నోడేం కాదు. సీన్ పండించడంలో ఎప్పుడూ ముందుంటాడు. మరి వాళ్ళకన్నా నేను బాగా చేసినట్టు అనిపించుకోవాలి, కానీ ఎక్కడా డామినేట్ చేసినట్టు అనిపించుకోకూడదు. అలాంటి చోటే కదా నాబోటి ఆర్టిస్టుకి పరీక్ష అనిపించేది. మామూలు సమయాల్లో చేయడానికి ఏముంటుంది? ఏమాటకి ఆమాట చెప్పాలంటే అసలు నా వేషం గురించి వంశీ నాకు చెప్పగానే 'ప్రకాశ్‌రాజ్ అసలు ఈ వేషం ఎలా వదిలేశాడు?' అని అడిగాను. నా అనుమానం నిజమైంది.

'నేను చేస్తాను ఈ వేషం' అని ప్రకాశ్‌రాజ్ అడిగారట.

'కాదు, కాదు, శ్రీనివాసరావుగారే చేయాలి' అని దిల్ రాజుగారు కచ్చితంగా చెప్పారన్నారు.

## నన్ను నేను ప్రూవ్ చేసుకోవాల్సిన సమయం

బృందావనం క్లైమాక్స్ షూటింగ్ నాటికి నా ఎడమ కన్నుకి ఆపరేషన్ చేసి ఆరు రోజులైంది. నేనేమో పాత్రలో ఇన్వాల్వ్ అయి చేయాలని తాపత్రయ పడుతున్నా. ఒక పక్క కొడుకు పోయిన దుఃఖం, మరోపక్క ఆపరేషన్ జరిగిన కంటినొప్పి వంటివన్నీ నన్ను బాధించసాగాయి. ఇవన్నీ యూనిట్ వారికి బాగా తెలుసు. అందుకే షూటింగ్‌లో ఎవరూ నాకు గట్టిగా ఏమీ చెప్పలేకపోయారు. వారి అవస్థ గమనించి నేనే కలగజేసుకుని చేశా. ఎందుకంటే, 'పాపం ఆయన బోలెడు దుఃఖంలో ఉన్నాడు. ఏం చేస్తాడులే' అనే ఫీలింగ్‌తో ఉంది యూనిట్. నన్ను నేను ప్రూవ్ చేసుకోవాల్సిన సమయం అదేనని నా మనసు నాకు చెప్పింది.

(ఇంకా ఉంది)

డా. చల్లా భాగ్యలక్ష్మి

సెల్: 88850 55528






# ఇచా! ఇచె!

**ఏదడిగినా, అడిగినవాడు ఎందుకు అడిగానా అని కళ్ళు తిరిగి పడిందాకా చూసి, ఇక చాలా! ఇంకా చెప్పాలా! అనేవాడు ఇచాఇచె!**

**"చేస్తే తప్పులేదు! అంటేనే వస్తుంది!" తనేదో నిజం కనుక్కున్న వాడిలా ఒకడొచ్చి అన్నాడు, నిజానికి మద్దతు ఆశించి, అంతే!**

"ఏం చేస్తే తప్పు, ఏం చేస్తే ఒప్పు! ఏం చేయక పోతే తప్పు, ఏం చేయకపోతే ఒప్పు. ఏది లేదు. ఏది ఉంది. ఏది వుండీ లేదు, ఏది లేకుండా ఉంది. లేకుండా ఏదైనా ఎందుకుంది. ఎందుకు ఉంటుంది. ఉండకుండా ఏదైనా ఎందుకు ఉంటుంది. లేకుండా ఏదైనా ఎందుకు ఉండదు, ఎందుకు ఉండాలి, ఎందుకు ఉండకూడదు! అనడం అనకపోవడం ఎందుకు, ఎందుకు అనాలి, ఎందుకు అనకూడదు, అనాలని ఎందుకు అనాలి. అనకూడదు అన్నదాన్ని ఎందుకు అనకూడదు. అనకూడదని ఎందుకు అనకూడదు, అనకపోవడం ఎందుకు, అనడం ఎందుకు!

వస్తుంది రాదు, రాదు వస్తుంది. ఏం అంటే ఏం వస్తుంది. ఏం అంటే ఏదో వస్తుందని ఎందుకు అనుకోవాలి. వచ్చింది వచ్చిందని ఎందుకు అనుకోవాలి, వచ్చేది ఏంటి, రానిది ఏంటి, వచ్చేది ఎందుకు వస్తుంది, వచ్చేది రాకుండా ఎందుకు ఉండలేదు, రాకుండా ఉండలేంది రాకుండా ఎందుకు ఉండలేదు. ఉండలేంది ఎందుకు వస్తుంది! ఇక చాలా! ఇంకా చెప్పాలా?

"గోడ దగ్గరికి వెళ్ళి గోడు పెట్టుకుంటే కూలి మీద పడిందట."

"గోడేంటి? గోడు ఏంటి? గోడ ఎందుకు ఉండాలి, గోడు ఎందుకు ఉండాలి గోడ లేకుండా ఉండదా, గోడ ఉండీ లేకుండా ఉండదా, గోడ ఉండీ లేకుండా ఎందుకు ఉండాలి, గోడతో గోడు పెట్టడం ఏంటి, గోడుని గోడతోనే ఎందుకు పెట్టాలి? గోడ పడడం ఏంటి, గోడు పెట్టడం ఏంటి, గోడ పడుతుందని ఆ గోడకు తెలుసా, పడుతుందని తెలిసే గోడ పడిందా, తెలిస్తే పడడం ఏంటి, తెలిస్తే గోడ పడడం ఏంటి, పడే గోడతో గోడు గోడు ఎందుకు పెట్టింది, పడే గోడ గోడగా ఎందుకుంది!

ఇక చాలా? ఇంకా చెప్పాలా?

"నేను మీ దగ్గరే ఎందుకు నోరు తెరవాలి, తెరిచిన మీ నోరు నేను ఎందుకు భరించాలి".

"మీరెవరు, నేనెవరు. మీకు నోరు ఎందుకుంది, నోరు నాకు ఎందుకు ఉంది. నోరు ఎందుకు ఉండాలి. ఉండాలి కాబట్టి ఉంది. ఉంటే ఉంది. నోరు ఎందుకు తెరుచుకోవాలి. నోరు తెరవాలని ఎందుకు అనుకోవాలి. ఏం చేద్దామని నోరు తెరిచారు. నోరుకి ఏం కావాలని నోరు తెరిచారు. అసలు నోరుకి ఏదైనా ఎందుకు కావాలి. మీరు నోరు తెరిస్తే ఇంకా నోరు తెరుచుకుందని ఎందుకు అనుకోవాలి!

ఇక చాలా? ఇంకా చెప్పాలా?

"మీకు జంధ్యాలగారూ, సుత్తివేలూ, సుత్తి వీరభద్రరావు తెలుసా?".

"ఎవరు ఎవరో ఎవరికో ఎందుకు తెలియాలి? మీకు తెలిసిన వారెవరో అందరికీ తెలియాలా, అందరికీ తెలుసో లేదో తెలుసుకోవాలని మీరెందుకు అనుకోవాలి. అనుకున్నది ఎందుకు అడగాలి. జంధ్యాల, వింధ్యాల! వీరభద్ర, పిరికిభద్ర, వేలూ, పేలూ, సుత్తి, నత్తి...!"

ఇక చాలా? ఇంకా చెప్పాలా?

జవాబు స్పృహ కోల్పోయి పడింది!

***

ఓ ఆకార భీకరం అక్కడ పడివుందా అనిపిస్తుంది! ఓ పెద్ద మైదాపిండి ముద్దను అక్కడా రూపంలో అక్కడక్కడా వత్తి పడేశారా అనిపిస్తుంది! ఇచా ఇచేగా పేరు పడ్డది ఆ భీకరాకారమే!

ఇచా ఇచెలో కదలికలు మెదలికలు ఉన్నాయని ఎంతో సేపటికిగాని ఎవరో ఒకరు చెప్పలేస్తారేమో!

ఇచా ఇచె ఎవరు? ఎందుకలా అయ్యాడు? మతి భ్రమించిన మహామేధావా? ఆలోచనాలోచన వాక్రవంతి క్రమం తప్పిన ధోరణా? అని ఎవరన్నా ఎవరినన్నా అడిగితే ఎవరూ ఏదీ ఇదమిత్థంగా ఇదీ అని చెప్పలేని గుణగుణ విశేషం ఇచా ఇచె!

ఇచాఇచెకు ఆకలి వేస్తుంది. వేసినప్పుడు తింటాడు. నిద్ర వస్తుంది. వచ్చినప్పుడు పడుకుంటాడు. నీళ్ళు పోస్తే తడుస్తాడు, ఎండవస్తే ఎండుతాడు. గాలి వీస్తే చలించడు. తుఫాను గాలైనా కొట్టుకుని దారి మళ్లాల్సిందేనేమో! ఇంకా ఏమిటి ఏమిటని, ఏంటని ఎవరూ ఎవరినీ అడగరు. అడగాలనిపించదు. అనిపిస్తే ఎవరికివారు ఏదో ఒక జవాబు చెప్పుకుని సందేహాలను పడుకోబెట్టాల్సిందే!

ఇచా ఇచె ఉండేది ఓ అరుగుమీద. ఆ అరుగు ఇచా ఇచె పీట. ఆ పీట మీద ఇంకొకళ్లు కూర్చునే వీలులేదు!

ఆ అరుగు! ఆ పీట! అరకోటిది.

పేరు అరకోటి, ఆస్తి అరవై కోట్లు!

అరకోటికి పనీ పాటా ఏం లేదు. లేకుండానే డబ్బు వచ్చి పడుతూనే ఉంటుంది. అతని వ్యాపకం ఒకే ఒకటి! అడిగిన వాళ్ళకు డబ్బు ఇవ్వడం, ఇచ్చిన డబ్బు తిరిగి అడక్క పోవడం. తీసుకున్నవాళ్ళు ఎప్పటికైనా తిరిగి ఇచ్చే ఏర్పాట్లు చేయగలరు, కానీ చేయరు. అరకోటిని అరకోతి అని కూడా అనవచ్చు. ఎందుకంటే కనిపించని చిలిపి వేషాలున్నాయి. అరకోటికి ఓ భార్య ఉంది. పేరు అద్దాంగి. అర్థాంగి అద్దాంగి అయింది. ఎప్పుడూ అద్దం ముందే ఉంటుంది. ఎప్పటికైనా అందం దొరక్కపోదా అని ఎవరితోనో చెప్పిందట.

అరకోటికి పిల్లల్లేరు! పిల్లలు రారు. రారు కాబట్టి లేరు. ఆ విషయంలో డాక్టర్లు అరకోటి ఇంట్లోనే ఉండి పరిశోధనలు చేస్తుంటారు. వాళ్లుంటారు కాబట్టి వాళ్ల పిల్లలు ఇంటి నిండా ఉంటారు. ఆడుకుంటుంటారు!

***

"అరకోటిగారూ, మా అమ్మాయి పెళ్ళికి డబ్బులు సర్దాలి."

"మా పెత్తాత ఐసీయూలో ఉన్నాడు".

"మా చంటివాడికి ఫీజు కట్టాలి" అని ఏవేవో కారణాలు చెబుతుంటారు. లేకపోతే, గుర్రప్పందాలాడాలి! బారు షాపులు ఖాళీ చెయ్యాలి! అని ఎవరూ అడగరుగా!

"నా దగ్గరకు వచ్చేవాళ్ళు ఇంకో పనికోసం రారు. ఎందుకూ అని నేను అడగను" అంటాడు అరకోటి.

"అరకోటిగారూ, మీరు చాలా చిత్రమైన మనిషండీ" అనో "మీ అంత విశాల హృదయం ఈ

**అతనిపేరు అరకోటి. క్రమెటిగ్గా అరకోతి అనీ అంటారు! అతని దగ్గర అలాంటి వేషాలు చాలా ఉన్నాయి మరి! ఎప్పుడూ అద్దంముందుండే అర్థాంగి గనక అతడి భార్యపేరు అద్దాంగి. మన సుత్తి వీరభద్రరావులాంటి ఇచా ఇచె ఉండేది వాళ్ళ అరుగుమీదే! అసలు విషయం ఏంటంటే అరకోటి దానకర్ణుడంత గొప్పోడు. అప్పులిస్తాడు! బాకీ అడగడు! ట్విస్టేంటంటే, ఇచా ఇచెని తట్టుకుని నిలబడితేనే అప్పు!**

విశ్వంలోనే ఎక్కడా లేదు" అనో, తమ తెలివి ప్రదర్శించాలని చూస్తే, ఆగి చూచి వెళ్ళడం తప్పితే వాళ్ళకు ఏ ప్రయోజనమూ ఉండదు. ఇలా అసలుకే ఎసరు తెచ్చుకున్న వాళ్ళెందరో ఉన్నారు.

ఒకసారి ఒకాయన "అరకోటి గారూ, ఇది బెల్జియం నుండి తెప్పించిన అద్దం, అద్దాంగిగారికి ఇద్దామని తెచ్చాను" అన్నాడు. "మా ఆవిడ ప్రస్తుతం బెల్జియంలోనే ఉంది. అక్కడికి వెళ్ళి ఆమెకే ఇవ్వండి" అని జవాబు తిన్నాడు. మళ్ళీ అతనికి అరకోటిని డబ్బులు అడిగే అవకాశం రాదు, ఆ అదృష్టం పట్టదు.

ఒకసారి ఒకాయన ఇలాగే ఏదో అతిగా ప్రవర్తించబోయి అభాసుపాలై మొహం వేలాడేస్తే, అతను కళ్ళు తేలేసేట్లుగా అతని భార్య చేయి చేసుకుంది. అది చూసిన అరకోటి కొద్దిగా జాలి పడ్డాడు. అదేదో పొరపాటున జరిగింది. ఇంకెప్పుడూ జరగదు గాక జరగదు అని శాసనం కూడా చేశాడు. అంటే ఓసారి ఓ మాటగా చెప్పడమే!

"మీ దగ్గరికి డబ్బుకోసం రాలేదు. మీ జీవిత చరిత్ర రాయాలని వచ్చాను" అన్నాడొకాయన. అరకోటి అతనిమీద నుంచి చూపుతిప్పకుండా, ఓ కట్టె విరిచి రెండు ముక్కలుచేసి ఆ చేతిలో ఒకటి ఈ చేతిలో ఒకటి పెట్టాడు.

"ఈ కట్టె ముక్కలు నేనేం చేసుకోవాలండీ" అన్నాడాయన.

"ఒకదానికొకటి రాస్తే పుట్టేదేంటి" అన్నాడు అరకోటి.

"నిప్పు!"

"ఆ నిప్పులో ఆ రెండు ముక్కలూ కాలి బూడిదయిందాకా చూసి ఆ బూడిదను మీ ముఖం తెల్లబడేట్లుగా రాసుకోండి."

"అప్పుడు రమ్మంటారా"

"రాకండి.. వీపు గోడకు రాసుకోండి."

"ఎంతసేపు..."

"రాసుకోడానికి వీపు లేకుండా ఉండేదాకా!"

అతను పిచ్చివాడై కట్టెలు కనబడితే రాస్తూ పోతూ నిప్పు చూసి నవ్వుకుంటున్నాడని ఎవరో చెప్పారు!

***

ఇచా ఇచె గురించి, అరకోటి గురించి, అరకోటిని అరకోతి అంటారని క్షుణ్ణంగా తెలుసుకుని, తెలుగులో ఓ మంచి సినిమా తీయాలని గుండెల్లో నిప్పు ఉన్న ఓ దర్శకుడు, మీద పడుతున్న వయసుతో, నిర్మాతన్న వాడు కనిపించక అరకోటి దగ్గరికి వచ్చాడు! నిశ్శబ్దంగా నించున్నాడు. అరకోటి తీక్షణంగా చూశాడు. దర్శకుడు తన అరచేతిని అరకోటి ముందు చాచాడు. అరకోటి అరుగు చూపించాడు. కట్‌చేస్తే, దర్శకుడు ఇచా ఇచె ముందు నించున్నాడు. నిమిషాలు గంటల్లోకి మారుతున్నాయి. కాళ్లల్లోనొప్పి కీళ్లలోకి పాకుతున్నది, అప్పుడు గుర్తుకొచ్చింది పలకరిస్తేనే పలుకులొస్తాయని. తల పక్కకి తిప్పిచూస్తే అరకోటి కళ్ళీటే చూస్తున్నాయి. ఆ చూపే ఓ పరీక్ష! ఎంతసేపు నిలదొక్కుకుంటాడనేదే డబ్బులెక్కకు ఆధారం!

"సినిమా దర్శకత్వం చేయాలనే కోరిక చంపుకునేదెలాగో" అన్నాడు దర్శకుడు. ఇచా ఇచె చెబుతూనే ఉన్నాడు. ఏం చెబుతున్నాడో తెలుసుకోవాలంటే ఆ దర్శకుడి జేబులో ఉన్న ఆడియో రికార్డుని అడగాల్సిందే!

అయితే ఇచా ఇచె, ఇక చాలా? ఇంకా చెప్పాలా? అనడం లేదు. దర్శకుడి కాళ్లు దూలాలై కళ్ళు తిరిగి పడ్డాడు.

అరకోటి వచ్చి దర్శకుణ్ణి లేపి దగ్గరకు తీసుకున్నాడు. కానీ దర్శకుడు స్పృహలో లేడు!

క్షణంలో వైద్యబృందం పనిలో పడింది.




దర్శకుడికి స్పృహ వచ్చినా బయటికి తెలియనీయడం లేదు. లేచి కూర్చోవడంలేదు. ఈ అవకాశం సద్వినియోగం చేసుకోవాలి, కనీసం రెండు సినిమాలకైనా పెట్టుబడి రావాలని ఆశతో ఉన్నాడు. కలగంటున్నాడు.

కలలో–

మొదటి సినిమా పూర్తయింది. ఆడియో రిలీజు ఫంక్షన్ ఎన్టీఆర్ స్టేడియం ఆవరణలో ఘనంగా చేశాడు. సినిమా రంగం కదలి వచ్చింది. పబ్లిసిటీ దద్దరిల్లిపోయింది. అదేంటో గోడలకు పోస్టర్లు అంటుకోక ముందే సినిమా ఊడిపోయింది. ఓహో ఆహా అన్నవాళ్లే హిహిహీ అన్నారు. తెలుగు ప్రేక్షకుల మీద కోపం వచ్చింది. ఆ కోపాన్ని తనలోనే మింగేసి రెండో సినిమా పూర్తి చేశాడు. హిహిహీలు ఓహో ఆహా అన్నారు!

బోళ్ళంత ఖర్చుపెట్టి ప్రెస్సు మీటింగు అరేంజ్ చేశాడు. ఎంతో గొప్పగా సినిమా పాత్రికేయులు కలం కదిలించారు. సినిమా పత్రికలన్నీ మూసేశారని తెలిసింది. పోనీ టీవీ ఛానళ్లలో ప్రోమోలు వేద్దామంటే, తెలుగు సినిమాలేకాదు, టీవీ సీరియళ్ళు కూడా చూడమంటే చూడం అంటూ ప్రేక్షక లోకం గగ్గోలు పెట్టి నిరాహార దీక్షలు చేస్తోందట. దానికి తోడు ఒక్క థియేటర్ కూడా ఎవరూ ఇచ్చేట్లు లేరు. ఆఖరికి శాటిలైట్లు కూడా వెలిగేట్లు లేవు. కల పీడకల కావడంతో ఉలికిపడి లేచాడు!

***

"నేను నిర్మాతనవుతా, వెనకాడను. ఎంతంటే అంత పెట్టుబడి బెడతా" అన్నాడు అరకోటి. దర్శకుడి మనసులో ఆనంద సాగరాలు చెలియలి కట్టలు దాటుతున్నాయి.

"అయితే, ఓ నిబంధన" అన్నాడు అరకోటి.

"ఏంటండీ ఆ నిబంధన" ఆత్రుతగా అడిగాడు దర్శకుడు.

"సినిమా బెడిసికొడితే ఆ నొప్పంతా దర్శకుడు భరించాల్సిందే" అన్నాడు అరకోటి. "సినిమా తీయాలనే కోరిక చచ్చింది బాబో" అని కేకేశాడు దర్శకుడు.

"హమ్మయ్య! నీ ప్రశ్నకు జవాబు నీతోనే చెప్పించడానికి ఇంతసేపు పట్టింది" అని కొంచెం కదిలాడు ఇచా ఇచె.

దర్శకుడు జేబులోంచి ఆడియో రికార్డరు తీసి ఇచా ఇచె ముందు కొబ్బరి కాయలా కొట్టాడు!

నవ్య



# తాటాకు బెదిరింపులు

**దలైలామాను సాకుగా తీసుకుని భారత్‌ను చైనా బెదిరించి లొంగదీసుకోవడానికి ప్రయత్నం చేస్తోంది.**

**దలైలామా పేరును అడ్డం పెట్టుకుని భారత్‌ను బెదిరించడం, ఒత్తిడి తేవడం చైనాకు నిత్య కృత్యమైపోయింది. కొద్ది రోజులుగా మళ్లీ ఇటువంటి బెదిరింపులే మరీ ఎక్కువైపోయాయి.**

నిజానికి, చైనా బెదిరింపులు భారత్‌కు విసుగు రప్పిస్తున్నాయి. భారత ప్రయోజనాలకు వ్యతిరేకంగా చైనా ఎన్ని కార్యక్రమాలైనా చేపట్టవచ్చు కానీ, భారత్ మాత్రం ఓ బౌద్ధ గురువు పర్యటనలకు మాత్రం అంగీకరించకూడదన్నట్టుగా ఉంది చైనా వైఖరి. పాక్ ఆక్రమిత కశ్మీర్‌లో చైనా రోడ్లు నిర్మిస్తోంది. టిబెట్‌లో భారీ ఎత్తున సైనిక, పౌర సదుపాయాలను నిర్మిస్తోంది. ఎర్రసైన్యం ఎన్నిసార్లు మెక్‌మోహన్ సరిహద్దు రేఖను అతిక్రమించిందో లెక్కలేదు. అరుణాచల్ ప్రదేశ్‌లో 90 వేల చదరపు కిలోమీటర్ల ప్రాంతం తమదేనంటూ చర్విత చర్వణంగా వాదిస్తూనే ఉంటుంది. కానీ, దలైలామా మాత్రం తవాంగ్‌లోని బౌద్ధారామాన్ని సందర్శించకూడదు.

చైనా ఒత్తిడిని ఈ మధ్య కాలంలో భారత ప్రభుత్వం గట్టిగా ప్రతిఘటిస్తోంది. ఎంత బెదిరించినా, ఎంత ఒత్తిడి తెచ్చినా లొంగేది లేదని మాటలు చేతల ద్వారా తేల్చి చెబుతోంది. భారత్‌లో స్వేచ్ఛగా పర్యటనలు జరపడానికి దలైలామాకు పూర్తి అవకాశం ఉందని, అవి మతపరమైన పర్యటనలే తప్ప రాజకీయ పర్యటనలు కావని ఎన్‌డీఏ ప్రభుత్వంలోని హోం శాఖ సహాయ మంత్రి కిరణ్ రిజిజు చైనాకు గట్టి సమాధానమిచ్చారు. అరుణాచల్ ప్రదేశ్‌కు చెందిన రిజిజు స్వయంగా తవాంగ్ వెళ్లి దలైలామాకు స్వాగత సత్కారాలు ఏర్పాటు చేయబోతున్నారు. దలైలామా తవాంగ్‌లో వారం రోజులకు పైగా పర్యటిస్తారు. తమను బెదిరించే పని పెట్టుకోవద్దని భారత్ ఏదో ఒక రోజున చైనాకు గట్టిగా చెప్పక తప్పదు. రెచ్చగొట్టే వ్యాఖ్యలు చేయాల్సిన అవసరం లేదు కానీ, చైనా ప్రభుత్వ బ్లాక్‌మెయిలింగ్‌కు మాత్రం లొంగిపోకూడదు.




**- రాజశుక**

నరేంద్ర మోదీ నాయకత్వంలోని భారత ప్రభుత్వ సహనాన్ని క్సీ జినపింగ్ నాయకత్వంలోని చైనా ప్రభుత్వం పరీక్షిస్తున్నట్టు కనిపిస్తోంది. చైనా ఒత్తిడికి భారత్ గనుక లొంగిపోతే, అంటే, దలైలామా అరుణాచల్ ప్రదేశ్ పర్యటనను అడ్డుకుంటే, చైనా చేతికి జుట్టు అందించినట్టే అవుతుంది. తమకు భారత్‌తో ఉన్న సరిహద్దు సమస్యలను కూడా ఇదేవిధమైన ఒత్తిడితో సాధించుకోవచ్చని చైనా భావించే అవకాశం ఉంది. చైనా బెదిరింపులు పట్టించుకోకపోతే, చైనా ప్రభుత్వ 'ఒకే చైనా' విధానాన్ని తామూ ఆదరిస్తామని చెప్పినట్టవుతుంది. చైనా ప్రభుత్వానికి 'ఒకే చైనా' సిద్ధాంతం ఎంత ముఖ్యమో భారత్‌కు 'ఒకే భారత్' సిద్ధాంతం అంతే ముఖ్యం కదా! భారత్–చైనా సరిహద్దు చర్చలకు సంబంధించి ఒకప్పుడు ప్రధాన సంధానకర్తగా వ్యవహరించిన డాయ్ బింగో ద్వారా చైనా ఇటీవల భారత్‌కు ఓ సందేశం పంపించింది. 'దక్షిణ టిబెట్‌లో భాగంగా తాము పరిగణిస్తున్న తవాంగ్‌ను గనుక తమకు అప్పగిస్తే, భారత్‌తో సరిహద్దు సమస్య చర్చించడానికి తాము సిద్ధంగా ఉన్నామని, అంతే కాక, ఆక్సాయ్‌చిన్‌పై రాయితీలు ఇవ్వడానికి కూడా తాము ముందుకు వస్తామని చైనా ఆయన ద్వారా కబురు చేసింది. ఇటువంటి తాయిలాలు చైనా తరచూ వేస్తుంటుంది.

### అనవసర ఆగ్రహావేశాలు

అయితే, భారత్ ఈ ఉచ్చులో పడకపోవడం చైనాకు తీవ్ర ఆగ్రహం రప్పించింది. భారత్ గనుక దలైలామాను తవాంగ్ పర్యటనకు అనుమతించే పక్షంలో, ఈ ప్రాంత శాంతి సుస్థిరతలకు తీరని నష్టం వాటిల్లడమే కాకుండా, చైనా భారత సంబంధాలకు కూడా తీవ్ర విఘాతం కలుగుతుందంటూ తమ విదేశాంగ కార్యాలయం ద్వారా ఓ హెచ్చరిక జారీ చేసింది. ఆ హెచ్చరికను కూడా రక్షణ మంత్రి మనోహర్ పారికర్ తీసి పారేసేసరికి, చైనా తమ ప్రభుత్వ యాజమాన్యంలోని 'గ్లోబల్ టైమ్స్' పత్రిక ద్వారా, 'తీవ్ర పరిణామాలుంటాయనే హెచ్చరికను వెలువరించింది. పరోక్ష బెదిరింపులు పోయి వాటి స్థానంలో ప్రత్యక్ష బెదిరింపులు ప్రారంభం అయ్యాయి. భారత్ తన తప్పులకు తానే బాధ్యత వహించాలని చైనా స్పష్టం చేసింది. "దలైలామా పర్యటన వల్ల ఎటువంటి తీవ్ర పరిణామాలు సంభవించబోయేదీ భారత ప్రభుత్వానికి అర్థం కావడం లేదు. ఈ దలైలామా ఆధ్యాత్మిక గురువు కాదు. ఆయనో టిబెటన్ వేర్పాటువాది. దలైలామాను తవాంగ్ పర్యటనకు అనుమతించడమంటే, ఘర్షణ రెచ్చగొట్టడం, శాంతి సుస్థిరతలకు భంగం కలిగించడం, భారత్–చైనా సంబంధాలను దెబ్బతీయడమే అవుతుంది. భారత్‌లో కొందరు దలైలామాను వ్యూహాత్మక ఆయుధంగా ఉపయోగించుకుంటున్నారు. దక్షిణాసియాలో చైనా ఆర్థికంగా, రాజకీయంగా విస్తరించ

డాన్ని నిరోధించడానికి దలైలామాను ఓ పరికరంగా ఉపయోగించుకోవాలని భావిస్తున్నారు. అయితే, వారు దలైలామా రాజకీయ అధికారాన్ని భూతద్దంలో చూస్తున్నట్టుంది. చైనాకు తన ప్రయోజనాలను ఎలా కాపాడుకోవాలో తెలుసన్న సంగతి మరచిపోకూడదు" అని చైనా పత్రిక పేర్కొంది.

అమెరికా అధ్యక్షుడుగా డొనాల్డ్ ట్రంప్ వచ్చిన దగ్గర నుంచీ చైనా వైఖరిలో మరింత మార్పు కనిపిస్తోంది. చైనాతో అమెరికా స్నేహ సంబంధాలను కొనసాగించినా లేక ఆసియా ఖండంలో చైనా ఆధిపత్యాన్ని చూసీ చూడనట్టు వదిలేసినా భారత్‌కు చైనా నుంచి కొన్ని ఇబ్బందులు ఎదురవుతాయి. చైనాతో సమానంగా ఎదగాలన్న భారత్ ఆకాంక్షలకు చుక్కెదురవుతుంది. ట్రంప్ విధానం కూడా చైనా ధోరణికి అనుకూలంగానే ఉంది. అమెరికన్లకు ఉద్యోగాలు, వలసవాదుల విషయంలో కఠిన వైఖరి తమ ధ్యేయమని ట్రంప్ ప్రకటించారు. ఇక నుంచీ తాము ప్రపంచానికి పోలీసులా వ్యవహరించబోవడం లేదని, ఇతర దేశాల్లో తమ ఉనికిని, జోక్యాన్ని గణనీయంగా తగ్గించుకోబోతున్నామని ట్రంప్ అనేక పర్యాయాలు చెప్పకనే చెప్పారు. ప్రపంచ దేశాలతో వీలైనంతగా స్నేహ సంబంధాలు పెంపొందించుకోవడానికే ట్రంప్ ప్రాధాన్యమివ్వబోతున్నారని అర్థమైన దగ్గర నుంచీ చైనా దాష్టీకం మరీ ఎక్కువైపోయింది. తాము ఆసియాలో ఎంత ఆధిపత్య ధోరణి ప్రదర్శించినా అమెరికా అడ్డుకట్ట వేయదని అది భావిస్తోంది.

## అమెరికాతో ఒప్పందం

అమెరికాతో భారత్ అణుశక్తి ఒప్పందం కుదుర్చుకున్నప్పటి నుంచి చైనా నిప్పులు చెరుగుతోంది. పైగా అమెరికా భూభాగంలో భారత్ వైమానిక, నౌకా స్థావరాలు ఏర్పాటు చేసుకోవడానికి, భారత భూభాగంలో అమెరికా స్థావరాలు ఏర్పాటు చేసుకోవడానికి ఈ రెండు దేశాల మధ్య ఒప్పందం కుదుర్చుకోవడం కూడా చైనా కంటగింపునకు కారణమయింది. "ఇది చాలా ప్రమాదకర పరిణామం" అని చైనా అప్పట్లోనే వ్యాఖ్యానించింది. భారత్ అమెరికా, జపాన్‌ల ఒత్తిడికి లొంగిపోయి, తమకు వ్యతిరేకంగా దౌత్యపరమైన కార్యకలాపాలు సాగిస్తోందని కూడా చైనా భావిస్తోంది. "భారత్‌ను తమ గూటిలోకి రప్పించడానికి జపాన్, అమెరికా, ఆస్ట్రేలియా గట్టిగా ప్రయత్నిస్తున్నాయని మాకు తెలుసు. అవి భారత్‌పై గట్టి ఒత్తిడినే తెస్తున్నాయి. ఉన్నత స్థాయి టెక్నాలజీ, రక్షణ ఒప్పందాల ద్వారా అవి భారత్‌ను లొంగదీసుకుంటున్నాయి. ఇటువంటి ఒత్తిడికి లొంగడమా, మానడమా అన్నది భారత దేశమే తేల్చుకోవాలి" అని ఒబామా హయాంలోనే చైనా ఓ ప్రకటన జారీ చేసింది.

ప్రధాని నరేంద్ర మోదీ మొట్టమొదటిసారిగా వియత్నాం పర్యటనకు వెళ్ళినప్పుడు కూడా చైనా ఇదే విధంగా బెదిరింపు (హెచ్చరిక) ప్రకటన జారీ చేసింది. మోదీ వియత్నాం పర్యటనకు వాణిజ్య, రక్షణ సహకారం, భద్రత, ఉగ్రవాద వ్యతిరేక వ్యూహం వంటి అంశాలపై ఒప్పందాలు కుదుర్చుకోవడానికి వెళ్ళారు. చైనా దీన్ని ఓ రెచ్చగొట్టే చర్యగా భావించింది. ఇదివరకు తమకు, రష్యాకు మాత్రమే ప్రాధాన్యం ఇచ్చిన వియత్నాం ఇప్పుడు భారత్‌కు ప్రాధాన్యమివ్వడాన్ని చైనా జీర్ణించుకోలేకపోయింది. నౌకా నిర్మాణ టెక్నాలజీలను అభివృద్ధి చేసుకోవడానికి భారత్ అయిదువేల కోట్ల డాలర్లను వియత్నాంకు రుణంగా ఇచ్చింది. తమకు వ్యతిరేకంగా వియత్నాంను తమ వైపు తిప్పుకోవడానికే భారత్ ఈ రుణం ఇచ్చిందని చైనా ఇప్పటికీ అనుమానిస్తోంది. "ఇటువంటి చర్యలు చైనా చూస్తూ ఊరుకోదు" అని చైనా ప్రభుత్వ ప్రతినిధి ఓ ప్రకటన చేశారు.

చైనా ఇటువంటి హెచ్చరికలను ప్రత్యక్షంగా, పరోక్షంగా జారీ చేస్తూనే ఉంది. కొన్ని అనధికారికంగా, కొన్ని దౌత్యపరంగా జారీ అవుతూ ఉంటాయి. అయితే, ఇవి హెచ్చరిక లేదా బెదరింపు ప్రకటనలన్న సంగతి పైకి తెలియకుండా అది జాగ్రత్త పడుతుంటుంది. విదేశాంగ విధానం విషయంలో భారత్ తన అలీన విధానానికి కట్టుబడి ఉండాలని, ప్రాచ్యదేశాల వైపో, పాశ్చాత్య దేశాలవైపో మొగ్గు చూపకూడదని అది పరోక్షంగా హెచ్చరిస్తుంటుంది. అలీన విదేశీ విధానం భారత్‌కు పెనుభారమైపోయింది. పైగా అటువంటి విదేశీ విధానం అనుసరిస్తున్నప్పుడు కూడా చైనా నుంచి ఒత్తిడి వస్తూనే ఉండడంతో, చైనాకు అడ్డుపుల్ల వేయడానికి భారత్ కొద్దిగా అమెరికా వైపు మొగ్గడం ప్రారంభించింది. ఓ ఆర్థిక శక్తి స్థాయి నుంచి సైనిక శక్తి స్థాయికి ఎదగాలనే చైనా ఆరాటాన్ని దృష్టిలో పెట్టుకునే భారత్ తన విదేశాంగ విధానంలో మార్పులు చేర్పులు చేసింది. ప్రపంచంలోనే అతి పెద్ద ఆర్థిక శక్తిగా 2020 నాటికి ఎదగాలని చైనా లక్ష్యంగా పెట్టుకుంది. ఈ నేపథ్యంలో ఆసియాలో అధికార సమీకరణలను మార్చి, తమ ఆధిపత్యమే కొనసాగాలని కూడా చైనా ప్రభుత్వం అభిప్రాయపడుతోంది.

**అరుణాచల్ ప్రదేశ్ తవాంగ్‌లో దలైలామా వారం రోజులు పర్యటించనున్నారు. దీంతో చైనా భారత్‌ను మళ్ళీ బెదిరిస్తోంది. తవాంగ్ తన భూభాగమని వాదిస్తోంది. దలైలామా పర్యటనకు అనుమతిస్తే తీవ్ర పరిణామాలుంటాయని హెచ్చరిస్తోంది . ఆసియాలో ఆర్థికశక్తిగా ఎదిగేందుకు భారత్‌ను నయానో భయానో లొంగదీసుకోవాలనేదే చైనా ప్రయత్నం. మరి మనదేశం ఏం చెయ్యాలి?**

అమెరికా ఇక ఏ దేశ వ్యవహారాల్లోనూ కల్పించుకోదు. భారత్‌లో స్థావరాల ఏర్పాటు, అణుశక్తి ఒప్పందం వంటి వాటిని కూడా ట్రంప్ ఆదరించకపోవచ్చు. భారత్ మీద ఒత్తిడి పెంచడానికి, నయానో భయానో లొంగదీసుకోవడానికి ఇంతకన్నా మంచి సమయం మరొకటి ఉండదని చైనా అంచనా వేస్తోంది. భారత్ ఈ ఒత్తిడిని ప్రతిఘటించక తప్పదు. చైనా బెదిరింపులకు ఏ కొద్దిగా లొంగిపోయినా అది భవిష్యత్తులో భారతదేశాన్ని ఘోరంగా దెబ్బతీస్తుంది. చైనాతో సమానంగా అభివృద్ధి చెందగల శక్తి ఉన్న భారత్ తన విధానాలను నిర్భయంగా కొనసాగించడమే మంచిది. ప్రపంచంలో ఓ అతి పెద్ద ఆర్థిక శక్తిగా గానీ, ఆసియాలో రాజకీయ శక్తిగా గానీ చైనా ఎదిగే అవకాశం లేదు. చైనాను ఇప్పుడు భరిస్తే ఎప్పటికీ భరించాల్సి ఉంటుంది.








**కారు నగరంలోకి ప్రవేశించింది.**

**రెండు రోజుల నుండి అనుభవిస్తున్న మనోవేదన తీరింది. కానీ, ఈ కుట్ర విస్తృత రూపం ఇప్పుడే బయటపడింది. ఈ తీగ పట్టుకుని లాగితే, ఏ డొంకలు కదులుతాయోననీ, మళ్ళీ ఏ జంజాటంలో ఇరుక్కోవాల్సి వస్తుందోననీ ఆందోళనగా ఉంది.**

**రాబోయే పరిస్థితులు శ్రావణికి ఏమైనా ప్రమాదం కలిగిస్తాయేమోననే నా బాధంతా.**

శ్రావణి జీవితాంతం నాకు తోడుగా ఉంటుందన్న సంతోషం కన్నా, ఇప్పుడు ఆమెను ఒంటరిగా వదిలి వెళ్తే ఏం జరుగుతుందోనన్న భయమే నన్ను కలవరపరుస్తోంది. పోనీ, నాతో ఉండమని అడుగుదామనుకుంటే, తనకు కొంత టైం కావాలనీ, తమ ఇద్దరి బాధ్యతలు తీరేవరకు విడిగా ఉండడమే శ్రేయస్కరమనీ ముందే చెప్పింది కాబట్టి ఆ ఆశ కూడా లేదు.

రెండు విరుద్ధమైన భావాలతో సతమతమవుతుండగానే, కారు శ్రావణి ఇంటి దగ్గరకు చేరింది.

శ్రావణి దిగి వెళ్ళిపోతుంటే, మనసంతా దిగులుగా అయింది.

"జాగ్రత్త!" అన్నాను.

శ్రావణి వెనుతిరిగి "మీరేం వర్రీ కాకండి. జాగ్రత్తగానే ఉంటాను. మీరు జాగ్రత్త!" అంది.

నా శరీరంలోని ఒక ముఖ్య భాగాన్ని వదిలి వెళ్తున్నంత బాధగా ఉంది. కానీ, తప్పదు. నిర్ణయం జరిగిపోయింది.

శ్రావణి ఇంటి ముందు ఒక పోలీస్ కానిస్టేబుల్ మఫ్టీలో ఉన్నాడు. శ్రావణి సేఫ్టీ కోసం మేడం చేసిన అరేంజ్‌మెంట్.

నేను కారు దిగి అతని దగ్గరకు వెళ్ళి, షేక్ హ్యాండ్ ఇచ్చి, "భయ్యా! నా ప్రాణాన్ని మీ చేతుల్లో పెడుతున్నాను. మీ ప్రాణంలా కాపాడండి." అన్నాను గద్గదికంగా.

సాధారణంగా పోలీసులు కఠినంగా, మొరటుగా ఉంటారనుకుంటాము. కానీ, నా మాటలకు ఆ కానిస్టేబుల్ విచలితుడయ్యాడు. బాగా కదిలిపోయి,

"అయ్యో! అదేమిటి సార్, అమ్మ మీద ఈగ కూడా వాలనియ్యను." అన్నాడు.

నాకు సంతోషమనిపించింది. అతణ్ణి కౌగలించుకుని "థాంక్యూ!" అని అక్కడి నుంచి బయలుదేరాను.

• • •

ఇంటి తాళం తీసి లోపలికి ప్రవేశించాను.

నా మనసంతా చేదు మాత్ర తిన్నట్టు అయింది.

ఇల్లంతా నీరవ నిశ్శబ్దంగా ఉంది.

ఈ ఇంట్లోనే ఎన్నో సంఘటనలు మంచివీ, చెడ్డవీ జరిగాయి. కానీ, మంచిచెడులతో, ఆనంద దుఃఖాలతో, తనకేం సంబంధం లేనట్టుగా, నిశ్చలంగా ఉంది.

ఇల్లంటే, అలసి సొలసి వచ్చిన గృహస్థును సేదదీర్చి, ఓదార్చే ప్రశాంతతకు నిలయంలా ఉండాలి. కానీ, నా ఇల్లు దేవత లేని శిథిల దేవాలయంలా ఉంది. అక్కడ, నా ఆరాధ్య దేవతను ప్రతిష్టిస్తేనే అది నాకు ఆలయమవుతుంది. ఆలంబననిస్తుంది.

అప్పటి వరకు ఇంతే!

భారతయుద్ధంలో గెలిచిన తర్వాత ధర్మరాజును కూడా, 'ఎవరికోసం, ఇంతమందితో మారణ హోమం చేసి, యుద్ధంలో గెలిచి ఏం సాధించానన్న' నిర్వేదం ఆవహించిందంట.

నా పరిస్థితి కూడా, ఇప్పుడు అలానే ఉంది.

"ఒక్క సినిమా కోసం ఇన్ని పోరాటాలా? మనుషులు ఇంత నీచానికి కూడా దిగజారు

## జరిగిన కథ

ఆస్కార్ అవార్డుల పోటీల్లో అతడి చిత్రం ఎంపికైన సందర్భంగా అమెరికా వెళుతున్నాడా తెలుగు దర్శకుడు. విమానంలో కూర్చుని గతం గుర్తుచేసుకున్నాడు. జూనియర్ ఆర్టిస్టు హత్యాయత్నం కేసులో దర్శకుడికి, డీసీపీ పుష్పా కిరణ్ ప్రమేయంతో, లిఫ్ట్ ఇస్తాడు నిర్మాత. దాంతో సినిమా నిర్మించేందుకు సన్నద్ధమవుతాడు దర్శకుడు. సినిమా షూటింగ్ మొదలవుతుంది. క్రమంగా హీరోయిన్ శ్రావణి పట్ల ఆకర్షితుడవుతాడు డైరెక్టర్. అతనికి తన గతమేమిటో చెప్పి, దూరంగా వెళ్లిపోతుంది శ్రావణి. తర్వాత డైరెక్టర్ ఇంట్లో ఉన్న హార్డ్ డిస్క్ మాయమవటంతో, శ్రావణిని అరెస్ట్ చేస్తారు. డీసీపీ మేడమ్ పంపిన డీవీడీలు చూసి మతిపోతుంది డైరెక్టర్‌కి. స్నేక్ గ్యాంగ్ పాశవిక చర్యలు, కేసుల వివరాలు ఆ డీవీడీల్లో ఉంటాయి. శ్రావణిని మాల్ దగ్గర కిడ్నాప్ చేసి, డైరెక్టర్ దగ్గర ఉన్న హార్డ్ డిస్క్ తమకు తెచ్చివ్వాలని బెదిరిస్తుంది స్నేక్‌గ్యాంగ్. ఆ తర్వాత స్నేక్ గ్యాంగ్‌ను అరెస్టు చేయటం, డీసీపీ మేడం ఆమెకు బెయిల్ ఇచ్చి, డైరెక్టర్ ఇంటికి తీసుకురావటం... అన్నీ చకచకా జరిగిపోతాయి. అన్నివిధాలా ఆలోచించి, ఆమెను దగ్గరకు తీస్తాడు డైరెక్టర్. డీసీపీని ఎయిర్ పోర్టులో దింపేసి, శ్రావణికి నరకం చూపించినవారిని ఊరికే వదలకూడదనుకుంటాడు తను.

ఆ తర్వాత.....

తారా?"

"అసలు దేవుడనేవాడున్నాడా?" అనిపించింది నాకు.

గుళ్ళూ గోపురాలూ దర్శించకున్నా నాకు భగవంతుడంటే అపారమైన విశ్వాసం.

మన మిల్కీవేనే కాక, ఎన్నో గెలాక్సీలూ, ఎన్నో వేల గ్రహాలూ, సముద్రాలూ, నదులూ, ఋతువులూ సక్రమంగా ఒక్క క్షణంలో వెయ్యో వంతు కూడా క్రమం తప్పకుండా ఇంత పకడ్బందీగా ఎలా తమ కర్తవ్యాన్ని నిర్వర్తించగలుగుతున్నాయి. ఇంత అద్భుత సృష్టిని భౌతికశాస్త్రమనే ఒక చిన్న కొలమానంతో కొలవలేమనీ, ఈ సృష్టి ప్రక్రియను నిర్వచించలేమనీ మహా మహా శాస్త్రజ్ఞులే ఒప్పుకున్నప్పుడు, ఆ శక్తిని భగవంతుడంటే తప్పేమిటి?

అలా అని నేనెవరితోనూ వాదించను. నా నమ్మకాన్ని వారిపై రుద్దను. నా నమ్మకంతో వాళ్ళు విభేదిస్తే నమస్కారం పెట్టి ఊరుకుంటాను.

నిన్నటి నుండి జరిగిన సంఘటనలతో సైకలాజికల్‌గా బాగా డ్రెయిన్ అయ్యాను. అయితే, ఇంత కష్టంలోనూ నన్నొక అదృశ్య శక్తి నడిపిస్తోందనే నమ్మకం మాత్రం నాకు బలీయంగా ఉంది.

నా నమ్మకం, నేను ఈ మధ్యనే ఒక అద్భుత వ్యక్తి గురించి చదివిన తర్వాత, మరింతగా బలపడింది.

ఆయనే శ్రీరాం సర్.

ఆయనను, ఆయన భక్తులు, మన మధ్యనే, మామూలు బట్టల్లో, మనుష్య రూపంలో తిరిగే శ్రీకృష్ణుని అవతారంగా భావించి పూజిస్తున్నారు.

ఫేస్‌బుక్‌లో రవీనా పి. చవాన్ అనే ఫ్రెండ్ పోస్టు ద్వారా నేను 'శ్రీరాం సర్ గురించి తెలుసుకున్నాను.

వారికి కలిగిన అనుభవాలను, అనుభూతులను వివరిస్తుంటే, నా మదిలో ఏదో తెలియని అమృతభాండం ఒలికినట్లయి, శరీరం పులకించిపోయింది.



వారు చెప్పినదాన్ని బట్టి "శ్రీరాం సర్" ఎవ్వరినీ కలుసుకోరు. కానీ, తను కలుసుకోవాలనుకున్న వ్యక్తులకు దృశ్య, అదృశ్య రూపంలో కనిపిస్తూనే ఉంటారని, అనుభూతి కలిగిస్తుంటారని చెప్పడం నాకు బాగా నచ్చింది. ఆయన ఇల్లు ఎక్కడో కూడా చాలామందికి తెలియదు. ఆయన ఫోన్ నంబరు కూడా ఏ కొద్దిమందికో తప్ప ఎవరికీ తెలియదు.

ఆధ్యాత్మిక వ్యాపారం జోరుగా జరుగుతున్న ఈ రోజుల్లో ఎవరిని నమ్మాలో, ఎవరిని నమ్మకూడదో తెలియడం లేదు. ఆధ్యాత్మిక సామ్రాజ్యాలు స్థాపించిన వాళ్ళు కూడా టీవీలకు ఎక్కి పోట్లాడుకోవడం ఎంత అసహ్యంగా ఉందో నేనైతే చెప్పలేను. టీవీల్లో కమర్షియల్ స్లాటులు కొనుక్కుని, తమ ప్రోడక్టులకు ప్రచారం చేసుకుంటున్న వ్యాపారుల్లాగా ప్రవర్తిస్తున్న బాబాలున్న ఈ రోజుల్లో శ్రీకృష్ణుని అవతారంగా భక్తులు భావిస్తున్న ఒక అద్భుత వ్యక్తి అనామకంగా ఉండడమే తనకిష్టమని భావించడమే దైవత్వానికి మొదటి మెట్టు.

'శ్రీరాం సర్' గురించి 'narrenaditya@ tirumalesa.com'లో అతని భక్తుడు 'an incredible true story of a miracle man who is seeing you tomorrow' అనే ఆర్టికల్‌లో తన అనుభవాలు పంచుకున్నాడు.

"శ్రీరాం సర్" చెప్పిన విషయాల్లో నాకు బాగా నచ్చినవి, సులభమైన మాటల్లో చెప్పుకుంటే ఈ ప్రపంచంలో ప్రతీ సంఘటన, ప్రతీ అనుభవం గరికపోచ కదలిక నుండి మహాపర్వతాల విస్ఫోటనం వరకు ముందే నిర్ధారితమై పోయి ఉన్నాయి. (Everything is predetermined and well determined). ఇది కొత్త సిద్ధాంతం ఏమీ కాకపోవచ్చు. దీన్నే మనం కర్మసిద్ధాంతం అని కూడా అనుకోవచ్చు.

కానీ, నాకు ఆయన చెప్పిన సిద్ధాంతం, అందుకు ఆయన చూపించిన తార్కాణాలు నచ్చాయి.

రెండో విషయం నాకు బాగా నచ్చిన దేమిటంటే, "God is stronger than our strongest enemies" అంటే నువ్వు ఎంతో బలవంతుడని ఊహించుకుంటున్న శత్రువు కన్నా కూడా భగవంతుడు బలవంతుడు. భగవంతుడి పట్ల అచంచల విశ్వాసం కలిగి ఉండడమే మనిషి విధి. అప్పుడు ఎంత కఠినమైన విధిరాతనైనా భగవంతుడు మార్చగలడు.

భగవంతుడి పట్ల నాకు గల ఆరాధనా భావాన్ని ఇలా సిద్ధాంతీకరించలేకపోయినా, నా మనసులో ఉన్న భావనే అది.

లేకపోతే, నేను ఈ సినిమాను ఇన్ని అవరోధాలను, అపాయాలను, అపనిందలను మోస్తూ తీయగలిగే వాణ్ణా? నాకు భౌతికంగా మేడం సహాయం చేసినా, ఆమెకు నాపైన అభిమానం కలగడానికి కారణం ఏమిటి? నేను అలవికాని సమస్యల సుడిగుండంలో చిక్కుకున్నప్పుడు ఆమె ఎలా ప్రత్యక్షమై సహాయం చేసింది? ఆమె ఫోన్ చేసినప్పుడు అమెరికా నంబరు చూసి అమెరికాలో ఉందనుకున్నాను. తను కూడా అమెరికాలో ఉన్నట్టే 'ఇక్కడ ఇప్పుడు డే టైమే' అని చెప్పిన కొన్ని గంటల్లోనే ఎలా ప్రత్యక్షమైంది?

నా వరకైతే నాకు దేవుడున్నాడు.

అలాగే "శ్రీరాం సర్" గురించి విన్న మరో విషయం కూడా నన్ను సంభ్రమాశ్చర్యా



లకు గురి చేసింది. అది నా రంగానికి, సినిమా రంగానికి సంబంధించిందే.

'బాషా', 'ఇంద్రుడు చంద్రుడు' వంటి సినిమాలకు దర్శకత్వం వహించిన సురేశ్ కృష్ణగారు కూడా 'శ్రీరాం సర్' శిష్యుడేనట. ఆయన తెలుగులో నటుడు ప్రభాస్ రెండవ సినిమా 'రాఘవేంద్ర'కు దర్శకత్వం వహించారు. ఆ చిత్రం ముహూర్తానికి వచ్చిన 'శ్రీరాం సర్' ముహూర్తం తరువాత షూటింగ్ గ్యాప్‌లో ఒక క్లోజ్డ్ కవర్ ఇచ్చి "ఈ సినిమా షూటింగ్ మొత్తం పూర్తయిన తర్వాత, నీకు సెన్సార్ సర్టిఫికెట్ వచ్చిన రోజున తెరచి చూడమని" చెప్పారట.

'రాఘవేంద్ర' సినిమా షూటింగ్ పూర్తయిన తర్వాత, సెన్సార్‌కు అప్లై చేసినపుడు, సెన్సార్ బోర్డు రెండు 'కట్స్' ప్రపోజ్ చేస్తే, వీళ్ళు అందుకు ఒప్పుకోక, ట్రిబ్యునల్‌కు అప్పీల్ చేశారని, తర్వాత సెన్సార్ సర్టిఫికెట్ వచ్చిన రోజున సురేశ్ కృష్ణగారు 'శ్రీరాం సర్'కు ఫోన్ చేసి ఈ విషయాలన్నీ చెప్పి "సెన్సార్ సర్టిఫికెట్ వచ్చింది కాబట్టి, ఆ కవర్ ఓపెన్ చేయమంటారా?" అని అడిగితే దానికి సమాధానంగా 'శ్రీరాం సర్',

"మీరెక్కడున్నారు?" అంటూ ప్రశ్నిస్తే,

"అమీర్‌పేటలోని గ్రీన్ పార్కు హోటల్లో ఉన్నానని" సురేశ్ కృష్ణగారు చెప్పారట.

"అయితే, సుమారు ఏడున్నర ప్రాంతంలో నేనే వస్తున్నాను, అప్పుడే ఓపెన్ చేయమని" చెప్పి ఆ సమయానికి 'శ్రీరాం సర్' అక్కడికి వెళ్ళి, కూర్చున్న తర్వాత, ఆ కవర్ ఓపెన్ చేయమని చెప్పారట.

'సర్' పర్మిషన్ ఇవ్వడంతో, సురేశ్ కృష్ణగారు ఆ కవర్ ఓపెన్ చేసి, అందులో ఉన్న పేపర్ మీద రాసి ఉన్న వాక్యాలు చదివారు. అవి,

ఈ కవర్ నువ్వు నా సమక్షంలోనే, హైదరాబాదు అమీర్‌పేటలోని గ్రీన్ పార్క్ హోటల్లో...... తేదీ నాడు సాయంత్రం ఏడున్నర ప్రాంతంలో విప్పి చదువుతావు.

నీ సినిమా 'రాఘవేంద్ర'కు సెన్సార్ బోర్డు రెండు 'కట్స్' చెబుతుంది. మీరు ట్రిబ్యునల్‌కు అప్పీలు వెళ్ళిన తరువాతనే సర్టిఫికెట్ జారీ అవుతుంది.

నీ సినిమా 'రాఘవేంద్ర' షూటింగ్ 'అన్నపూర్ణ' స్టూడియోలో జరుగుతున్నప్పుడు, కోట శ్రీనివాస రావు అనే నటునికి యాక్సిడెంట్ జరుగుతుంది.

నీ సినిమా 'రాఘవేంద్ర' షూటింగ్ జరుగుతున్న సమయంలోనే అమెరికా, ఇరాక్‌పైన యుద్ధం ప్రకటించి, ఆ దేశ అధ్యక్షుడు 'సద్దాం హుస్సేన్'ను బంధిస్తుంది.

నీ సినిమా 'రాఘవేంద్ర' షూటింగ్ జరుగుతున్న సమయంలోనే, వరల్డ్ కప్ క్రికెట్ ఫైనల్స్ సౌత్ ఆఫ్రికాలో జరుగుతాయి. ఫైనల్స్ ఇండియా, ఆస్ట్రేలియా దేశాల మధ్యన జరుగుతుంది.

టాస్ గెలిచిన భారత్ కెప్టెన్ సౌరభ్ గంగూలీ, ఫీల్డింగ్ ఎంచుకుంటాడు. ఆ ఘోర తప్పిదం మూలంగా భారీ మూల్యం చెల్లించుకుని, భారత్ ఓడిపోతుంది.

ఆ కాగితంలో రాసి ఉన్న విషయాలు అక్షర సత్యాలు కావడంతో, సురేశ్ కృష్ణగారు విభ్రాంతికి గురయి నిశ్చేష్టులయ్యారట. ఎందుకంటే, ఆ కాగితంలోని విషయాలను 'శ్రీరాం సర్' చాలా రోజుల కిందటే రాసి సురేశ్ కృష్ణగారికి ఇచ్చి, సెన్సార్ అయిన రోజున ఓపెన్ చేయమని చెప్పారంటే, 'సర్' చెప్పిన 'everything is predetermined' అన్న సిద్ధాంతం ఋజువయినట్టేగా.

'శ్రీరాం సర్' గురించిన విశేషాలు అనేకం ఆయన దైవత్వాన్ని ప్రూవ్ చేస్తాయి.

అందుకే, ఆ విషయాలు చదివినప్పటి నుంచి నేను ఆయన డిసిపుల్ నయ్యాను.

గబగబా తయారై ఆఫీసుకు బయల్దేరాడతను. నాలుగో అంతస్తులో ఉంది ఆఫీసు. లిఫ్టులో నుంచి దిగగానే, స్టాఫ్ అంతా ఆఫీసు ముందున్న కారిడార్‌లో నిలబడి కనిపించారు. గుసగుసగా మాట్లాడుకుంటున్నారు. అతణ్ణి చూడగానే సైలెంట్ అయిపోయారందరూ. ఏమైందోననే గాభరాతో అతడు మెల్లగా అందరినీ పరికించి చూస్తున్నాడు. అసలేం జరిగింది? ఆఫీసులో జరగరానిది ఏమైనా జరిగిందా?

అందుకే, ఆ రాత్రి ఆందోళనలో ఉన్న మనసును అదుపులో పెట్టుకుని ధ్యానంలో కూర్చున్నాను. జరిగేది జరగక మానదు. నా ప్రయత్నం నేను చేస్తాను. ఫలితం గురించి ఆందోళన చెందకూడదని నిశ్చయించుకున్నాను. కళ్ళ ముందు దేదీప్యమానమైన కాంతిపుంజం ప్రత్యక్షమైంది. మనసు ప్రశాంత సరస్సులో ఓలలాడింది.

ఎందుకంటే, భగవంతుడు బలవంతుడు. ఆయన తలుచుకుంటే సమస్యలను కొనగోటితో తుడిచి పెట్టేయగలడు.

'శ్రీరాం సర్' గురించి ఆలోచిస్తూనే నిద్రలోకి జారుకున్నాను. చాలా రోజుల తరువాత గాఢ నిద్రలో సేద దీరాను.

• • •

మరునాడు లేచేసరికి ఆలస్యమైంది. వెంటనే తయారయి ఆఫీసుకు బయల్దేరాను. మా ఆఫీసు నాలుగో అంతస్తులో ఉంది. నేను లిఫ్టులో నుంచి దిగగానే, మా స్టాఫ్ అంతా ఆఫీసు ముందున్న కారిడార్‌లో నిలబడి ఉన్నారు. గుసగుసగా మాట్లాడుకుంటున్న వాళ్ళంతా నన్ను చూడగానే సైలెంట్ అయిపోయారు. అభిషేకం గారు ఆందోళనగా పచార్లు చేస్తున్నారు. నన్ను చూడగానే అందరూ నన్ను చుట్టుముట్టారు.

నా పై ప్రాణాలు పైనే పోయాయి.

"ఏమైంది?" అని గాభరాగా అడిగాను.

"ఇన్‌కంటాక్స్ రైడ్!" అన్నారు అభిషేకం గారు. "ఓ పదిమంది వరకు ఆఫీసర్స్ వచ్చి అకౌంట్ పుస్తకాలు, చెక్కు బుక్కులు అంటూ నానా హడావుడి చేస్తున్నారు."

"ఓహో, మొత్తానికి మనకంటే ఒకడుగు ముందే ఉన్నారన్నమాట మన శత్రువులు" అనుకున్నాను.

పాదరసంలా నా బుర్ర పని చేసింది.

"ఇప్పుడే వస్తా!" అని నేను

## తను ఆ టైపు కాదట!

అవకాశాల కోసం కొందరు ఎంతకైనా దిగజారుతారు. తను ఆ టైపు కాదంటోంది నడుము సుందరి ఇలియానా. ఛాన్సులు ఇవ్వమని ఎవరినీ అడగను కనుకే తనకు సినిమాలు తగ్గాయి తప్ప మరో కారణం కాదని చెబుతోంది. అంతే కాకుండా ఏ సినిమా పడితే ఆ సినిమా చేస్తే తన ఇమేజ్ డామేజ్ అవుతుందట! ఇలియానా సెటైర్లన్నీ కొందరు స్టార్ హీరోయిన్ల మీదేనన్న సంగతి తెలిసిందే! తనకన్నా వయస్సులో కొంచెం పెద్ద అయిన వారు కూడా దూసుకుపోతుంటే, ఇలియానా మాత్రం ఏడాదికి ఒక సినిమా చేయడం కూడా గగనమైపోతోంది. ఇవన్నీ కప్పిపుచ్చుకోవడానికే ఇలాంటి కబుర్లు చెబుతోంది అంటున్నారు బాలీవుడ్ జనాలు.

లిఫ్ట్ కోసం ఆగకుండా మెట్లమీదుగా కిందికి పరుగెత్తాను. నన్ను కవర్ చేస్తూ నేను లిఫ్ట్ ఎక్కకుండా కాపలా కాస్తున్న ఒక అధికారి కంగారుపడి, "సార్! సార్!" అంటూ నా వెంట పడ్డాడు.

నేను చకచకా నడుస్తూనే, 'యాకూబ్' మా డ్రైవర్‌కు ఫోన్ చేసి కారును మా బిల్డింగ్ పార్కింగ్ నుండి తీసి, రెండు వందల గజాల దూరంలో ఉన్న గణపతి కాంప్లెక్స్ వెనకాల ఉన్న పార్కింగ్ ఏరియాకు తీసుకురమ్మని చెప్పాను.

ఎందుకంటే, కారులో హార్డ్ డిస్క్ ఉంది. ఆ విషయం నా ఒక్కడికే తెలుసు. ఇంత గందరగోళం జరిగిన తర్వాత కొంచెం జాగ్రత్తగా ఉందామని, కారులోని సీక్రెట్ బాక్స్‌లో దాచాను. 'ఆడి' కారుకున్న అదనపు సదుపాయం అది.

నా మీద, నా సినిమా మీద పగబట్టిన వాళ్ళు ముందు సుపారీ ఇచ్చి, శ్రావణిని హింసించి హార్డ్ డిస్క్ తస్కరించే ప్రయత్నం చేశారు. అది ఫెయిల్ అయ్యేసరికి, ఇప్పుడు చట్టాన్ని అడ్డం పెట్టుకుని నన్ను ఇంకా టార్చర్ పెట్టాలని చూస్తున్నారు. ఒక్కసారి గనుక ఆదాయపు పన్ను శాఖ అధికారులు అకౌంట్ పుస్తకాలు, కంప్యూటర్లు, ల్యాప్‌టాప్‌లు సీజ్ చేస్తే, అవి మళ్ళీ మన చేతుల్లో పడేసరికి ఏ ఐదారు నెలలో లేకపోతే సంవత్సరాలే పట్టొచ్చు.

ఈ లోపల, దురుద్దేశంతో రైడ్ చేసినట్లైతే హార్డ్ డిస్కును నాశనం చేస్తారు. ఒకవేళ రొటీన్ కోర్సులోనే రైడ్ చేసినా, తెలియక మిస్ హాండిల్ చేస్తే, హార్డ్ డిస్కులోని కంటెంట్ అంతా ఫార్మాట్ అయినా, సినిమా నాశనమయిపోతుంది.

అసలు ఐటీ అధికారులకు నా హార్డ్‌డిస్క్‌తో సంబంధం లేదు. కానీ, ఏ అధికారికైనా, మనం చెప్పే రీజనింగ్ నచ్చదు. వాళ్ళు పట్టుకున్న కుందేటికి మూడే కాళ్లంటారు. ఇక రైడుకు వచ్చినప్పుడైతే

## సినీవాలి
## కూపన్ నెం.21 విజేత
### నేమాన సుభాష్ చంద్రబోస్
విశాఖపట్నం

వాళ్ళ టెంపర్స్ హై డిగ్రీలో ఉంటాయి. వాళ్ళతో ఏ విషయంలోనూ ఆర్గ్యూ చేయకూడదు. అందుకే, హార్డ్ డిస్క్ వాళ్ళకు దొరికిన తర్వాత వాదించడం కన్నా వాళ్ళకు దొరకకుండా చూసుకోవడమే ఉత్తమమని నా అభిప్రాయం.

నాకు తెలిసినంత వరకూ, మా సినిమాలో ఎటువంటి బ్లాక్ మనీ వ్యవహారాలు జరగలేదు. ప్రొడ్యూసర్‌గారు బ్యాంకులో డబ్బులు జమ చేశారు. మేము అందులో నుంచి డ్రా చేసి వాడుతున్నాము. అందుకని నాకేం భయం లేదు.

కానీ నా ప్రయారిటీ నా సినిమా. ఈ రైడ్ మూలంగా నా సినిమా ప్రోగ్రెస్ ఆగిపోకూడదని బయటకు పరిగెత్తాను.

నా వెనుక కొంత దూరం ఫాలో అయిన ఐటీ సిబ్బందిలోని వ్యక్తి, ఎవరికో ఫోన్ చేశాడు. వాళ్ళు ఏం చెప్పారో కానీ, అతను వెనుతిరిగాడు. నాకు తెలుసు వాళ్ళ జ్యూరిస్డిక్షన్ నా ఆఫీసు ప్రెమిసెస్ వరకే పరిమితం. చట్ట ప్రకారం, ఆఫీసు బయట వాళ్ళు నన్ను టచ్ చేయలేరు. కావాలనుకుంటే నా ఇంటి మీద రైడ్ చేయవచ్చు. అందుకే, కారును ఆఫీసు ప్రెమిసెస్ నుండి బయటకు తీసుకురమ్మన్నాను.

నేను పరుగు పరుగున గణపతి కాంప్లెక్స్ దగ్గర పార్క్ చేసి ఉన్న కారు చేరుకుని, డ్రైవరుతో 'కారును వేగంగా ఎడిటర్ స్టూడియోకు పోనిమ్మని' చెప్పాను. కారు వేగం కన్నా వేగంగా నా గుండె కొట్టుకోసాగింది. సినిమాల్లో మేం ఛేజింగ్ సీన్లు షూట్ చేస్తుంటాము. కానీ, నిజజీవితంలో నేను ఆ అనుభవాన్ని ఎదుర్కొంటున్నాను. ఒక్క నిమిషం కారు సీటుకు తల ఆన్చి విశ్రమించాను.

మరుక్షణం, కారులో నుండే, "గోపీ! అర్జంటుగా మనం బయటకు వెళ్ళాల్సిన పని ఉంది. చాలా అర్జెంట్. నేనే వస్తున్నాను. రెడీగా ఉండు, ప్లీజ్!" అని ఎడిటర్‌కు ఫోన్ చేశాను.

కారు శ్రీనగర్ కాలనీ రోడ్లమీద నత్తనడకన పోతోంది. అధ్వానంగా ఉన్న ఆ రోడ్లమీద అడుగడుగునా ట్రాఫిక్ అడ్డుపడుతుంటే నా గుండెల్లో గుబులు మొదలయింది. మా కారును ఎవరైనా ఫాలో అవుతున్నారేమోనని మాటిమాటికీ వెనక్కు తిరిగి చూస్తున్నాను. ఈ కారు కంటే నడిచి పోతే తొందరగా గమ్యం చేరుకోవచ్చుననిపిస్తోంది. అస్థిమితంగా, ఒక్కచోట కుదురుగా కూర్చోలేక పోతున్నాను.

"యాకూబ్! పోనీయ్, పోనీయ్!" అని డ్రైవరును తొందరపెట్టాను.

నవ్య-ఈవారం సినీవాలి చదివారు కదా!
మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి
కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!

## సినీవాలి-23 (22-3-2017)

మా ప్రశ్న: హార్డ్‌డిస్కుని ఎక్కడ దాచి ఉంటాడు డైరెక్టర్?

మీ జవాబు---------------------------------------------

చిరునామా---------------------------------------------

------------------------------------------------------

------------------------------పిన్-------------------ఫోన్‌నెం.-------------------

ఈ కూపన్‌ను 21 మార్చి 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.

మా చిరునామా: నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

వివాహాది శుభకార్యాలకు కంచిపట్టు చీరల నిలయం పి.యస్.మూర్తి క్లాత్ స్టోర్స్ మెయిన్‌రోడ్, హన్మకొండ వారి సౌజన్యంతో...

*నిబంధనలు వర్తిస్తాయి

తరువాత అభిషేకం గారికి ఫోన్ చేశాను.

మొన్న హార్డ్ డిస్క్ పోయిందని గ్రహించిన మరుక్షణం, అంతవరకు నన్ను 'ఇంద్రుడు, చంద్రుడు' అని పొగిడిన అభిషేకం గారు పార్టీ బదలాయించి, ప్రొడ్యూసరుకు ఫోన్ చేసి పిలి పించి, శ్రావణి మీద అనుమానం ఉందని చెప్పి, ఆమె మీద దొంగతనం నేరం మోపి పోలీసు లాకప్‌కు పంపించడంలో ఆయనదే ముఖ్య పాత్ర. అందుకే అతనిమీద నాకు చాలా కోపంగా ఉంది.

కానీ, నా కోపం ప్రదర్శించడానికి ఇది సమ యమూ, సందర్భమూ కాదు. దానివల్ల నేను నా శత్రువుల సంఖ్యను పెంచుకోవడం తప్ప మరొక ప్రయోజనం ఉండదు. అందుకే,

"అభిషేకం గారూ! నేనొక చిన్న పనిలో ఉన్నాను. మీరు ఆఫీసులోకి వెళ్ళి అక్కడకు వచ్చిన ఆఫీసర్లకు కో ఆపరేట్ చేయండి. అసలు, ముందు లోపలికి వెళ్ళి అక్కడున్న ఇంఛార్జి అధికారికి ఫోన్ ఇవ్వండి." అని చెప్పి ఆయన ఫోను ఐటీ ఆఫీస రుకు ఇచ్చేంత వరకు వెయిట్ చేస్తూ, ఏం మాట్లా డాలో ప్లాన్ చేసుకున్నాను.

ఫోనులో 'హలో!' అని ఒక అధికార స్వరం వినిపించింది.

నన్ను నేను అతనికి పరిచయం చేసుకుని, "సార్! నేను మా వాళ్ళకు చెప్పాను. మీకు కావల సిన అకౌంట్స్ అన్నీ చూపిస్తారు. నేను ఒక గంటలో మీ ముందు అప్పియర్ అవుతాను. కానీ, ఒక్క విషయం మాత్రం మీకు గుండె మీద చెయ్యి వేసుకుని చెప్పగలను సార్! మా దగ్గర ఒక్క రూపాయి కూడా బ్లాక్ మనీ లేదు. ప్రతీ పైసకు లెక్క రాసి ఉంది. మీరెందుకు వచ్చారో, ఎవరి కంప్లైంట్ మీద వచ్చారో నేనూహించగలను. ఇది ఇండస్ట్రీలో ఒకరిమీద ఒకరికున్న జెలసీ తప్ప మరేం లేదు సార్! ఐ కెన్ అష్యూర్ యూ దట్. ప్లీజ్ గివ్ మీ వన్ అవర్! " అంటూ, అతని ఈగో శాటిస్‌ఫై చేస్తూ, నేను చెప్పాలనుకున్నది చెప్పాను.

అలా అతనికి నా మనసులోని మాట చెప్పడం నాకు గొప్ప రిలీఫ్ నిచ్చింది. గుండెల్లో బరువును దించుకున్నట్టయింది.

ఇంతలో, ఎడిటింగ్ స్టూడియోకు చేరుకున్నాము.

"కారు రివర్స్ చేసి పెట్టుకో యాకూబ్! ఇంజన్ కూడా ఆఫ్ చేయకు. ఒక్క క్షణంలో వస్తాను." అని పరుగు పరుగున మెట్లెక్కి గోపీని కలుసుకున్నాను.

"గోపీ! ఒక చిన్న ప్రాబ్లం. మన హార్డ్ డిస్కు నుండి వెంటనే కాపీలు చేసి డబ్బింగుకు, ఆరార్‌కు, డీఐకి పంపాలి. ఇంకో రెండు మూడు ఎక్స్ ట్రా కాపీలు తీసి పెట్టుకోవాలి. కానీ, మన స్టూడియో వద్దు. నీకు తెలిసిన నమ్మకమైన వేరే స్టూడియో ఏదైనా ఉందా? ఎంత డబ్బు ఖర్చయినా ఫర్వా లేదు. ఇవ్వాళ, ఇప్పుడే పని ప్రారంభించాలి." అన్నాను ఉద్విగ్నంగా.

సినిమారంగంలో ఇట్లాంటి సంఘటనలు అరుదు గానే అయినా, జరుగుతూనే ఉంటాయి. ఎదుటి వారి సినిమాను సబొటేజ్ చేసేందుకు బయట ప్రపంచానికి తెలియని ఎన్నో కుట్రలు, కుతం త్రాలు జరుగుతూనే ఉంటాయి. చిన్న సినిమాలకు కాదు గానీ, పెద్ద సినిమాలకైతే ఇటువంటి ప్రమా దాలు ఎక్కువే. అందుకే, జాగ్రత్తలు కూడా చాలానే తీసుకుంటారు. ఆ సినిమాల హార్డ్ డిస్క్ బయటకే రాదు. అత్యంత కట్టుదిట్టమైన భద్రతా వలయం మధ్య పోస్ట్ ప్రొడక్షన్ పనులు చేస్తుంటారు.




గోపీ అట్లాంటి స్టూడియో ఒకటి తనకు తెలుసు నన్నాడు.

వెంటనే అక్కడికి పరిగెత్తాము. అక్కడి ఓనర్‌తో మాట్లాడాడు. వాళ్ళడిగిన డబ్బులు ఇచ్చాను.

"సార్! నేను ఇక్కడే ఉంటాను. రెండరింగ్ పెట్టి, అది పూర్తికాగానే కాపీ పెడ్తా! అయిపోగానే మీకు ఫోన్ చేస్తాను. డోంట్ వర్రీ సార్! హార్డ్ డిస్క్ తీసుకున్న తర్వాతనే ఇక్కడినుంచి కదులుతా"నని చెప్పడంతో నా మనసు నెమ్మళించింది.

అక్కడినుంచి నేను ఆఫీసుకు బయల్దేరాను.

నేను వెళ్ళేసరికి ఆఫీసులో హడావుడి కొంత సద్దుమణిగింది. ఆఫీసర్ నా రూములో కూర్చుని ఫైల్స్ చూస్తున్నాడు.

నేను అతనితో కరచాలనం చేసి, నా సీటులో కూర్చున్నాను. అందరికీ కాఫీ, స్నాక్స్ తెప్పించమని చెప్పి,

"సార్! అయాం డైరెక్టర్ ఆఫ్ దిస్ ఫిల్మ్. ఈ బ్యానర్, ప్రొడ్యూసర్ గారితో కలిసి ఫ్లోట్ చేశాము. మేము మా ట్రాన్సాక్షన్స్ అన్నీ త్రూ బ్యాంక్ ద్వారానే, త్రూ చెక్ ద్వారానే చేస్తాము. క్యాష్ ఖర్చు లన్నింటికీ వోచర్స్ ఉన్నాయి. ఇది పెద్ద ప్రొడక్షన్ హౌసేం కాదు సార్! చిన్న బడ్జెట్ ఫిల్మ్. పెద్ద స్టార్ క్యాస్టింగ్ కూడా లేదు. కానీ, మంచి కథను నేషనల్ అవార్డు కోసం ఆ స్థాయిలో తీసే ప్రయత్నం చేస్తు న్నాము. ఇది కొందరికి నచ్చడం లేదు. మమ్మల్ని నానా విధాలుగా టార్చర్ చేస్తున్నారు. మొన్న రాత్రి వరకు పోలీస్ స్టేషనులోనే గడిపాము. ఆ ప్రయత్నం విఫలం కావడంతో మిమ్మల్ని ప్రయో గించారని నేను అనుకుంటున్నాను." అని చెప్పా ల్సిన విషయమంతా ఒక్క గుక్కలో చెప్పేశాను.

ఆయన అప్పటికే ఫైల్స్ అన్నీ పరీక్షించి ఒక అవగాహనకు వచ్చినట్టుంది. దానికి తోడు నేను చెప్పిన విధానంతో కూడా ఇంప్రెస్ అయ్యాడు.

"మొత్తం సినిమా బడ్జెట్ ఎంతండీ?" అని ఆయన అడిగారు.

నేను చెప్పాను.

"అంతేనా?" అన్నాడు ఆశ్చర్యంగా.

ఔనని తలూపాను.

"మరి మీరెందుకు ఆఫీసుకొచ్చి లోపలికి రాకుం డానే పారిపోయారు? మా వాళ్ళు చెప్పారు." అన్నాడు.

నాకు నవ్వొచ్చింది.

"లేదు సార్! నేను పారిపోలేదు. మా పరిస్థితి మీకు చెప్పాను కదా! మా సినిమాను సబొటేజ్ చేయడానికి ఈ సంఘటనలు జరుగుతున్నాయని నా అనుమానం. మీ డిపార్టుమెంటుకు సంబంధించి నంత వరకు మా ఆదాయ వ్యయాల గురించి ఏ వివరాలైనా చెబ్తాను. కానీ, అందరూ మీలా ఉండరు కదా సార్! మీరు నా మాట నమ్మారు. అందుకు థాంక్స్! కానీ, ఒకవేళ నా మాటలు మీరు నమ్మకుండా అకౌంట్స్‌తో పాటూ నా హార్డ్ డిస్క్ కూడా సీజ్ చేస్తే, మా శత్రువుల కుట్రలు ఫలించి నట్టే కదా సార్! ఇప్పటికే హార్డ్ డిస్క్ మృత్యు ముఖంలోకి వెళ్ళి వచ్చింది" అంటూ అంతకు ముందు జరిగిన సంఘటన క్లుప్తంగా చెప్పాను.

ఆయన జెన్యూన్‌గా సానుభూతి చూపించారు.

"అందుకే మా సినిమా హార్డ్ డిస్కును సేఫ్‌గా దాచి వచ్చాను. అంతే సార్!" అన్నాను.

నా నిజాయితీ ఆయనకు నచ్చినట్టుంది.

"ఓకే! ఐ బిలీవ్ యూ! కానీ, అకౌంట్ బుక్స్ అప్‌డేట్‌గా లేవు. అవి రెడీ చేసి ఒకసారి మీ ఆడి టర్ తో పంపించండి. అదర్ వైజ్, ఎవ్రీథింగ్ ఈజ్ ఓకే. ఆల్ ది బెస్ట్ ఫర్ యువర్ ఫిల్మ్!" అంటూ కాఫీ తాగి, స్నాక్స్ తిని, బ్యాంక్ అకౌంట్స్, వోచర్స్ ఫోటో కాపీలు, నేను రాసిచ్చిన చిన్న స్టేట్‌మెంట్ తీసుకుని పావుగంట తరువాత బయలుదేరడానికి సిద్ధ మయ్యారు.

ఆయన వెళ్ళడానికి కుర్చీలో నుంచి లేచి బయ టకు వెళ్ళబోతూ, తలుపు దగ్గర ఒక్క క్షణం ఆగి, నా వైపు చూశాడు. తరువాత తలుపులు మూసి నన్ను దగ్గరకు రమ్మని సైగ చేశారు.

నేను ఆశ్చర్యంగా చూసి, ఆయన దగ్గరకు వెళ్ళాను.

ఆయన నా చెవిలో చెప్పిన విషయం విని, నాకు మూర్ఛపోయినంత పనయింది.

ఆయన వెళ్ళగానే, నేను కుర్చీలో కూలబడి పోయాను.

***(ఇంకా వుంది)***

## యూరప్‌లో సెక్స్ డాల్స్ బిజినెస్

యూరప్‌లో మొట్టమొదటి సెక్స్ డాల్స్ సెంటర్ ప్రారంభమైంది. అంటే ఈ బ్రోతల్‌హౌస్‌లో క్లయింట్ల కోసం అందమైన సెక్స్ డాల్స్ సిద్ధంగా ఉంటాయన్నమాట! స్పెయిన్ దేశం బార్సిలోనాలో ఈ బిజినెస్ మొదలైంది. నలభై కిలోలు బరువుగల నాలుగు రకాల సిలికాన్ డాల్స్‌లో తమ అనుకూలతను బట్టి విటులు వీటిని ఎంపిక చేసుకోవచ్చు.

క్లయింట్ రిక్వైర్‌మెంట్స్‌కు అనుగుణంగా ఈ డాల్స్‌ను అలంకరించి గదిలో సిద్ధంగా ఉంచుతారు. డ్రెస్, అలంకరణ ఎలా ఉండాలో క్లయింట్ ముందుగానే చెప్పాలి. స్త్రీ పురుషులెవరైనా కావచ్చు, మూడ్‌లోకి రావడానికి గదిలో డిమ్‌లైట్స్ ఉండాలా, కొవ్వొత్తి వెలుగు ఉండాలా, భారీ ప్లాస్మా టీవీ స్క్రీన్ ఉండాలా?, రేసీ మూవీస్ వాచ్ చేస్తారా? లాంటివన్నీ చెప్పి సిద్ధం చేయించుకోవచ్చునని Lumi Dolls క్లబ్ పేర్కొంది.

ఈ నిలువెత్తు బొమ్మలతో సెక్స్ చేయడానికి గంటకు 70 పౌండ్లు చెల్లించాలని ఓపెనింగ్ ప్రమోషన్‌లో భాగంగా స్పెషల్ ఆఫర్ ప్రకటించారు. అయితే డిమాండ్ పెరిగిపోవడంతో క్లయింట్లు ఎగబడి ఈ డాల్స్‌కి గంటకు 100 పౌండ్లు చెల్లించారట! రకరకాల పొజిషన్స్‌లో ప్లే చేయడానికి ఈ డాల్స్ అనువుగా ఉంటాయి.

పునర్వినియోగం చేసే ముందు ఈ డాల్స్‌ను ప్రతిసారీ యాంటీ బాక్టీరియల్ లిక్విడ్స్‌తో శుభ్రం చేస్తామనీ, పరిశుభ్రతలో ఎలాంటి లోపం ఉండదనీ క్లబ్ భరోసా ఇస్తోంది. సిలికాన్ మెటీరియల్‌తో తయారు చేసిన ఒక్కొక్క బొమ్మనూ 4,300 పౌండ్లకు కొనుగోలు చేశారట.

వీటికి చక్కటి పేర్లు కూడా పెట్టారు. ఆసియా వాసుల ముఖకవళికల్ని పోలి ఉండే 161 సెంటీమీటర్ల పొడవుగల లిలి అనే పేరుగల డాల్, భారీ వక్షస్థలం, గుచ్చి గుచ్చి చూసే కాంతిమంతమైన ముఖవర్చస్సుతో ఆకర్షణీయంగా ఉండే 170 సెంటీమీటర్ల పొడవుగల డాల్, ఆఫ్రికన్ ఫీచర్స్ మొద్దు పెదాలతో 168 సెంటీమీటర్ల పొడవుండే Leiza పేరుగల బొమ్మ, జపనీస్ మోడల్‌లో వైఢూర్యాల్లాంటి కళ్ళతో గుచ్చి గుచ్చి చూసే బొమ్మ క్లయింట్లను ఆకట్టుకుంటున్నాయట.

ఈ లూమీ డాల్ క్లబ్ తనను తాను మొట్టమొదటి సెక్స్ డాల్ ఏజెన్సీగా ప్రకటించుకుంది. కాళ్ళూ చేతుల కదలిక, స్పర్శ విషయంలో ఇవి పూర్తిగా 'రియలిస్టిక్ డాల్స్' అనీ, క్లయింట్లు తమ కలలు, విపరీత భావనలు, ఊహానుభూతులను ఈ డాల్స్‌తో తీర్చుకోవచ్చుననీ, ఈ అనుభవాలు ఎంతో ప్లెజర్‌బుల్‌గా, ఎగ్జైటింగ్‌గా ఉంటాయనీ ఏజెన్సీ చెబుతోంది. జపాన్, మలేసియాలలో ఈ డాల్స్ ఇప్పటికే సూపర్‌హిట్టయ్యాయట. కొన్నిరోజులు ముందుగానే లూమీడాల్స్ డాట్‌కామ్‌లో అడ్వాన్స్ బుకింగ్ చేసుకోవచ్చునట.






**విజయచిత్ర జ్ఞాపకాలు**
బి.కె.ఈశ్వర్
**ధర:** 175 రూపాయలు
**పేజీలు:** 288
**ప్రచురణ:** విజయా పబ్లికేషన్స్, విజయాగార్డెన్స్, వడపళని, చెన్నై-26
**ప్రతులకు:** సాహితి ప్రచురణలు, విజయవాడ

## సినీస్వర్ణయుగంలో ఓ ఫిలిమ్ జర్నలిస్టు జ్ఞాపకాలు

విశ్వసనీయతే సమాచారానికి ఊపిరి. వార్తకు విలువ, సమాజానికి చలువ చేకూరేదప్పుడే. అలాంటి విలువైన పత్రికలెన్నో కాలగర్భంలో కలిసిపోగా ఇప్పటికీ కొన్ని మిగిలే వున్నాయి. అలా అంతర్థానమైన సినీ మాసపత్రిక 'విజయచిత్ర'.

ఎలాంటి గాసిప్స్ లేకుండా సినిమారంగ విలువలు కాపాడిన ఆ పత్రికలో ఫిలిమ్ జర్నలిస్టుగా పేరొందిన వ్యక్తి బి.కె.ఈశ్వర్. రచయిత, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు (ఉత్తమ అనువాద గ్రంథం) గ్రహీత, సినీ కథ, మాటల రచయిత, కథానికా రచయిత కూడా. ఈనాటికీ పాతతరం విలువల్ని తన భుజంపై మోసుకెళుతున్న సీనియర్ సినీ జర్నలిస్ట్ ఈశ్వర్.

ప్రలోభాలకు లొంగని నైజం, నిబద్ధత, అంకితభావం, జిజ్ఞాసతో ఉన్నతశిఖరాలు అధిరోహించారాయన. సినీ స్వర్ణయుగం నాటి మేటి నటులు, దర్శకులు, ఛాయాగ్రాహకుల మధ్య తిరిగి వారి వ్యక్తిత్వాలను ఇనుమడింపజేసే అసిధారావ్రతాల్లాంటి ఇంటర్వ్యూలతో మన్ననలు పొందారాయన. విజయచిత్రతో ఆయన అనుబంధం, ఆ జ్ఞాపకాల పందిరే ఈ పుస్తకం. నవ్య వీక్లీలో 62 వారాలపాటు 'అనగనగా ఒకసారి' సీరియల్‌గా ప్రచురితమై విశేష పాఠకాదరణ పొందింది.

తన లాజిక్‌తో ఎన్టీఆర్, ఏఎన్నార్ అభిమానం చూరగొన్నారు ఈశ్వర్. గొప్ప నటుల నిరాడంబరత, కుండబద్దలుకొట్టినట్టు మాట్లాడే భానుమతి, జయసుధ, రాధికల తత్వం, జయలలిత క్రమశిక్షణ, విలేకరిని తరిమితరిమి కొట్టిన ధర్మేంద్ర యారోగెన్సీ, అత్యధిక పారితోషికం తీసుకునే రజనీకాంత్ ఉదారత, కమల్ హాసన్ నిరాడంబరత ఇందులో చదువుకోవచ్చు.

అమెరికాలో మనవాళ్ళకి భద్రతలేదని దశాబ్దాలనాడే భానుమతి వ్యక్తం చేసిన ఆందోళన ఈ పుస్తకంలో చదివి అబ్బురపడతాం. లక్ష రూపాయలు పారితోషికం తీసుకున్న తొలి హాస్యనటుడు శివరావు దయనీయ మరణం, భార్య అస్థికల్ని స్టేజీవెనకాలపెట్టి డబ్బుకోసం నాటకం ప్రదర్శించిన పద్మనాభం విషాదం, రత్నకుమారి అనే నటి వాణిశ్రీగా ఎదగడానికి పడిన సంఘర్షణ, ఆమె పరిపక్వత, వ్యక్తిగత బలహీనతను నిర్భయంగా చెప్పిన నాగయ్య ఆదర్శం, ముగ్గురు ముఖ్యమంత్రులను ఆడించిన గొప్ప డాన్సర్ సలీం జైలుపాలైన విషాదగాథ, గొప్ప నటుల మద్యం అలవాట్లు, సెట్‌లో వారి తీరు, స్టింగ్ ఆపరేషన్‌లో లేడీ జర్నలిస్టుకు దొరికిపోయిన శక్తికపూర్, స్టేజీమీద పక్కనే కూర్చున్న భర్త చలానికి శ్రద్ధాంజలి ఘటించిన శారద భాషా వైపరీత్యం, ఘంటసాల రెండో జీవితం (సరళగారితో) ఇంకా గొప్ప నటులు, ప్రయోగాలు చేసే దర్శకులు, నాటి సినీ వైభవం ఈ పుస్తకంలో మనకు కనిపిస్తాయి. ఒక్కమాటలో చెప్పాలంటే జగన్నాథ శర్మగారు ముందుమాటలో పేర్కొన్నట్టు తెర వెనుక జీవితాల్లోని కథనమూ, కదనమూ రెంటినీ మన కళ్ళముందు ఆవిష్కరించిన పుస్తకమిది. సినీ ప్రియులూ, సినీ జర్నలిస్టులూ తప్పక చదవాల్సినది.

## స్వీకారాలు

**శ్రీకృష్ణదేవరాయలు**
యస్.డి.వి.అజీజ్
**ధర:** 100 రూపాయలు
**పేజీలు:** 96
**ప్రతులకు:** ఎస్.అబ్దుల్ అజీజ్, 46/634, బుధవారంపేట, కర్నూలు.

**రాజానాయని వేంకటరంగారావు బహద్దరు**
**(తెలంగాణ దారిదీపాలు)**
కేశవపంతుల నరసింహశాస్త్రి,
ఆచార్య తూమాటి దొణప్ప
**ధర:** 30 రూపాయలు, **పేజీలు:** 38
**ప్రతులకు:** విశాలాంధ్ర, నవచేతన, ప్రజాశక్తి, నవతెలంగాణ బుక్‌హౌస్ బ్రాంచీలు

**సుందరి సుబ్రహ్మణ్యం**
**నవ్వుల కథలు మొదటిభాగం**
సి.ఎన్.నాగేశ్వరరావు, సి.ఎల్.రాజకుమారి
**ధర:** 100 రూపాయలు
**పేజీలు:** 126
**ప్రతులకు:** నవచేతన, విశాలాంధ్ర బుక్‌హౌస్ బ్రాంచీలు

—లలితా త్రిపుర సుందరి






# మీరు కాని మీరు

## మనిషిని పోలిన మనిషి

**'భలే భలే అందాలు సృష్టించావు.. ఇలా మురిపించావు.. ఇదే ఆనందం.. అదే అనుబంధం..' సృష్టి అందాలను పోల్చుతూ ఓ కవి కలం నుంచి జాలువారిన పాట ఇది. ప్రకృతి అందచందాలను పోల్చడంలో కవులు మునిగిపోతే, సృష్టిలోని రహస్యాలను వెలికితీసేందుకు శాస్త్రవేత్తలు, మేధావులు ఏళ్ల తరబడి ప్రయత్నిస్తూనే ఉన్నారు. పుష్పకవిమానంలో ఎంతమంది ఎక్కినా ఒకరికి చోటు ఎలా ఉంటుందో.. ఎన్ని రహస్యాలను ఛేదించినా కొత్త ప్రశ్నలు అలా పుట్టుకొస్తూనే ఉన్నాయి. విశ్వంలోకి లెక్కకు మించి ఉపగ్రహాలను పంపించాం. విశ్వ విజేతగా నిలుస్తున్నాం. కానీ కొన్ని ప్రశ్నలకు సమాధానాలు మాత్రం ఇంకా అన్వేషిస్తూనే ఉన్నాం. అలాంటి ఓ సమాధానం లేని ప్రశ్నే 'మనిషిని పోలిన మనిషి'. చుట్టరికం లేకున్నా ఎక్కడో వేల, లక్షల కిలోమీటర్ల దూరంలో మనిషిని పోలిన మనిషి ఉండటం వింతేకదా మరి!**

### చుట్టరికం లేకుండా ఒకే పోలికలా?

అచ్చం తండ్రి పోలికే... ఈ ముక్కు చూడు అచ్చం వాళ్లమ్మదే... కళ్ళు తాతయ్యవే... పాపో, బాబో పుట్టగానే ఇలా పోలికలను చూసేసి మురిసిపోతుంటారు. వాటిల్లో కొన్ని నిజం కూడా అవుతుంటాయి. ఇక కవల పిల్లలయితే వేరుగా చెప్పనక్కర్లేదు. ఎవరు ఎవరో కూడా గుర్తు పట్టలేని విధంగా రూపురేఖలు అచ్చుగుద్దినట్లు దిగిపోతాయి. ఒక్కోసారి కుటుంబసభ్యులే గుర్తుపట్టేందుకు కష్టపడుతుంటారు. ఇద్దరు కవలలు కలిసి స్కూళ్లల్లో టీచర్లను, స్నేహితులను, ఆఖరికి కుటుంబసభ్యులను కూడా ఆటపట్టించే సంఘటనలు సినిమాల్లోనే కాదు నిజజీవితంలో కూడా జరుగుతూనే ఉంటాయి. రక్త సంబంధం కారణంగా ఒకే పోలికలు ఉండటం, కుటుంబ సభ్యుల పోలికలు రావడం సహజం. మరి మనిషిని పోలిన మనుషులు ఈ ప్రపంచంలో ఏడుగురు ఉంటారని వింటుంటాం కదా!

అలాంటి ఉదాహరణలు అప్పుడప్పుడూ పేపర్లలోనూ, టీవీల్లోనూ చూస్తూనే ఉంటాం. కానీ అసలు అలా ఎందుకు ఉంటారు..? మన ఇంట్లో మనుషులు కాదు.. చుట్టాలు కాదు.. కనీసం తాతముత్తాతల చుట్టరికం కూడా లేదు. ఈ నేల కూడా అసలే కాదు.. ఎక్కడో వేల, లక్షల కిలోమీటర్ల దూరంలోను మనలాగే ఇంకొకరు ఎందుకు ఉంటారు? అనే ప్రశ్నలకు చాలా సమాధానాలే వినిపిస్తున్నాయి.

### అందరికీ డూప్లికేట్స్ సాధ్యమేనా..?

ప్రపంచ జనాభా దాదాపు 740 కోట్లు. ఈ ఏడు వందల నలభై కోట్ల మంది ప్రజల్లో ఎవరికి వారే సెపరేటు. ఎవరి ముఖాలు వారివే. కనుపాపల దగ్గర నుంచి వేలి ముద్రల వరకూ ఒకరికొకరికి సంబంధం ఉండవు. సూర్య హీరోగా వచ్చిన 'సెవెన్త్ సెన్స్' సినిమా చూసే ఉంటారు. వెయ్యేళ్ళ క్రితం చనిపోయిన బోధిధర్ముడి వంశానికి చెందిన ప్రస్తుత తరం వ్యక్తిని గుర్తించి, ఆ వ్యక్తిని బోధిధర్ముడిలా మార్చే ప్రక్రియే ఈ సినిమా. బోధిధర్ముడి సిద్ధాంతాలు, ఆయన ప్రతిపాదించిన వైద్యశాస్త్రాన్ని నేటి తరానికి అందివ్వడమనేది సినిమా కాన్సెప్ట్. సినిమా కథ ఎలా ఉన్నా, వేల సంవత్సరాల క్రితం చనిపోయిన వ్యక్తి జన్యువులతో.. లక్షల సంవత్సరాల తర్వాత కూడా ఓ వ్యక్తిని జన్మింపజేయొచ్చని శాస్త్రవేత్తలు చెబుతున్నారు. ఈ భూమిపై లక్షల్లో ఒకరికి ఎటువంటి జన్యు సంబంధాలు లేకున్నా ఒకేలా ఉండే అవకాశం ఉందని కూడా వారు వివరిస్తున్నారు.

### మీ పోలికలున్నవారిని కనుక్కోండి

ఇదంతా చదువుతుంటే నాలాగా కూడా ఒకరు ఉంటారేమో! అనిపిస్తోందా? ఎలా ఉన్నారో, ఎక్కడ ఉన్నారో వివరాలు తెలుసుకోవాలని ఆరాటపడుతున్నారా? అలాంటి వారి కోసమే ఓ వెబ్‌సైట్ వినూత్న ప్రయత్నం చేస్తోంది. ఒకే పోలికలతో ఉన్న వ్యక్తులను ఒకరికొకరు పరిచయం చేసేందుకు ఓ వేదిక రూపొందించింది. అందుకోసం twinstrangers.net పేరుతో ఓ వెబ్‌సైట్ రూపొందించింది. ఈ వెబ్‌సైట్‌లోకి వెళ్ళి వేరు వేరు హావభావాలతో ఉన్న రెండు ఫోటోలతోపాటు, పేరు, అడ్రస్, వ్యక్తిగత వివరాలను నమోదు చేయాల్సి ఉంటుంది. ఫోటోలోని పోలికలతో సరిపోలే 'మనిషిని పోలిన మనిషి' వివరాలను అప్పటికప్పుడు ఈ వెబ్‌సైట్ ద్వారా తెలుసుకోవచ్చుట.

అయితే మీరు ప్రయత్నించినట్లే మీలాగే ఉన్న వ్యక్తి కూడా ఇదే వెబ్‌సైట్లో వివరాలను నమోదు చేసుకుంటేనే ఇది సాధ్యమవుతుంది. మరి 'మీరు కాని మీరు' ఎక్కడైనా ఉన్నారేమో ఓ సారి ప్రయత్నించి చూడండి.

మనిషిని పోలిన మనుషులు ఏడుగురు కచ్చితంగా ఉంటారని చెప్పలేం కానీ ఇద్దరైనా ఉండే అవకాశం మాత్రం ఉందట. అయితే వాళ్ళు ఎక్కడ ఉన్నారో వెతకడమే అతిపెద్ద కష్టం. ఎందుకంటే కష్టపడి పనిచేసుకుని బతికే వాళ్ళు కొందరైతే, ఉద్యోగాలు చేసుకుంటూ బిజీ లైఫ్ గడిపేవారు మరికొందరు. తమలాగే ఉన్న ఇంకొకరి కోసం, వాళ్ళను వెతుక్కుంటూ ప్రపంచాన్ని చుట్టబెట్టేంత సమయం ఎవరికైనా ఉండాలి కదా! ఒకవేళ ఉన్నా దానికి సరిపడా డబ్బు కావాలి. కానీ కొందరు మాత్రం ఈ వినూత్న ప్రయత్నానికి శ్రీకారం చుట్టారు.

## ఫొటోగ్రాఫర్ ప్రయత్నం.... ప్రపంచం విస్మయం

ఐయామ్ నాట్ ఎ లుక్ ఎలైక్ (I'M NOT A LOOK ALIKE!) పేరుతో కెనడాకు చెందిన ఫ్రాంకోయి బ్రూనెల్లే అనే ఓ ఫొటోగ్రాఫర్ పెద్ద ప్రాజెక్టుకే రూపకల్పన చేశారు. దాదాపు 200 మందికి సంబంధించిన డూప్లికేట్ వ్యక్తుల ఫొటోలు సేకరించి తన వెబ్‌సైట్లో (www.francoisbrunelle.com) పెట్టాడు. తన ప్రాజెక్టును వివరిస్తూ సోషల్ మీడియాలో విస్తృత ప్రచారం చేయడం వల్ల ప్రపంచ నలుమూలల నుంచి ఫొటోలు వెల్లువలా వచ్చాయి. వాటిల్లో నుంచి ఒకే పోలికలు ఉన్నవారిని వేరు చేసి తన వెబ్‌సైట్లో వివరాలతో సహా పొందుపరిచాడు. 1999వ సంవత్సరం నుంచి ఆయన ఇదే ప్రాజెక్టుపై ఉన్నాడు. ఆయన ప్రాజెక్టులో తమలాగే ఉన్న వారిని చూసి, వాళ్ళ వివరాలను చూసి అచ్చెరువొందిన వాళ్ళు చాలామందే ఉన్నారు. యూనివర్సిటీ ఆఫ్ మిచిగాన్‌కు చెందిన రోని యెల్ టెస్లెర్, యూనివర్సిటీ ఆఫ్ మేరీలాండ్‌లో చదువుతున్న గారెట్ లెవెన్‌బ్రూక్... ఇద్దరూ ఒకలాగే ఉంటారు. బ్రూనెల్లే ప్రాజెక్ట్‌లో ఈ విషయం తెలుసుకుని ఇద్దరూ కలుసుకోవాలనుకున్నారు. న్యూయార్క్ సిటీలోని ఓ పిజ్జా పార్లర్ వేదికగా మూడేళ్ళ క్రితం ఈ ఇద్దరి కలయిక జరిగింది. ఎటువంటి జన్యు సంబంధం లేకున్నా ఒకరిని పోలి ఒకరు ఉండటాన్ని వారు నమ్మలేకపోయారు. ఇద్దరి వయసు కూడా ఒకటే కావడం ఓ వింత కాగా.. వారిద్దరూ ఒకరికి తెలియకుండా మరొకరు.. ఒకే డ్రింక్‌ను ఆర్డర్ చేయడం మరింత విచిత్రం. వారిద్దరి అలవాట్లు దాదాపుగా ఒకేలా ఉన్నాయని వారి మాటల్లో వెల్లడైంది. ఆ పిజ్జా పార్లర్‌కి వచ్చినవారందరూ, ఆ రోజు వారిద్దరినీ చూస్తూనే ఉన్నారని వెయిటర్ చెప్పుకొచ్చాడు.

## అసలు కారణాలేంటి..?

ఒకే కుటుంబంలో ఇద్దరు వ్యక్తులు ఒకేలా ఉన్నారంటే దానికి జన్యుపరమైన కారణాలు కొన్ని ఉంటాయి. మరి ఎటువంటి చుట్టరికం లేకుండా ఇద్దరు వ్యక్తులు ఒకే పోలికలతో ఎందుకు ఉంటారు? దీనికి కారణాలేంటి? ముక్కు, చెవి, జుట్టు, ముఖం.. ఇలా అన్నీ ఒకే పోలికలు ఉండటమేంటి? అనే ప్రశ్నలకు శాస్త్రవేత్తలు సమాధానాలు కనుగొనే పనిలో ఇప్పటికీ ఉన్నారు. 'మన తాత ముత్తాతల కాలం నుంచి ఇంకా వెనక్కు వెళ్ళి లక్షల సంవత్సరాల గతంలోకి వెళ్తే... అంతా అప్పుడు ఆదిమానవులమే. అందరూ సంచార జీవులే. కూరగాయలు, వండుకోవడాలు వంటివి ఏమీ లేవు. ఇలా సంచార జీవులుగా ఉన్నప్పుడు ఖండాలు దాటి ప్రయాణాలు కూడా చేశారు. అలాంటి సమయాల్లో కొందరు కొన్ని కొన్ని ప్రదేశాల్లో ఉండిపోయారు. అలా ఉండిపోయిన వారి జాతి సంతతి, వివిధ ప్రాంతాలకు తరలివెళ్ళిన వారి జాతి సంతతికి చెందినవాళ్లే ఈ 'మనిషిని పోలిన మనిషి' అయి ఉంటారు' అని ఓ శాస్త్రవేత్త చెబుతున్నారు. మనిషిని పోలిన మనిషి జన్మించేందుకు ఓ జన్యువు చాలనీ, ఆ జన్యువు ద్వారా కొన్ని కోట్ల సంవత్సరాల తర్వాత కూడా ఒకే పోలికలు ఉన్న మనుషులను సృష్టించవచ్చునంటున్నారు. అక్కడ ఉన్న వాతావరణ పరిస్థితులు, తినే ఆహారపు అలవాట్లు, భూమి లక్షణాలు, నీరు వంటివన్నీ ఈ మనిషిని పోలిన మనుషుల పుట్టుకకు కారణమవుతాయని మరో శాస్త్రవేత్త చెబుతున్నారు. ఏదిఏమైనా జన్యు సంబంధాలు లేకుండా మనిషిని పోలిన మనుషులు పుట్టడం అంతుబట్టని విషయమే!

## కళ్ళ ముందే సజీవ సాక్ష్యాలు

ఈ మనిషిని పోలిన మనుషులకు సజీవ సాక్ష్యాలు కూడా చాలానే ఉన్నాయి. ఉత్తర కొరియా అధ్యక్షుడు కిమ్‌జాంగ్ ఉన్‌లాగా ఆస్ట్రేలియాకు చెందిన హోవార్డ్, అమెరికా అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్‌లా చికాగో నివాసి డెన్నిస్ అచ్చుగుద్దినట్లు ఉన్నారు. వీరిద్దరూ కలిసి ఎన్నో ప్రైవేటు కార్యక్రమాల్లో పాల్గొన్నారు. ఇక అమెరికా మాజీ అధ్యక్షుడు ఒబామా ఫొటోకు బదులుగా ఇండోనేషియాలోని బాండుంగ్‌కు చెందిన ఇల్హమ్ అనాస్ ఫొటోను ప్రచురించి ఓ అమెరికన్ పత్రిక పప్పులో కాలేసింది. ఆ తర్వాత తప్పు తెలుసుకుని క్షమాపణ కూడా చెప్పేసింది. మన ప్రధాని మోదీ, మాజీ రాష్ట్రపతి అబ్దుల్ కలాం, రామ్‌దేవ్‌బాబా, జాతిపిత గాంధీ, ఇలా ఒకరేమిటి... సజీవ సాక్ష్యాలుగా చాలా మందే ఉన్నారు. కాకుంటే వారిని జాగ్రత్తగా పరిశీలిస్తే ఇట్టే గుర్తుపట్టగలం. ఇద్దరు వ్యక్తుల డీఎన్ఏలు వందశాతం ఒకేలా ఉండకపోవచ్చుననీ, ఈ తేడానే ఇద్దరినీ తేరిపార చూస్తే గుర్తుపట్టేలా చేస్తుందంటున్నారు పరిశోధకులు.

-కె. హసాన్
kandula.hassan@gmail.com











# వేధిస్తున్న ప్రశ్న

-టి.ఎస్.ఎ.కృష్ణమూర్తి

**రాష్ట్రంలో నైరుతి నుండి ఈశాన్యానికి విసిరివేయబడ్డ వాణ్ణి! ఇక్కడివాళ్ళకు ఇప్పుడప్పుడే నా సంగతి ఎలా తెలుస్తుంది? తెలిసే అవకాశం లేదు. అందుకే పైరవీ కారులు ధైర్యంగా నా వద్దకు వరుసగా వచ్చేస్తున్నారు. కార్యాలయ కిందిస్థాయి సిబ్బంది కూడా ఆ విషయంలో కొద్దో గొప్పో చూచాయగా తెలియజెప్పే ప్రయత్నం చేస్తున్నారు.**

అయినా అదేమంత పెద్దపోస్టని? నాన్ టెక్నికల్ సూపర్‌వైజర్! అదైనా కాంట్రాక్టు పద్ధతిలో తీసుకుంటున్న ఉద్యోగం!! భవిష్యత్తులో పర్మినెంట్ చేసే అవకాశాలూ చాలాచాలా తక్కువ. ప్రారంభ జీతం అయితే పదిహేను వేలకు కాస్త అటూఇటూ అయినా, 'అంతోటి పాండిత్యానికి ఇంతోటి ఇది...' అన్నట్లుగా ఆ ఉద్యోగానికి ఆరు, ఏడు అంటూ పైరవీకారులు నాకు లంచం ఎరవేస్తున్నారు. అసలు నేను అలాంటివి ముట్టనయ్యా అంటే వినిపించుకోరు. ఐదు లక్షలు, ఆరు లక్షలు, ఏడు లక్షలు... అంటూ ఒకరి మీద మరొకరు పోటీ పడిపోతున్నారు. దాంతో నాకు దిమ్మ తిరిగిపోయింది.

ఇంత చిన్న కాంట్రాక్టు పోస్టుకు అంతపెద్ద లంచమా?

'ఓ నా దేశమా... ఏమైపోబోతున్నావు?' అంటూ ఆక్రోశించసాగింది నా మనసు. నా మనసు సంగతి అటుంచితే కర్తవ్య నిర్వహణ అన్నదీ దైవకార్యమే కదా? అందువల్ల వన్ ఈస్టూ టెన్ కింద హాజరైన పది మందినీ జాగ్రత్తగా ఇంటర్వ్యూ చేశాను.

పక్కాగా ఎలిజిబిలిటీ ఉన్న వాళ్ళు ఒకరిద్దరు కాదు, నలుగురు తేలారు.

ఒకవైపు పొలిటికల్ ఇన్‌ఫ్లుయన్స్!

మరోవైపు పైరవీకారుల పాటల తాలూకు తల నొప్పి!!

ఈయనగారి సింగినాదంతో ఈ సెలక్షన్ ఎప్పుడు ముగుస్తుందో? ఏమో? అన్నట్లుగా మహా ఇదైపోతున్న మా కార్యాలయం సిబ్బంది హావ భావాల తాలూకు అశాంతి కొంత!!

అయితే ఇలాంటి వాటన్నింటికీ లొంగే ఘటం మాత్రం కాదు నేను. అందుకే నాకు తరచు బదిలీలు. అయితే తిరిగే కాలు, తిట్టే నోరు ఊరకే ఉండలేవు అన్నట్లుగా అలవాటు పడిపోయినవాణ్ణి నేను.

ఇక్కడ ఒక ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే ఎలిజిబిలిటీ ఉన్న ఆ నలుగురు అభ్యర్థులకు కూడా పైరవీకారులు పాటలో ఉండడం! పైగా ఎవరూ ఐదుకు తగ్గిన వారు కాకపోవడం.

ఒకరోజు ఆ నలుగురు అభ్యర్థుల్లోంచి ఒకతన్ని పిలిపించి ఏకాంతంగా మాట్లాడాను.

"నిజానికయితే ఈ ఉద్యోగంలో నీకు లంచాలు లభ్యం కావు. పోనీ నీకు ఇచ్చే జీతమా? పదిహేను వేలు! ఎంతలా పొదుపు చేసుకుని జీవించినా నీ వసతి, భోజనం వగైరాలకు కనీసం ఐదువేలు ఖర్చయి పోతుంది. ప్రతి నెలా పదివేలు మిగల్చ గలిగితే సంవత్సరానికి లక్షా ఇరవైవేలవుతాయి. ఆ లెక్కన నీవు ఐదారేళ్ళు కష్టపడి పోగుచేస్తే కానీ ఇక్కడ ఇవ్వాలనుకుంటున్న లంచం లక్షలు కాస్తా రికవరీ కావు. ఎందుకింత శ్రమ?" అని ప్రశ్నించాను.



"ఉద్యోగం లభ్యమైతే చాలు ఆ డబ్బంతా ఎలాగో ఒకలా రికవరీ అవుతుంది సార్!" అన్నాడతడు సాలోచనగా.

ఎలా రికవరీ అవుతాయో నాకైతే అర్థం కాలేదు. కానయితే అంతకుమించి ప్రశ్నించే అధికారం నాకే ముంది?

అందువల్ల మరేమీ ప్రశ్నించకుండా అతన్ని పంపేశాను.

***

నేను అతన్ని పిలిపించి వ్యక్తిగతంగా మాట్లాడడం పెద్ద నేరమైపోయింది.

నేనతన్ని సెలక్ట్ చేసేసినట్లు మా ఆఫీసులో, వెలుపలా కూడా ప్రచారం! అతని తాలూకు పైరవీ కారుడు ఏకంగా డబ్బు పట్టుకుని నా ఇంటికే వచ్చి పడ్డాడు. అతన్ని వాపసు పంపడానికి తల ప్రాణం తోకకు రావడమే కాదు, అతన్ని బాగా తిట్టి పంపాల్సి వచ్చింది కూడా.

మరునాడు మరొక అభ్యర్థిని పిలిపించి ఏకాంతంగా ప్రశ్నించాను.

అతనిదీ కాస్త హెచ్చు తగ్గులతో మొదటి అతని జవాబే!

మూడోనాడు మూడో అతన్ని పిలిపించి మాట్లాడాను.

ఆశ్చర్యకరంగా అతని జవాబూ కాస్త అటూ ఇటుగా అదే!

నాలుగో రోజు చివరి అభ్యర్థిని పిలిపించాను.

నా ప్రవృత్తికి భిన్నంగా కాస్త చొరవ తీసుకుని మరీ కొంచెం లోతుగా అతన్ని గుచ్చిగుచ్చి ప్రశ్నించాక ఓ పెద్ద సంగతి తెలిసి వచ్చింది.

**అతడో నిజాయితీపరుడైన ఆఫీసర్. కాంట్రాక్టు బేసిస్‌లో ఒక ఉద్యోగిని నియమించాలనుకున్నాడు. లక్షల్లో లంచం ఇచ్చేందుకు సిద్ధపడ్డారు అభ్యర్థులు. జీతంతప్ప రూపాయి కూడా లంచంవచ్చే ఉద్యోగం కాదది. మరి లక్షల్లో లంచం ఇచ్చేందుకు ఎందుకు ఎగబడుతున్నారో ఆ అధికారికి అర్థంకాలేదు. మరి అతనికి సమాధానం దొరికిందా? ఎంపిక చేసిన అభ్యర్థికి అతడెలాంటి షరతు విధించాడు?**

"ఇందులో పెద్ద రహస్యం అంటూ ఏమీ లేదు సార్! మీరు నాకీ ఉద్యోగం ఇచ్చారనుకోండి, మూడు నెలలు తిరగక మునుపే పది పన్నెండు లక్షల కట్నంతో అమ్మాయినిచ్చి పెళ్ళి చేసే వాళ్ళు నన్ను వెతుక్కుంటూ వస్తారు. ఈ ఉద్యోగానికి పెట్టే పెట్టుబడికి రెండింతలుగా వచ్చి పడుతుంది కదా?" అన్నాడు అతడు నిజాయితీగా.

"వార్నీ!" అనుకుని నివ్వెరపోయాను.

## కత్రినా కలిసొస్తుందా?



*కత్రినా, దీపికాలు బద్ధ విరోధులు అన్న సంగతి తెలిసిందే! వీరిద్దరితోనూ ఓ సినిమా చేయబోతున్నారట! అందులో షారూఖ్ ఖాన్ హీరో! కాంబినేషన్ అదిరినా, ఈ సినిమా దీపికతో చేయడానికి కత్రినా కలిసొస్తుందా? అన్న అనుమానాన్ని బాలీవుడ్‌లో పలువురు వ్యక్తం చేస్తున్నారు. రణబీర్‌తో తన ప్రేమ పెటాకులు కావడానికి దీపికానే కారణం అన్నది కత్రినా ప్రగాఢ విశ్వాసం. సరిగ్గా అప్పటి నుంచే కత్రినా దీపిక పొడ అంటే గిట్టకుండా కస్సుబుస్సు మంటోంది. రెండు కత్తులు ఒక ఒరలో ఇమడవన్న చందంగా ఈ ఇద్దరూ సినిమాకి ప్లస్ అవుతారా? మైనస్ అవుతారా? అన్న సందేహాలు కూడా వ్యక్తం అవుతున్నాయి.*

"సమాజమా... నీవెటు పోతున్నావు?" అంటూ మరోమారు ఆక్రోశించింది నా మనసు.

***

ప్రాసెస్ కమెన్స్ అయింది కాబట్టి ఆ నలుగురిలో ఒకరికి ఉద్యోగం ఇవ్వక తప్పదు.

మళ్ళీ ఒక్కొక్కర్నే పిలిపించాను.

"నీకు ఒక్కపైసా ఖర్చు లేకుండా ఉద్యోగం ఇస్తాను. కట్నం తీసుకోకుండా ఆదర్శంగా వివాహం చేసుకుంటావా?" అని ప్రశ్నించాను మొదటి అతన్ని.

అతడు వెంటనే జవాబు చెప్పలేదు. ఆలోచించుకుని కాస్సేపయ్యాక నెమ్మదిగా జవాబిచ్చాడు.

"సార్, మాది చాలా పేద కుటుంబం. మా అమ్మా, నాయనా నన్ను చాలా కష్టపడి పెంచారు. నా చదువుకు ఉన్న కొద్దిపాటి పొలమూ హారతి కర్పూరం అయిపోయి చిన్న పెంకుటిల్లు తప్ప మరే ఆస్తిపాస్తులూ లేనివాళ్ళం. పెళ్ళి కావాల్సిన అక్కయ్యా, చెల్లీ ఇద్దరున్నారు నాతోపాటు. వాళ్ళను కట్నం లేకుండా ఎవరూ చేసుకోరు. అది మాత్రం ఖాయమైన వాస్తవం!"

నాకు అర్థం అయింది.

అతన్ని పంపేశాను.

***

మరునాడు రెండవ అతన్ని పిలిపించాను.

నా వర్షన్ నేను చెప్పాక....

"కట్నం లేకుండా వివాహం చేసుకుంటానంటే నాకు పెళ్ళయ్యే యోగం ఉండదు సార్, నేనంత రిస్క్ తీసుకోలేను!" అన్నాడతను నిర్మొహమాటంగా.

"పెళ్ళెందుకు కాదు! అయినా ఇందులో రిస్క్ ఏముంది? ఇంకా సమాజంలో నీకు మంచి గుర్తింపూ, సంఘంలో మీ కుటుంబానికి గొప్ప గౌరవమూ లభ్యమవుతాయి కదా?" అన్నాను కాస్త కోపంగా.

"కట్నం అక్కర్లేదంటే నాకు మగతనం లేదనుకుంటారు సార్! ఒక్కరు రిజెక్ట్ చేశారనుకోండి. అదే నిజమని ప్రచారం అయిపోతుంది, మీరంటున్న ఈ సమాజంలో! నేను మెడికల్ ఫిట్‌నెస్ సర్టిఫికెట్ తెచ్చుకున్నా, ఆ తరువాత ఈ సంఘంలో ఎవరూ నమ్మరు. ఆ సర్టిఫికెట్ కూడా నేను డబ్బు ఖర్చు చేసి తెచ్చుకున్నాననే ప్రచారం జరుగుతుంది. తరువాత నా జీవితం సర్వనాశనం అయిపోయే ప్రమాదం తప్పకుండా ఉంటుంది సార్! మీరు చెప్తున్నది సామాన్యమైన పని కాదు, పెద్దంత రిస్క్‌తో కూడుకున్న పని!" అన్నాడతడు.

మన సమాజం, మన సంస్కృతి ఏమైపోబోతున్నాయా? అని ఆలోచించాను రెండు నిముషాల పాటు.

ఒక రకంగా అతనివైపు నుండి అతడు చాలా కరెక్ట్‌గానే ఆలోచిస్తున్నాడనిపించింది.

అతన్ని వెళ్ళి రమ్మన్నాను.

బాగు చెయ్యడానికి వీలుకానంతగా సమాజం పాడైపోతోందేమో అనే అనుమానం నన్ను వీడక పోవడం వల్ల అశాంతితో ఆ రాత్రి చాలా పొద్దుపోయే వరకూ నాకు నిద్ర కరవైపోయింది.

***

మూడవ రోజు వచ్చిన మూడవ అతను నా ప్రపోజల్‌కు ఆనందంగా స్పందించాడు. అతని పేరు కూడా ఆనంద్!!

"సార్ మీరు మరోలా అనుకోకపోతే నాదో రిక్వెస్ట్!" అన్నాడతను తరువాత.

"చెప్పండి!"

"మా తండ్రి జ్వరంతో ఉన్నాడు. మీరు అన్యథా భావించకుండా మా ఇంటికివచ్చి మా తల్లిదండ్రులతో ఈ విషయం ప్రస్తావించగలిగితే, మీరు నాకు

ఉద్యోగం ఇవ్వగానే నాకు నచ్చిన యువతిని కట్నం కానుకల ప్రసక్తి లేకుండా వివాహం చేసుకోవడానికి ప్రయత్నిస్తాను!" అన్నాడు.

అతని స్వరంలో నిజాయితీ ధ్వనించడమే కాదు ఏదో సాంఘిక సేవ చెయ్యబోతున్నానన్న వెలుగు లాంటిదేదో అతని కళ్ళలో కనిపించింది.

"ఒక్క అడుగు ముందుకు వేశానేమో?" అనుకున్నాను మనసులో.

"ఎల్లుండి నేను మీ ఇంటికి వచ్చేదీ లేనిదీ తెలియజేస్తాను!" అన్నాను అతనితో.

అతడు నిష్క్రమించాక మంచి పనేదో చెయ్యగలనన్న భావన నన్నావహించింది కొన్ని నిముషాల పాటు. అయితే నాలుగో వ్యక్తి అభిప్రాయం తెలుసుకున్నాక గానీ ఏ నిర్ణయమూ తీసుకో కూడదని నిశ్చయించుకున్నాను.

మొత్తానికి ఆ రాత్రి నిశ్చింతగా నిద్రపోయాను.

***

నాలుగో రోజు చివరి అతన్ని పిలిపించాను.

నాకు సంపూర్ణమైన విశ్వాసంతో కూడిన స్థిర నిర్ణయం మాత్రం కనిపించకుండాపోయింది.

పైగా కేవలం ఉద్యోగం కోసమే అతడా నిర్ణయానికి తలవొగ్గుతున్నట్లుగా కూడా అతని అంతర్గత ముఖచిత్రం అతని ముఖంలో నాకు ప్రస్ఫుటించినట్లనిపించింది.

అతన్ని పంపేశాక చాలా ఆలోచించి చివరికి ఒక నిర్ణయానికి వచ్చేశాను.

ఆ రోజే ఆనంద్ వాళ్ళ ఇంటికి వెళ్ళి అతని తల్లిదండ్రులను సంప్రదించాను. తను పిల్లవాడికి ఉద్యోగం ఇస్తే చాలు కట్నం తీసుకోకుండా పెళ్ళి చెయ్యడానికి వాళ్ళు కూడా ఆనందంగానే అంగీకరించారు.

ఆ మరునాడే ఆనంద్‌ను సెలక్ట్ చేసేసి ప్రొసీడింగ్స్ కూడా ఇచ్చేశాను.

అతడూ ఆలస్యం చెయ్యకుండా అదే రోజు ఉద్యోగంలో చేరిపోయాడు.

***

ఆనంద్‌కు ఉద్యోగం అయితే ఇచ్చేశాను కానీ




ఆశ్చర్యకరంగా అతనికి నా ప్రపోజల్ వినిపించకముందే అతని నుండి ఆన్సర్ దానంతటదే వచ్చేసింది.

"సార్, మీరు నాకే ఉద్యోగం ఇస్తే నేను కానీ కట్నం తీసుకోకుండా మీరు చూపించే అమ్మాయిని ఖచ్చితంగా పెళ్ళి చేసుకుంటాను".

అతనలా అనగానే నేను అవాక్కైపోయాను. తేరుకోవడానికి కొన్ని నిముషాలు పట్టింది.

గడచిన మూడు రోజులలో నేను వరుసగా పెట్టుకు వచ్చిన ప్రపోజల్ కాస్తా బయటకు పొక్కేసిందన్నమాట. ముగ్గురిలో ఎవరో ఒకరు తమ బ్రోకర్ మహాశయునికో, మరెవరైనా ఆత్మీయులకో విషయం చెప్పేసి ఉండాలి.

అది కాస్తా అలా, ఇలా విస్తరించి వ్యాప్తి చెంది ఉంటుంది. అంతేకాక ఉద్యోగం ఇచ్చిన వ్యక్తిని నా తాలూకు అమ్మాయికి ఎవరికో కట్టబెట్టే ప్రయత్నాల్లో ఉన్నాననే అపోహ కూడా ఆపాటికే రేకెత్తి ఉండవచ్చు బహుశా!

"ఓరి దేవుడా!" అనుకున్నాను.

అయితే మనుషుల్ని చదవగలిగిన గుణం కొద్దో గొప్పో ఆ దేవుడు నాకు ఇచ్చినందువల్ల అతని కళ్లలో అతను మాటమీద నిలబడి కట్నం తీసుకోకుండా వివాహం చేసుకుంటాడనే నమ్మకం మాత్రం పెట్టుకోలేదు నేను. అతన్ని ఉద్యోగంలో నియమించడం నా బాధ్యత, నా డ్యూటీ. అంతవరకూ నేను సక్రమంగా నిర్వర్తించాను. అంతే!!

నిజానికయితే ఆనంద్ వివాహం వారి కుటుంబానికి సంబంధించిన విషయం. అతని వ్యక్తిగత జీవితాన్ని శాసించే హక్కు నాకు లేదు.

నా వంతు ప్రయత్నంగా ఓ మంచి మొక్క నాటి కాసిన్ని నీళ్ళు పోశాను. అంతే! సకాలంలో వరుసగా వర్షాలు పడి, ఆటుపోట్లు తట్టుకుని ఆ మొక్క ఎదిగి మానయితేతప్ప ఆ చర్య తాలూకు ఫలితాలు లభ్యం కావన్నది నా భావన.

గుడ్ సిటిజన్‌గా నా కర్తవ్యం నేను నిర్వర్తించాను అంతే!

అయితే ఆర్నెల్ల తరువాత ఆనంద్ తల్లిదండ్రులు తమ మాట మీద నిలబడి కట్నం తీసుకోకుండానే ఆనంద్ వివాహం జరిపించారు.

అయితే నేను ఆశించినట్లుగా వివాహం సాదాసీదాగా జరగలేదు. ఆడపెళ్ళివారు చాలా ఆర్భాటంగా, అట్టహాసంగా వివాహం జరిపించారు. పెళ్ళి తాలూకు హంగామాలన్నీ చూస్తూ "ఇంత అవసరమా?" అని పదే పదే అనుకున్నాం నేనూ, నా శ్రీమతి. కట్నం ఇచ్చినా అంత అయ్యేది కాదేమో? అనిపించింది. పెళ్ళి తరువాత విందు తాలూకు ఏర్పాట్లు మరింత ఘనంగా ఉన్నాయి. డైనింగ్ హాల్ డెకరేషన్‌కు కూడా ఖర్చు లక్షల్లోనే చేసినట్లున్నారు.

ఎన్నిరకాల తీపి పదార్థాలూ, ఇతర వంటకాలూ వడ్డిస్తున్నారో లెక్కగట్టి చెప్పడం కష్టమైంది. అసలన్ని ఐటమ్స్ ఎవరూ, ఎప్పుడూ, ఎక్కడా తినలేరు. బఫేలో వెళ్ళి తిన్నవారి సంగతేమో కానీ, డైనింగ్ టేబుల్స్ ముందు కూర్చున్న వారైతే వడ్డించిన వాటిల్లో అనేక రకాల ఆహార పదార్థాలు తినకుండా వదిలేసి లేచి వెళ్ళడం గమనించి నేనూ, నా భార్యా చాలా బాధపడ్డాం. ఈ దేశంలో సామాన్య ప్రజలు చేసే అట్టహాసాలు, ఆర్భాటాలు కూడా ఒక్కోసారి వారి వారి ఆర్థిక ఇబ్బందులకు సామాజిక సమస్యలకు కూడా కారణాలవుతుంటాయన్నది వాస్తవం.

***

ఏడాదిన్నర కాలం గడిచింది.

ముక్కలైన రాష్ట్రంలో, చెక్కయిపోయిన భాగంలో మరో మూలకు విసిరివేయబడ్డాను.

నాకిది కొత్త కాదు కదా?

సణుక్కుంటూ నా శ్రీమతి ప్రయాణం ఏర్పాట్లలో ప్యాకింగ్ మొదలు పెట్టేస్తుంటే నేను నా పిల్లల చేత ట్రాన్స్‌ఫర్ సర్టిఫికెట్ల కోసం కాలేజీలకు అప్లికేషన్లు రాయిస్తున్నాను.

అప్పుడు అందింది ఆ వార్త....

ఆనంద్ భార్య అనుమానాస్పద స్థితిలో మృతి చెందిందని.

ఆ తరువాత మేం అక్కడున్న కొద్దిరోజుల్లోనూ కొన్ని వార్తలు మాకు తెలుస్తూనే ఉన్నాయి.

ఆలస్యంగా అయినా ఆ అమ్మాయి కొత్తగా కట్నం డబ్బుల కోసం చాలా వేధింపులకు గురైందనీ, ఆమె తల్లిదండ్రులు కూడా చాలావరకు కట్నం చెల్లించారనీ... ఇలా రకరకాలుగా!

మా ఇంటి సామాను లారీలోనూ, నేనూ, నా భార్యాపిల్లలు రైల్లోనూ బయల్దేరిన నాటి సాయం కాలంపూట, స్టేషనుకు సెండాఫ్‌కు వచ్చిన కొద్ది మంది సిబ్బంది ద్వారా నాకు బాధాకరమైన విషయమే తెలిసింది. అది నా అనుమానం నివృత్తి చేసింది.

నా ప్లేస్‌లో వచ్చిన ఆఫీసర్ అనుమతితో ఆనంద్‌ను అరెస్ట్ చేశారనీ, అతనితోపాటు అతని తల్లిదండ్రులూ, చెల్లీ కూడా ఆ రోజే అరెస్టయ్యారన్నది ఆ విషయ సారాంశం.

ఆ మరునాటి ఉదయం, మేమింకా రైలు ప్రయాణంలో ఉండగానే పేపర్లో నాకు కనిపించిన వార్త ఏమిటంటే, ఆనందే అతని భార్య గొంతు నులిమి చంపాడనీ, ఆమెను ఉరికి వేలాడదీసి ఆత్మహత్యగా చిత్రీకరించాడని అతని కుటుంబీకులు కూడా తమ సహకారం అందించారనీ...!

***

"ఈ సమాజం ఎలా మారుతుందా?" అన్నదే ఇప్పుడు నిరంతరం నన్ను వేధిస్తున్న ప్రశ్న.

**సెల్: 93472 98942**

# ఆరోగ్యానికి నడకే మందు



**సూర్య భగవానుని లేలేత కిరణాలు నేలను, నీటిని తాకకముందే నిద్రలేచి, పక్షుల కిలకిల రావాలు వింటూ, నడక సాగిస్తూ పోతే... సూర్యోదయ సమయాన లేత కిరణాలు మీ పైపైకి వచ్చి మిమ్మల్ని తాకితే... మనసే కాదు శరీరం కూడా సేదదీరుతుంది. దాంతోపాటు మీకు డి-విటమిన్ లభించినట్టే! పనిలో పనిగా బరువు తగ్గించుకోవడం, ప్రకృతిలో మమేకమవడం ద్వారా ఒత్తిడి, ఆందోళనల నుంచి ఉపశమనం కలగడం... అన్నీ జరిగిపోతాయి. సమస్యల ఆలోచనలతో సతమత మయ్యేవారికి కూడా ఇలా మార్నింగ్ వాక్ కి వచ్చినందువల్ల ఒక్కోసారి తమ సమస్యలకు ప్రకృతి నుంచే సమాధానాలు లభిస్తాయి. అంతేకాదు కాసేపు ఆలోచనలనుంచి రిలీఫ్ పొందవచ్చు. ప్రశాంత చిత్తంతో ఆ రోజంతా సంతోషంగా గడిచిపోతుంది.**

లేట్ నైట్ నిద్రపోవటాలు, లేట్ మార్నింగ్ నిద్ర లేవటాలు, మారిన అలవాట్లు.. అన్నీ కలిసి సహజం గానే మనిషి ఆరోగ్యంపై తీవ్రమైన ప్రభావాన్ని చూపుతున్నాయి. ఊబకాయం, డయాబెటిస్, ఒత్తిడి, ఇతర మానసిక సమస్యలు సర్వసాధారణమ య్యాయి. తరచుగా వైద్యులను సంప్రదించటం ఎక్కువయింది. అయితే అందరికీ అన్ని వయసుల వారికీ వారిచ్చే మొట్టమొదటి సలహా మాత్రం ఒకటే... 'వాకింగ్ చేయండి' అని.

### ప్రయోజనాలు

వాకింగ్ చేయడం వల్ల ఎన్నో ప్రయోజనాలు ఉన్నాయి. అవేంటో కూడా అందరికీ తెలిసిన విష యాలే. వాకింగ్ వల్ల అధిక బరువు తగ్గుతారని, డయాబెటిస్, గుండె సమస్యలు రాకుండా ఉంటా యని, క్యాలరీలు ఖర్చవుతాయని, శరీర కండరాలు



దృఢంగా మారుతాయని.... ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో ఎన్నెన్నో.

ప్రస్తుతమున్న బిజీ లైఫ్‌లో ఆరోగ్య జాగ్రత్తలు తీసుకునేవారి సంఖ్య పెరుగుతూనే ఉంది. చిన్నా పెద్దా తేడా లేకుండా పార్కుల్లో, రోడ్లమీద వాకింగ్ చేసేవారి సంఖ్య పెరుగుతోంది. అయితే ఎలా పడితే అలా వాకింగ్ చేయడం మంచిది కాదంటు న్నారు వైద్యులు. వాకింగ్‌లో రకాలు ఉన్నాయని, తమ ఆరోగ్యపరిస్థితులను బట్టి, టైంని బట్టి వాకింగ్ పద్ధతిని ఎంచుకోవాలని సూచిస్తున్నారు. ఆ వాకింగ్ రకాలేంటో చూద్దామా!



### బ్రిస్క్ వాకింగ్

సాధారణంగా మనం చేసే వాకింగ్‌నే కొంచెం ఫాస్ట్‌గా చేయాలి. అంటే పరుగులాంటి నడక అన్నమాట. అందుకే దానికి బ్రిస్క్ వాక్ అని పేరు వచ్చింది. ఇలా బ్రిస్క్ వాక్ చేయడం రన్నింగ్ చేసినంతటి ఫలితాన్ని ఇస్తుంది. క్యాలరీలు మరిన్ని ఎక్కువగా ఖర్చవుతాయి. బరువు తగ్గాలనుకునే వారు దీన్ని చేయడం మంచిది. దీంతో కండ రాలు, ఎముకలు దృఢంగా మారతాయి. డయా బెటిస్ రిస్క్ తగ్గుతుంది.

### పవర్ స్ట్రైడింగ్

బ్రిస్క్ వాక్‌లో చేతులను బాగా ఊపుతూ మరింత ఎక్కువ వేగంతో చేసే వాక్‌నే పవర్ స్ట్రైడింగ్ అంటారు. దీనివల్ల కొవ్వు త్వరగా కరుగు తుంది. మెటబాలిజం వేగం పుంజుకుంటుంది. ఫలితంగా క్యాలరీలు వేగంగా ఖర్చవుతాయి. బరువు త్వరగా తగ్గుతారు. శక్తి సామర్థ్యాలు పెరుగుతాయి.

### స్టెయిర్‌వెల్ వాక్

మెట్లపై ఎక్కడం, దిగడాన్ని స్టెయిర్‌వెల్ వాక్ అంటారు. దీని వల్ల గంటకు 200కు పైగానే క్యాలరీ లను ఖర్చు చేయవచ్చు. కండరాలు బాగా దృఢంగా మారతాయి. అయితే ఒకేసారి గంటసేపు చేయకుండా మధ్య మధ్యలో కొంత గ్యాప్ ఇచ్చి చేస్తే దీనివల్ల మరింత సమర్థ ఫలితాలు పొందవచ్చు.

### అప్‌హిల్ క్లైంబ్

ఎత్తయిన ప్రాంతాలకు వాకింగ్ చేయడాన్నే అప్‌హిల్ క్లైంబ్ అంటారు. దీని వల్ల తొడ కండ రాలు, పిక్కలు దృఢంగా మారతాయి. హామ్‌స్ట్రింగ్ గాయాలకు ఉపశమనం కలుగుతుంది. అయితే క్లైంబ్ వాక్ చేయదలచినవారు మాత్రం ఎటువంటి ఆరోగ్య సమస్యలు లేనివారై ఉండాలి. ఊబ కాయం తగ్గించుకోవడం కోసం ఈవిధంగా ప్రయత్నించవచ్చు. వయసును దృష్టిలో పెట్టుకో వాలి.

### ట్రెడ్‌మిల్ వాకింగ్

బయట వాకింగ్ చేయడానికి వీలు కాని వారు ట్రెడ్‌మిల్ వాకింగ్ చేయవచ్చు. ట్రెడ్ మిల్ మిషన్‌పై చేస్తారు కనుక దీనికి ట్రెడ్‌మిల్ వాకింగ్ అని పేరు వచ్చింది. దానిపై పలు సెట్టింగ్స్‌ను బట్టి బ్రిస్క్ వాక్ కూడా ప్రయత్నించవచ్చు. దీనివల్ల కూడా పైన చెప్పిన ఫలితాలే కలుగుతాయి. సమయం ఆదా చేసుకోవచ్చు. ఆరోగ్యాన్ని మీ సొంతం చేసుకోవచ్చు.

### పూల్ వాకింగ్

సముద్రపు ఒడ్డున నీళ్లలో వాకింగ్ చేయడాన్ని పూల్ వాకింగ్ అంటారు. దీని వల్ల ఒత్తిడి, ఆందో ళన వంటి సమస్యలు తగ్గుతాయి. ఆర్థరైటిస్, వెన్ను నొప్పి, ఆస్టియోపోరోసిస్ వంటి సమస్యలు ఉన్న వారికి పూల్ వాకింగ్ చాలామంచిది. ఇసుకలో నడ వడం వల్ల అరిపాదాలపై కలిగే ఒత్తిడి.. మానసిక ఆందోళనను తగ్గిస్తుంది. సమస్యల్లో కొట్టుమిట్టాడు తున్నామనుకునేవారు, డిప్రెషన్‌లో ఉన్నామనుకునే వారు ఈ రకమైన వాకింగ్‌ను ప్రయత్నించవచ్చు.

—లక్ష్మీ నర్మద




# ముఖ్యమంత్రి బంధువుల కిడ్నాప్

**‘అర్జంటుగా బయల్దేరి రా’ ఇన్‌స్పెక్టర్ ఇంద్రజిత్ ఫోన్ విని వెంటనే బయలుదేరాడు డిటెక్టివ్ శరత్.**

**శరత్ వెళ్ళేసరికి అంతా హడావిడిగా ఉంది. పెద్దపెద్ద ఆఫీసర్లున్నారు. శరత్ లోపలికి వెళ్ళగానే సమావేశం ఆరంభమయింది. ‘ఇది అత్యవసర సమయం. మోస్ట్ అర్జంట్, హై సీక్రెట్’ అని అధికారి శరత్‌వైపు తిరిగాడు. ‘మన ముఖ్యమంత్రి కుటుంబం ప్రయాణం చేస్తున్న బస్సును హైజాక్ చేశారు. ఎవరు చేశారో, ఎందుకు చేశారో తెలియదు. వాళ్లదగ్గర నుంచి పది నిమిషాల క్రితం ఫోన్ వచ్చింది. డిమాండ్లు చెప్తాం, ఎదురు చూడండని. అయితే ఒక కండిషన్ కూడా చెప్పారు’ అని ఆగాడు అధికారి.**

అందరూ ఆసక్తిగా చూశారు.

‘ఈ విషయంలో శరత్‌ను ఇన్వాల్వ్ చెయ్యొద్దని బెదిరించాడు. అందుకే ఈ రహస్య సమావేశం’ అన్నాడు.

అందరూ శరత్‌వైపు చూశారు.

శరత్ ముఖం నిర్భావంగా ఉంది.

‘హైజాకర్ల డిమాండ్లు నెరవేర్చడానికి ముఖ్యమంత్రి సిద్ధంగా ఉన్నారు. ఎందుకంటే, బస్సులో ముఖ్యమంత్రి కూతురు, అల్లుడు, కొడుకు, కోడలు, మనవలు మాత్రమే కాదు బంధువులంతా ఉన్నారు’.

‘నాకు వివరాలు కావాలి’ అడిగాడు శరత్.

‘ఇంద్రజిత్ చెప్తాడు. కానీ పరిశోధన గోప్యంగా జరగాలి. ఎవరి ప్రాణాలకు ముప్పు వాటిల్లకూడదు’ హెచ్చరించాడు అధికారి.

తల ఊపాడు శరత్ ఆలోచిస్తూ.

*’**

‘ఇంతపెద్ద నెట్‌వర్క్ ఉండి మేం సాధించలేనిది, నువ్వు సాధించగలిగేదేమిటి? ఆ కిడ్నాపరో హైజాకరో నిన్ను ఇన్వాల్వ్ చెయ్యొద్దని నియమం విధించటం అనుమానం రేకెత్తిస్తోంది. నీ పాపులారిటీ పెంచుకోడానికే ఇదంతా చేస్తున్నట్టున్నావు’ ఫైలు శరత్‌వైపు విసిరేసి అన్నాడు ఇంద్రజిత్. శరత్ మాట్లాడకుండా, ఫైలు తెరచి చదవటం మొదలు పెట్టాడు.

‘ముఖ్యమంత్రి అన్నయ్య కొడుకు పెళ్ళి జరిగింది. పెళ్ళయ్యాక మొత్తం కుటుంబం బస్సులో బయలుదేరింది. బస్సు ఘట్‌కేసర్ రోడ్డు దగ్గర ఓఆర్ఆర్ (ఔటర్ రింగ్ రోడ్డు) దిగి చర్లపల్లి రోడ్డులోకి వెళ్ళింది. కిట్టీ స్టీల్ ఫ్యాక్టరీ వరకూ బస్సు కదలికలు తెలిశాయి. ఆ తరువాత బస్సు ఏమయిందో తెలియటం లేదు. బస్సు ఉదయం ఆరు గంటలకు ఫ్యాక్టరీ దగ్గరకు చేరింది. ఆ సమయంలో ట్రాఫిక్ ఉండదు. కాబట్టి ఎవరూ ఏమీ చెప్పలేకపోతున్నారు. అందరూ కంగారు పడుతుంటే ఉదయం ఎనిమిదిన్నరకు ఫోను వచ్చింది.

టైమ్ చూశాడు శరత్. తొమ్మిదయింది.

‘బస్సులో ఒక్కరి దగ్గరకూడా సెల్‌ఫోన్ లేదా?’ ఆలోచిస్తూ పైకే అన్నాడు శరత్.

వ్యంగ్యంగా నవ్వాడు ఇంద్రజిత్. ‘కిడ్నాపర్లు ప్రయాణికుల నుండి ముందుగా స్వాధీనం చేసుకునేది వాటినే. ఏ ఒక్కరి సెల్‌ఫోనూ పని చేయటం లేదు’.

అసిస్టెంట్ రాముకి ఫోన్ చేశాడు శరత్. ‘రామూ, చర్లపల్లి పరిసర ప్రాంతాల్లో ఎవరూ ఉపయోగించని ఫార్మ్‌హౌజ్‌ల ఆరా తెలుసుకో’ చెప్పాడు.

‘ఆ పరిసరాల్లోని ఫార్మ్‌హౌజ్‌ల జాబితా యిది. మా వాళ్ళు అవన్నీ తనిఖీ చేశారు’ అంటూ మరో ఫైలు శరత్‌వైపు విసిరాడు ఇంద్రజిత్.

ఇంతలో ఫోను మోగింది. ‘హైజాకర్లు ఫోన్ చేస్తున్నారు’ చెప్పారు. పక్కనున్న ఫోన్ ‘ఆన్’ చేశాడు ఇంద్రజిత్.

‘మాకు ఇరవైకోట్ల రూపాయలు కావాలి. గంటే టైమ్. ఎలా అందచేయాలో తరువాత చెప్తాం. డిటెక్టివ్ శరత్‌కి నమస్కారాలు చెప్పండి. అతన్ని పిలిచినందుకు ఇంకో ఇరవైకోట్లు ఫైన్! మొత్తం నలభై కోట్లు ఇవ్వాలి. గంటే సమయం’ ఫోన్ కట్ అయింది.

అందరి ముఖాల్లో ఆందోళన. ‘నీ వల్ల ఇరవై కోట్లు పెరిగింది. నీకంత విలువ ఉందని నిరూపించుకో. హైజాకర్లని పట్టుకో. వారి బందీలుగా ఉన్నవాళ్ళందర్నీ ప్రాణాలతో తీసుకురా’ కోపంగా అరిచాడు ఇంద్రజిత్.

*’**

‘ఇదిగో బాస్, ఆ బస్‌కి సెక్యూరిటీగా ఉన్నవారి పేర్ల జాబితా, వాళ్ళ బ్యాంకు లావాదేవీలు, ఫోను వివరాలు’ అందించాడు రాము.

‘బస్సులో ఉన్న బంధువుల వివరాలు?’

‘ఇదిగో బాస్..’

శరత్ వాటిని కాసేపు పరిశీలించి నిట్టూర్చాడు. ‘ఫార్మ్‌హౌజ్‌ల వివరాలు ఏవి?’

‘బాస్, అమ్మకాలకు సిద్ధంగావున్న ఫార్మ్‌హౌజ్‌ల జాబితా ఇది. ఇదేమో వాటి నిర్వాహకుల జాబితా’ శరత్‌కి వాటిని అందజేశాడు రాము.

శరత్ వాటిని పరిశీలిస్తుంటే, ముందు గదిలోంచి ఇంద్రజిత్ అరుపులు వినిపించాయి. ఇక్కడ టెన్షన్‌తో ఛస్తుంటే పనికిరాని విషయాల గురించి ఫోన్లుచేసి విసిగించకండి’ అరుస్తున్నాడు. ఫోన్ పెట్టేసి శరత్ గదిలోకి వచ్చాడు ఇంద్రజిత్.

‘హైజాకర్లు డబ్బులు ఎలా అందించాలో చెప్పారు’ అన్నాడు.

‘ఎలా?’ అడిగాడు శరత్.

‘రామూ... నువ్వు బయటకు వెళ్ళు’ ఆజ్ఞాపించాడు ఇంద్రజిత్. రాము బయటకు వెళ్ళగానే అతని వెనకాలే ఇంద్రజిత్‌కూడా వెళ్ళి శరత్ ఉన్న గది తలుపు తాళంవేసి ఆ తాళం చెవి తన జేబులో వేసుకున్నాడు.

‘అదేంటి?’ అని కంగారుగా అడిగాడు రాము.

‘మీ డిటెక్టివ్ మీద నాకు అనుమానం ఉంది. ఇందాక ఎవరో ఫోనుచేసి శరత్ కావాలన్నారు. ఏమిటో చెప్పమంటే ఆయనకే చెప్తాం అంటారు. కిడ్నాపర్లు శరత్‌ని బంధించమని కోరారు. ఇవన్నీ చూస్తుంటే అంతా మీ శరత్ ఆడిస్తున్న డ్రామాలా అనిపిస్తోంది. మేం పోతున్నాం. డబ్బులిచ్చేసి బందీల్ని విడిపించటానికి’ అంటూ గబగబా వెళ్ళిపోయాడు ఇంద్రజిత్.

ఇంద్రజిత్ అలా వెళ్ళగానే లోపల్నించి రాముని పిలిచాడు శరత్. తలుపు దగ్గరకు వెళ్ళాడు రాము.

‘రామూ, ఆ ఫోనులో కాలర్ ఐడీ ఉందేమో చూడు. ఉంటే, ఇందాక ఫోన్ చేసిందెవరో తెలుసుకో. నాకు ఏం చెప్పాలనుకుంటున్నారో తెలుసుకో. నీకు చెప్పనంటే నా సెల్‌ఫోన్ నంబరివ్వు’ గబగబా చెప్పాడు శరత్.

రాము వెళ్లి ఫోన్లో కాలర్ ఐడీ చూసి డయల్ నొక్కాడు. ఎవరో ముసలామె గొంతు. తనని తాను పరిచయం చేసుకున్నాడు రాము. ‘మీరు శరత్‌కి ఏం చెప్పాలనుకుంటున్నారో నాకు చెప్పండి’ అడిగాడు.

**ముఖ్యమంత్రి బంధువులు కిడ్నాప్‌కు గురయ్యారు. దాంతో పోలీసు ఉన్నతాధికారుల రహస్య సమావేశం జరిగింది. డిటెక్టివ్ శరత్‌ను కూడా ఆ మీటింగ్‌కి పిలిచారు. ఎందుకంటే, ఈ విషయం అసలు శరత్‌కి తెలియకూడదని షరతు విధించారు కిడ్నాపర్లు! దాంతో ఫోకస్ అతనిమీదే పడింది. ఇన్‌స్పెక్టర్ ఇంద్రజిత్ మాత్రం ఇదంతా శరత్ ఆడిస్తున్న నాటకం అని ఆరోపించాడు. నిజమేనా?**



'నేను శరత్‌కే చెప్తాను. ఇంకెవ్వరికీ చెప్పను' అరిచిందామె.

శరత్ సెల్ నంబరిచ్చాడు రాము. క్షణాలలో శరత్ ఫోన్ మోగింది.

'మా ఇంటి దగ్గర ఏదో బస్సుంది. దాన్లో శవాలున్నాయి. నేను నిజం చెప్తున్నాను' నా మాట ఎవరూ నమ్మటం లేదు'.

ఫోను పెట్టి రామును పిలిచాడు శరత్. 'రామూ... నీ అసిస్టెంట్లను తీసుకుని ఈ అడ్రస్‌కి వెళ్ళు, ఆమె చెప్పేది నిజమైతే వెంటనే ఫోను చెయ్యి' చెప్పాడు శరత్, గదిలో అటూ ఇటూ పచార్లు చేస్తూ.

***

'శరత్ ఏడీ?' అడిగింది ముసలామె కోపంగా.

'శరత్ వేరే పనిలో ఉన్నాడు. నేను అతడి అసిస్టెంట్‌ను. మీరు బస్సు ఎక్కడ చూశారో చెప్పండి' అడిగాడు రాము.

'మా ఇంటి వెనుక ఓ పెద్ద ఫార్మ్‌హౌజ్ ఉంది. కానీ కొన్ని నెలలుగా ఎవరూ రావటం లేదు. పాడుపడి ఉంది. నేను దొంగతనంగా వెళ్ళి అక్కడ పండిన కూరగాయలు కోసుకొస్తాను. ఇవాళ కూడా అలాగే వెళ్ళాను. అరటిచెట్ల నడుమ బస్సు కనిపించింది. చూస్తే శవాలున్నాయి. పోలీసులకు ఫోన్ చేస్తే నమ్మటం లేదు. అందుకే శరత్‌కి ఫోన్ చేశాను' ఆమె మాటలు పూర్తికాక ముందే, రాము అతని అసిస్టెంట్లు ఆ వైపు పరుగెత్తారు.

చెట్ల నడుమ కనబడకుండా పెట్టి ఉంచారు బస్సు. లోపల శవాలున్నాయి. చూడగానే అవన్నీ సెక్యూరిటీ వాళ్ళవే అని తెలుస్తోంది. శరత్‌కి ఫోన్ చేశాడు రాము.

'మీ తుపాకులు దగ్గరున్నాయా' అడిగాడు శరత్.

'ఉన్నాయి' చెప్పాడు రాము.

'జాగ్రత్తగా ఫార్మ్‌హౌజ్ దగ్గరకు వెళ్ళండి. బయట కాపలా గట్టిగా ఉందంటే, ముఖ్యమంత్రి బంధువులంతా ఆ ఫార్మ్‌హౌజ్‌లో ఉన్నట్టే. ఇంద్రజిత్‌కు ఫోన్ చెయ్యి. డబ్బులు తీసుకెళ్ళాల్సిన అవసరం లేదని చెప్పు' రాముకి వివరించాడు శరత్.

ఫోన్ పెట్టి తన అసిస్టెంట్ల వైపు చూశాడు రాము.

'కమాన్ ఫ్రెండ్స్. యాక్షన్ టైమ్' అన్నాడు.

వాళ్ళు తుపాకులు తీసి నిశ్శబ్దంగా నాలుగు వైపులా నడిచారు. ఫార్మ్‌హౌజ్ దగ్గర పడుతుండగానే తుపాకులు పట్టుకున్న కాపలామనుషులు కనిపించారు. శరత్‌కి ఫోన్ చేశాడు రాము.

ఇంద్రజిత్ ఫోన్ ఎత్తి 'డోన్ట్ డిస్టర్బ్ మి' అని ఫోన్ పెట్టేశాడు.

అదే విషయం శరత్‌కి చెప్పాడు రాము.

శరత్ ఫోన్ చేసినప్పుడు కూడా ఫోన్ కట్ చేశాడు ఇంద్రజిత్.

'రామూ... లోపలున్న వాళ్లని రక్షించగలమన్న విశ్వాసం నీకుందా?' అడిగాడు శరత్.

'యెస్ బాస్'

'జాగ్రత్త. ప్రాణనష్టం జరగకూడదు. నువ్వు వాళ్లని రక్షించగానే నాకు చెప్పు' అన్నాడు శరత్.

ఫోను పెట్టేసి సహచరులకు సౌంజ్ఞ చేశాడు రాము. వాళ్ళు నిశ్శబ్దంగా ముందుకు నడిచారు.

***

ఎన్నిమార్లు ఫోన్ చేసినా ఇంద్రజిత్ ఫోన్ 'కట్' చేస్తున్నాడు. పైఅధికారికి ఫోన్ కలిపాడు శరత్.

'డబ్బులు ఇచ్చేశారా?' అడిగాడు ఆయన ఫోను ఎత్తగానే.

'దాదాపు వాళ్లు చెప్పిన స్థలానికి చేరుకుంటున్నాం'.

'డబ్బులివ్వటం ఆలస్యం చేయండి. ముఖ్యమంత్రి బంధువుల్ని ఎక్కడ దాచిపెట్టారో తెలిసింది. రాము, అతడి బృందం విడిపించే ప్రయత్నాల్లో ఉంది' చెప్పాడు శరత్.

***

'ఇదంతా శరత్ ఆడుతున్న నాటకం' అధికారి ఆజ్ఞ విని పళ్లు పటపట కొరికాడు ఇంద్రజిత్.

'శరత్ చెప్పాడు, కాస్త ఆలస్యం చేయమని. నాకు శరత్ మీద నమ్మకం ఉంది' నిశ్చయంగా చెప్పాడు అధికారి.

***

ఫార్మ్‌హౌజ్‌ను చుట్టుముట్టారు రాము అనుచరులు.

దాదాపుగా పదిమంది పైగా ఉన్నారు కాపలా వాళ్ళు. అందరిచేతుల్లో ఆధునిక మారణాయుధాలున్నాయి.

'సైలెన్సర్లున్న వారే కాల్చండి. లోపల ఇంకెంత మంది ఉన్నారో తెలియదు. శబ్దాలయితే వాళ్లు లోపలున్న అమాయకులకు హాని తలపెట్టవచ్చు' అందరికీ మెసేజ్ పంపాడు రాము.

అందరూ రాము ఆజ్ఞ కోసం ఎదురు చూడసాగారు.

అధిక సంఖ్యలో కాపలా వాళ్ళు తమ రేంజిలోకి వచ్చేవరకు ఆగాడు రాము. వాళ్ళు రేంజిలోకి రాగానే 'ఫైర్' అని సూచన ఇచ్చాడు. ఓ వైపు కాపలా వాళ్ళు నిశ్శబ్దంగా నేలకొరిగిపోతుండగా, రాము, ఇంకో నలుగురు వేగంగా లోపలకు పరుగెత్తారు. తలుపులు తోసి లోపలకు దూకుతూనే 'హ్యాండ్సప్. ఎవ్వరూ కదలవద్దు' అని అరిచాడు రాము తుపాకీ గురిపెట్టి.

***

'మనం డబ్బులివ్వటం తాత్సారం చేయటంతో కిడ్నాపర్లకు అనుమానం వచ్చింది. దొరక్కుండా పారిపోయారు. కిడ్నాపర్లు ఎవరో, ఏమిటో తెలుసుకునే ప్రయత్నాలు జరుగుతున్నాయి. పట్టుబడ్డ కాపలా వాళ్లకు ఏమీ తెలిసినట్టు లేదు. వీళ్లకు డబ్బులిచ్చి కాపలా నిలబెట్టారు. అసలు ఈ కిడ్నాప్ వెనుక 'మాస్టర్‌మైండ్' ఎవరో తెలియటం లేదు. ఎనీవే, థాంక్స్ శరత్ అండ్ రాము' అన్నాడు అధికారి.

ఆయన అటు వెళ్ళగానే రాముని ఆపాడు ఇంద్రజిత్. 'చట్టాన్ని చేతుల్లోకి తీసుకుని కాపలా వాళ్ళను హత్య చేసినందుకు నిన్ను అరెస్టు చేస్తాను' అన్నాడు.

రాము నవ్వాడు. 'మేము ఎవ్వరినీ చంపలేదు. మావి ట్రాంక్విలైజర్ బుల్లెట్లు. వాళ్ళు కాస్సేపటికి నిద్రలేస్తారు!' అన్నాడు.

ఇంద్రజిత్ ముఖం ఎర్రబడింది. శరత్‌వైపు తిరిగాడు. 'ఇదంతా నువ్వు ఆడించిన నాటకమే. లేకపోతే ట్రాంక్విలైజర్ బుల్లెట్లతో అసలు బుల్లెట్లను ఎదుర్కొని ఎలా క్షేమంగా బైటపడగలరు.' అన్నాడు.

'అది ఆత్మవిశ్వాసం. ఎవరో ముసలమ్మ ఎంత నమ్మదగని కథ చెప్పినా దాన్ని నమ్మి పరిశోధించటం వల్ల కలిగే ఆత్మవిశ్వాసం' అన్నాడు శరత్, రాముతో బయటకు నడుస్తూ.

'ఆ దొరకని మాస్టర్ మైండ్ నువ్వే. నీ నాటకం బయటపెట్టి నిన్ను అరెస్టు చేస్తా' అరిచాడు ఇంద్రజిత్ కోపంగా.

**–కస్తూరి మురళీకృష్ణ**
*సెల్: 98496 17392*

**చుట్టూ ఖాళీస్థలమంటూ లేకుండా హాస్పిటల్ కట్టిన యాజమాన్యం ఐసోలేషన్ వార్డు మాత్రం విడిగా వెనకభాగంలో కట్టించింది. దానిచుట్టూ కొద్ది ఖాళీస్థలం మాత్రం ఉంది. అందులో అశోక చెట్లు దూరదూరంగా నాటి ఉన్నాయి.**

**ఐసోలేషన్ వార్డుని మెయిన్ హాస్పిటల్‌కి కలుపుతూ సన్నటి పొడుగాటి వాక్‌వే రూమ్ వంతెనలా కట్టి ఉంది.**



అక్షయ్ వద్ద ఉన్న సమాచారం ప్రకారం చిన్న పిల్లల శరీరభాగాలకు ఆ హాస్పిటల్‌లో విపరీతమైన గిరాకీ ఉంది. అవయవాల మార్పిడి అక్కడ తరచుగా, రహస్యంగా జరుగుతుంటుంది. ఆర్గాన్ ట్రేడ్ మాఫియాకీ, ఆ హాస్పిటల్‌కీ సన్నిహిత సంబంధాలు ఉన్నాయి. ఆ సంగతి బహిరంగ రహస్యమే అయినా యాజమాన్యానికి ఉన్న పలుకుబడి వల్ల ఎవరూ పెదవి విప్పే సాహసం చేయరు.

హాస్పిటల్‌నీ, ఐసోలేషన్ వార్డునీ కలుపుతున్న వాక్‌వేకి ఉన్న బ్లూ కలర్ ఇనుపడోర్ తెరచి లోపలికి ప్రవేశించాడు అక్షయ్.

అదొొక చిన్న ఖాళీప్రదేశం.

ఒకవైపు మెయిన్ హాస్పిటల్‌ని సూచిస్తున్న గుర్తులుండగా, రెండోవైపు ఐసోలేషన్ వార్డ్ అని సూచిస్తున్న హెచ్చరికలున్నాయి.

కొద్దిక్షణాలు తటపటాయించాడు అక్షయ్.

"నిజంగానే ఇక్కడ అవయవాల మార్పిడి జరుగుతుందా? అనవసరంగా లోపలికి వెళ్ళి ఏవైనా ప్రమాదకరమైన అంటువ్యాధులు సోకితే తన చాప్టర్ ఇంతటితో ముగిసిపోతుంది. అప్పుడు నైరాని పట్టించుకునేదెవరు?"

"కానీ ఒకవేళ నైరా లోపల ఉండి ఉంటే?" ఆ ఆలోచన రాగానే అన్ని అనుమానాలూ పక్కన పెట్టేశాడు. వెంటనే ఐసోలేషన్ వార్డుకి ఉన్న గ్లాస్‌డోర్ తెరుచుకుని లోపలికి అడుగుపెట్టాడు.

లోపలికి వెళ్ళేముందు మాస్కులు, ఇతర ప్రొటెక్టివ్ గేర్ ధరించమని రాసున్న బోర్డ్ కనబడింది. వార్డ్‌రోబ్ తలుపు లాగగానే తెరుచుకుంది. లాక్‌చేసి ఉన్నట్లు లేదు. మాస్క్, తలనుంచి అరిపాదాల వరకూ కవరు చేస్తున్న సేఫ్టీగేర్ తొడుక్కున్నాడు. కళ్ళ వద్ద ట్రాన్స్‌పరెంట్‌గా ఉండటంతో అతని కళ్ళు మాత్రమే బయటికి కనబడుతున్నాయి.

ఇదీ ఒకందుకు మంచిదే అనిపించింది అక్షయ్‌కి.

గభాల్న ఎవరైనా లోపలికొచ్చినా గుర్తుపట్టలేరు.

వాటితో నడవటం కాస్త ఇబ్బందిగానే ఉందతనికి.

గాజు తలుపులు, చిన్నచిన్న గదులు కనబడుతున్నాయి, వరసగా. ముందుకు నడవసాగాడు.

చాలావరకూ గదులు ఖాళీగా కనిపిస్తున్నాయి.

ఒక గదిలో మంచం మీద పడుకున్న మనిషి కనబడుతున్నాడు. ముక్కు, నోటి నుంచి గొట్టాలు పెట్టి ఉండటం కనబడుతోంది.

స్వైన్ ఫ్లూ అయ్యుంటుందేమో అనుకున్నాడు.

రెండు మూడు గదులు దాటాక ఎవరో పిలుస్తున్నట్లనిపించి పక్కకు తిరిగి చూశాడు. లోపల్నుంచీ చేతులూపుతూ, డోర్ మీద తట్టి పిలుస్తోందొకామె అక్షయ్‌ని.

దగ్గరగా వెళ్ళాడు అక్షయ్.

"డాక్టర్, ఇంకా ఎన్ని రోజులుండాలి నేనిక్కడ?" అడుగుతోంది.

తనని డాక్టర్ అనుకుంటున్నట్లుంది.

"రోజూ ఒకరోజు, రెండు రోజులు అని చెప్ప

# సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు 15

- కంఠంనేని స్వప్న

న్నారు. ఇప్పటికి నేనొచ్చి వారం దాటింది. జ్వరం కూడా తగ్గింది కదా. నన్ను డిశ్చార్జ్ చేయండి. లేదంటే ఇక్కడే బోర్‌కొట్టి చచ్చిపోయేలా ఉన్నాను."

"ఇది ఐసోలేషన్ వార్డ్ కాదు. డెత్ సెల్. ఎవరూ కనబడరిక్కడ. మా వాళ్ళెవరూ లేకుండా ఎన్నాళ్ళుం డాలిక్కడ?" మళ్ళీ అందామె. దిగులుగా ఉందామె గొంతు.

"ఊపిరాడనట్లుగా ఉంది. పోనీ పక్కరూమ్స్‌లోని వాళ్ళతో మాట్లాడే పరిస్థితి కూడా లేదు. మీరేదో మమ్మల్ని రక్షిస్తున్నామనుకుంటారు. మొన్న ఎదుటి రూమ్‌లో ఆమె ఒకటే వాంతులు చేసుకుని కుప్పకూలి పోయి చనిపోవటం కనబడింది. అప్పటినుంచీ నాకు చాలా డిప్రెసింగ్‌గా ఉంది. ఫోన్‌లేదు. టీవీ లేదు. పిచ్చెక్కుతోంది."

"ఇంతకీ కెరటాలు సీరియల్‌లో ఈ వారం ఏమయిందో?" ఆలోచనలో పడింది.

అక్షయ్ ఆమెను ఎగాదిగా చూశాడు.

అసలీమెకి ఏదయినా జబ్బుందా?

ఈ వాగుడు భరించలేక తెచ్చి ఇందులో పడేసి వెళ్ళిపోయారా?

"చెప్పండి. ఇంకా ఎన్ని రోజులుండాలి?" నిలదీస్తోంది.

ఏం మాట్లాడాలో తెలీక నోరు తెరుచుకుని చూస్తున్నాడు అక్షయ్.

"ఎదుటిరూమ్‌లో ఆమెదీ నాదీ ఒకటే జబ్బు. ఎబోలా! ఏదైనా ఫారిన్ టూర్‌కి తీసుకెళ్ళమంటే లైబీరియా తీసుకెళ్ళాడు మా ఆయన. అక్కడినుంచి అంటించుకొచ్చాడు. ఏదో కొత్తరకం ఏంటీవైరస్ మందు నా మీద వాడారుగా. అప్పటినుంచీ తగ్గినట్టే ఉంది" ఉన్నట్లుండి మొహం వికారంగా పెట్టింది.

"ఇప్పుడే వస్తాను. వెళ్ళిపోవద్దు" చెప్పి రూమ్‌లో ఉన్న చిన్న డోర్ తెరుచుకుని లోనికి వెళ్ళింది.

భళ్ళున వాంతి చేసుకుంటున్న శబ్దాలవుతున్నాయి లోపల్నుంచీ.

ముందుకు నడిచాడు అక్షయ్.

"నిజమే! ఈ ఐసోలేషన్ వార్డుల్లో ఉండాల్సి రావటం నిజంగా శిక్షే. కానీ వేరేవాళ్ళకు ఈ వ్యాధులు వ్యాప్తి చెందకుండా ఉండాలంటే తప్పదు" ఈ విషయం తట్టిందతనికి.

ఎబోలా ఉందా సిటీలో? బయటికి పొక్కకుండా భలే జాగ్రత్తలు తీసుకుంటున్నారే!

"ప్రభుత్వాలు అతి సమర్థవంతంగా నిర్వర్తిస్తున్న ఒకే ఒక్క పని ఏలియన్స్ ఉన్నాయనే విషయం దాచిపెట్టడం" స్టీఫెన్ హాకింగ్ మాటలు గుర్తొచ్చాయి.

అదొక్కటేనా? అవినీతి, అక్రమాలు, కుంభకోణాలు, బిజినెస్‌మెన్, పొలిటీషియన్లు కలిసి బ్యాంకులు లూటీచేయటాలు, అంటువ్యాధులకు సంబంధించిన విషయాలు... ఎన్నిటిని తొక్కిపెడతారు? ఎంతపనో... సడన్‌గా అతనికి గవర్నమెంట్ మీద జాలేసింది.

ముతక బట్టలు వేసుకుని దిగువ మధ్యతరగతికి చెందినవాడిలా కనిపిస్తున్న ఒకతను అటుగా వెళ్ళటం కనపడింది.

"స్టాఫ్‌లా లేడే? బాడ్జ్ అవీ లేవు ఒంటిమీద. పైగా ప్రొటెక్టివ్ గేర్ కూడా వేసుకోలేదు. స్టార్ హాస్పిటల్స్‌లో ఐసోలేషన్ వార్డుల్లో రోజుల తరబడి రూమ్స్ అంటే మామూలు వాళ్ళు భరించలేరు. అయితే కోటీశ్వరులన్నా అయ్యుండాలి లేదా హెల్త్ ఇన్స్యూరెన్స్ ద్వారా ఇటువంటి ఖర్చులన్నీ కవర్ అయిపోయే వైట్ కాలర్ ఉద్యోగి అన్నా అయ్యుండాలి. ఇతన్నిచూస్తే రెండు కోవలకీ చెందేలా లేడు" ఆలోచిస్తూ అక్షయ్ అతన్ని ఫాలో అయ్యాడు. కారిడార్ చివరగా ఉందో, లేదో తెలీకుండా గోడ రంగులోనే ఉన్న తలుపు తోసుకుని లోపలికి వెళ్ళాడతను.

కాసేపు బయటే ఆగాడు అక్షయ్.

## జరిగిన కథ

అక్షయ్, కావ్య, సీమ, హర్ష ఓ మల్టీ నేషనల్ కంపెనీలో పనిచేస్తుంటారు. అక్షయ్ వాళ్ళ అక్కా, బావ యాక్సిడెంట్‌లో చనిపోతారు. వారి కూతురు నైరాని ఎటువంటి లోటు రానీకుండా పెంచాలనుకుంటాడు అక్షయ్. ఒక రోజు నైరా కనిపించకుండా పోతుంది. అక్షయ్ పోలీస్ కంప్లయింట్ ఇవ్వడంతో ఇన్వెస్టిగేషన్ మొదలవుతుంది. ఓ టీవీ ఛానల్ ద్వారా స్టింగ్ ఆపరేషన్ చేసి, ప్రాస్టిట్యూట్ రింగ్‌వారిని అరెస్టు చేయిస్తాడు అక్షయ్. పేపర్లో వచ్చిన ఓ వార్త ఆధారంగా పసిపిల్లలను బలిచ్చేవారిని వెతుకుతూ కలకత్తా, నిమ్తలాఘాట్ వెళ్ళి, అక్కడ అఘోరాలు బలివ్వబోతున్న చిన్నారుల్ని కాపాడతాడు అక్షయ్. ఈలోపు నైరా ఆచూకీపై వస్తున్న రకరకాల సమాచారాన్ని శోధించటం మొదలుపెడతారు. పిల్లలను కిడ్నాప్ చేసి, వారిని బిచ్చగాళ్ళుగా మారుస్తున్నారని తెలుసుకుంటాడు అక్షయ్. కొంతమంది పిల్లలను రక్షిస్తాడు. తనకు మెసేజెస్ చేసే అమ్మాయి సిమ్ కార్డు డీటెయిల్స్ కోసం ప్రయత్నించి విఫలమవుతాడు హర్ష. నైరా ఆచూకీ కోసం కావ్య ఒక ఆన్‌లైన్ డిటెక్టివ్ ఏజెన్సీని కాంటాక్ట్ చేస్తుంది. తన ప్రయత్నాల్లో భాగంగా, ఒక కార్పొరేట్ హాస్పిటల్ గోడదూకి లోపలికి ప్రవేశిస్తాడు అక్షయ్. **ఆ తర్వాత...**



వెనకే తోసుకుని వెళ్తే గమనిస్తాడేమో!

పది నిమిషాలకే బయటికొచ్చాడతను అక్షయ్‌ని గమనించేస్థితిలో ఉన్నట్లు లేదు.

తన పక్కనుంచీ వెళ్తుంటే గుప్పున వాసనొచ్చింది అక్షయ్‌కి. తాగి ఉన్నాడు.

అతను దూరంగా వెళ్ళిపోయే వరకూ చూసి అప్పుడు లోపలికి వెళ్ళాడు అక్షయ్.

రెండు గదులు కనబడుతున్నాయి ఎదురుగా.

ఐసోలేషన్ వార్డుల్లో ఉన్న రూమ్‌లకి భిన్నంగా ఉన్నాయి.

సర్జికల్ ఎక్విప్‌మెంట్ అంతా కనబడుతోంది ఆ గదుల్లో.

ఒక గది ఖాళీగా ఉంది.

రెండో గదిలో కార్టూన్ ఫిల్మ్ నడుస్తోంది.

ఒక పాప పడుకుని టీవీ చూస్తోంది.

సంతోషంగా ఉందామె మొహం.

సడన్‌గా అక్షయ్‌ని చూసి కెవ్వుమంది.

"భయపడకు... నిన్ను చూడటానికి వచ్చాను" చెప్పాడు అక్షయ్ ఆ పాపను పరిశీలిస్తూ.

పదేళ్ళుండవచ్చు. పోషకాహార లోపంతోనో, ఎండకీ,

వానకీ తడుస్తూ పెరిగే శరీరం కావటం వల్లో ఏమో అనారోగ్యంగా కనబడుతోంది. చింపిరిజుట్టు... మురికిగా ఉన్న శరీరం.

"ఇంకా కొంచెం నొప్పిగా ఉంది డాక్టర్". నడుము నుంచి పొట్టవరకు ఉన్న కుట్లు చూపిస్తూ చెప్పింది.

అక్షయ్‌కి ఒళ్ళు జలదరించింది. కిడ్నీ తీసేసినట్లున్నారు.

ఆమెని చూస్తే ఆ హాస్పిటల్‌లో వైద్యం చేయించుకునే స్తోమత ఉన్నట్లు కనబడటం లేదు. ఒకవేళ కిడ్నీ దొంగతనానికి ఇందులో చేర్చుకున్నారా? ఎవరో వస్తున్న శబ్దాలు వినిపించాయి.

పక్కకి తప్పుకున్నాడు అక్షయ్.

ఇద్దరు డాక్టర్లు, ఆమె బెడ్ దగ్గర నిలబడి పరిశీలిస్తున్నారు.

వాళ్ళ మాటల్ని బట్టి, ఆ రోజు రాత్రి ఆ పాప నుంచి మరికొన్ని అవయవాల్ని వేరు చేయటానికి సన్నాహాలు జరుగుతున్నట్టు అర్థమయింది అతనికి.

ఇంతలో జర్దా వాసన గుప్పుమంది. నడవలేక నడుస్తున్నట్లుగా ఉన్న లావుపాటి శాల్తీ దొర్లినట్లు నడుస్తూ వచ్చాడు లోపలికి. అప్పుడు గమనించాడు అక్షయ్, ఆ రూమ్స్‌లోకి హాస్పిటల్ పైభాగం నుంచి వేరే దారి ఉండటం. లిఫ్ట్ నుంచి దిగుతున్నారు ఒక్కొక్కరూ.

ఐసోలేషన్ వార్డ్‌కీ, మెయిన్ విభాగానికీ దార్లున్నాయి ఆ గదులలో నుంచి.

జర్దా అతను మంచం మీదున్న పాపని చూసి మొహం చిట్లించాడు.

"దీనిదా?" చిరాగ్గా అన్నాడు.

"మీ ఇష్టం. చిన్నపిల్లలదయితే ఎక్కువ ఏళ్ళు బ్రతకొచ్చని మా అభిప్రాయం. అందుకే ఈ పాపని అరేంజ్ చేశాము. హార్ట్ ట్రాన్స్‌ప్లాంట్ అవసరమయిన వాళ్ళ లిస్ట్ చాలాపెద్దదే ఉంది. చట్టప్రకారం చేయాలంటే బ్రెయిన్‌డెడ్ అయిన వాళ్ళు, తాము చనిపోయాక అవయవదానం చేస్తామని రాసిచ్చిన వాళ్ళు దొరికే వరకూ ఆగాలి. అలా ఆగాలంటే మొత్తం ప్రొసీజర్ పాటించాలి. మీకంటే అర్జంట్‌గా గుండె మార్పిడి అవసరమయిన వాళ్ళు చాలామంది ఉన్నారు."

"ఏదో అదృష్టవశాత్తూ బ్లడ్‌గ్రూప్, ఆర్గాన్ సైజ్ అన్నీ మీకు మాచ్ అయ్యాయి. మీరు తొందరగా నిర్ణయించుకోండి. హార్ట్ తీసిన నాలుగు గంటలలోపు మార్పిడి జరిగిపోవాలి. లేదంటే పనికిరాకుండా పోతుంది. మీరు వద్దనుకుంటే వేరేవాళ్ళకు అరేంజ్ చేస్తాము."

కళ్ళముందే బేరం జరుగుతోంది.

ఆ పాపకు అర్థం కాకుండా సంభాషణంతా ఇంగ్లీష్‌లో జరుగుతోంది. తనకు దొరుకుతున్న ఈ అటెన్షన్‌కు ఆమె మొహంలో సంతోషం.

అక్షయ్‌కి రక్తం ఉడికిపోతోంది. నైరా విషయం కాసేపు మర్చిపోయాడు. ఎలాగైనా ఈ పాపను కాపాడాలనుకున్నాడు.

జర్దా కిళ్ళీ అయిష్టంగానే బేరం సెటిల్ చేసుకున్నాడు.

వాళ్ళు వెళ్ళగానే బయటికొచ్చిన అక్షయ్‌ని చూసి అడిగింది జాలిగా, "ఎందుకు దాక్కున్నావు? నువ్వు దొంగవా?"

తల నిమిరాడు అక్షయ్. "మా పాపని వెతుకుతూ వచ్చాను."

"వాళ్ళేం మాట్లాడుకున్నారో నీకు అర్థం అయిందా?" అడిగాడు.

లేదంది.

**గ్లాస్ డోర్ తెరిచి, లోపలికి అడుగుపెట్టాడు అక్షయ్. మాస్కులు, ప్రొటెక్టివ్ గేర్ ధరించాడు. అతడి కళ్ళు మాత్రమే బయటకు కనబడుతున్నాయి. అడుగులో అడుగు వేసుకుంటూ నెమ్మదిగా ఒక్కో గది చూసుకుంటూ నడుస్తున్నాడు. ఎవరో పిలిచారు. ఆగి నెమ్మదిగా పిలుపు వినవచ్చిన వైపు చూశాడతను. ఎవరో ఒకామె తనని రమ్మని పిలుస్తోంది. ఎవరామె? అసలు అక్షయ్ అక్కడికెందుకొచ్చాడు?**

"నీకేమైందో తెలుసా?" అడిగాడు.

"జ్వరం వస్తే హాస్పిటల్‌కి తీసుకొచ్చాడు మానాన్న. రెండు రోజుల్లో తగ్గిపోతుంది. మా అమ్మ చచ్చిపోయింది. మా పిన్ని ఇంట్లో ఉంటే పనంతా చేయించేది. ఇప్పుడు హాయిగా ఉన్నానిక్కడ" చెప్పింది.

అక్షయ్‌కి ఆశ్చర్యం వేసింది. తిండికి లేక, తాగి తూలుతూ తిరిగేవాడికి కూడా రెండో పెళ్ళి, మొదటి భార్య కూతుర్ని అసూయతో వేధించే రెండో భార్య.

ఒకవేళ వాళ్ళని కోప్పడి పాపని ఇంట్లో దింపేసినా మళ్ళీ ఇదే పని చేయవచ్చు వాళ్ళు. ఒక్క కిడ్నీతో సరయిన సదుపాయాలు లేక ఈ పాప బతకలేక పోనూ వచ్చు. అసలిక బరువు పనులు చేయగలదా? జీవితంలో ఏవయినా ఇన్‌ఫెక్షన్లు వస్తే దిక్కేవరు?

ఆమెకి ఎలా చెప్పాలో అర్థం కాలేదతనికి.

మెల్లిగా ఆమెకి అర్థమయ్యే భాషలో చెప్పాడు. విపరీతమైన భయాందోళనలకు గురయింది ఆమె.

"మా నాన్నకి తెలుసా?" అడిగింది.

"తెలుసేమో?" నిరాశగా అంది మళ్ళీ తనే. "ఇందాకే డబ్బులు తీసుకుని వెళ్ళాడు. పిన్నిని ఊరికి తీసుకెళ్తున్నానన్నాడు" చెప్పింది. "చనిపోయేప్పుడు నెప్పెడుతుందా?" అడిగింది.

"నిన్ను నేను బయటికి తీసుకెళ్తాను. నీకేమీ కానివ్వను" చెప్పాడు అక్షయ్.

మళ్ళీ అలికిడయింది. ఈసారి రెండో కిడ్నీకీ, లివర్‌కీ సంబంధించిన బేరం కుదిరింది.

మనిషి బ్రతికి ఉండగానే అవయవాల్ని ఒలుచుకుంటున్న వాళ్ళనూ, పంచేస్తున్న వాళ్ళనూ ఏమి చేయాలి? వీళ్ళ ఇళ్ళల్లో పిల్లలుండరా? మనుషులేనా? ఏదయినా రాక్షసజాతా?

అక్షయ్‌కి క్షోభగా ఉంది. నైరా ఇటువంటివాళ్ళ చేతుల్లో పడకూడదు.

దేవుడిని ప్రార్థించాడు.

"లేచి నడవగలవా?" అడిగాడు వాళ్ళు వెళ్ళగానే. "ఇంకాలేదు. కూర్చోవటానికి కూడా నెప్పిగా ఉంది." చెప్పింది.

లేపి వీల్‌చెయిర్‌లో కూర్చోబెట్టాడు.

అప్పటివరకూ అతనికి కలిసొచ్చిన విషయం రహస్య ఆర్గాన్ ట్రాన్స్‌ప్లాంట్ గదుల్లో సీసీ కెమెరాలు పెట్టకపోవడం! అదంతా చట్టవ్యతిరేకంగా జరిగే వ్యాపారం కాబట్టి వీలయినంత సెక్యూర్‌గా ఉంచాలని భావించిన హాస్పిటల్ మేనేజ్‌మెంట్, అక్కడ

## కాజల్ పెళ్ళి?

*నిన్న మొన్నటి దాకా కాజల్ పెళ్ళి గురించి అస్సలు ఆలోచించేది కాదు. కానీ ఇప్పుడు ఆ సమయం వచ్చేసింది అంటున్నారు టాలీవుడ్ జనాలు. ఓ వ్యాపారవేత్తతో కాజల్ పెళ్ళి జరగబోతోందనే వార్త బాగా హల్‌చల్ చేస్తోంది. ఆ వ్యాపారవేత్తకు దేశవ్యాప్తంగా హోటల్స్ ఉన్నాయట! ఇవి కాక వేరే వ్యాపారాలు కూడా ఉన్నాయంటున్నారు. అతగాడితో ప్రేమలో పడిన కాజల్ త్వరలోనే పెళ్ళిపీటలెక్కబోతోందట! కాకపోతే ఈ వార్తపై కాజల్ ఇంకా స్పందించలేదు. మౌనం అర్థాంగీకారం కనుక ఈ వార్త నిజమంటున్నారు సినీ జనాలు.*

కెమెరా కన్ను పడనివ్వలేదు.

ఐసోలేషన్ వార్డ్‌లో ఉన్న ఒకే ఒక సీసీ కెమెరాని సెక్యూరిటీ టీమ్ పట్టించుకోరు. కోరి అక్కడికెవరు వెళ్తారనే నిర్లక్ష్యం ఒక కారణమయితే, చూసినా తమ కెక్కడ వ్యాధులు సోకుతాయోనన్నంత భయం ఉండటం మరో కారణం.

తను వేసుకున్న ప్రొటెక్టివ్ గేర్, మాస్క్ తీసి పాపకు తొడిగాడు అక్షయ్.

అవిలేకుండా తను ఐసోలేషన్ వార్డుగుండా వెళ్ళటం ప్రమాదకరమని తెలుసతనికి. అయినా తన కన్నా ఆమెకి వ్యాధులు సోకే అవకాశాలు ఎక్కువని భావించాడు.

శ్రీకాంత్ అప్పటికే మఫ్టీలో ఉన్న ఇద్దరు పోలీసుల్ని అక్షయ్‌కి సహాయం చేయటానికి పంపాడు. హాస్పిటల్ వెనుకభాగంలో కాంపౌండ్ వాల్ బయట నిలబడి ఉన్నారు వాళ్ళు. శ్రీకాంత్‌కి తెలిసే జరుగుతున్న ఆపరేషన్ అయినప్పటికీ అవసరమైన పర్మిషన్లు లేకపోవటం, హాస్పిటల్ మేనేజ్‌మెంట్‌కి ఉన్న పలుకుబడి కారణంగానూ పోలీస్ డిపార్ట్‌మెంట్ సపోర్టింగ్ రోల్ మాత్రమే పోషిస్తోంది.

నెమ్మదిగా శబ్దమవకుండా వీల్‌చెయిర్ తోసుకు వెళ్తున్నాడు అక్షయ్.

ఉన్నట్లుండి కలకలం మొదలయింది ఐసోలేషన్ వార్డులో. పక్కకు నక్కాడు పాపతో సహా.

అంతకుముందు కెరటాలు సీరియల్ ఏమయిందని అడిగిన అమ్మాయి చనిపోయినట్లుంది...

మొత్తం కవర్ చేయబడిన బాడీని స్ట్రెచర్ మీద ఉంచి తీసుకెళుతున్నారు, వార్డ్‌బాయ్స్ కాబోలు. వాళ్ళంతా ఇందాక తను ధరించిన మాస్క్, బట్టలు లాంటివే వేసుకుని ఉన్నారు.

"ఎబోలా ఏమోకానీ దెబ్బకి వెయిట్ తగ్గిపోయాను" సంబరంగా తనతో చెప్పిన వాగుడుకాయ అప్పుడే చనిపోయిందా?"

నెమ్మదిగా వైరాగ్యం చోటు చేసుకుంటోంది అతనిలో. పోయేవరకూ చావు గురించి భయపడతాము.

చావుకీ, బ్రతుకుకీ మధ్య ఉండే తేడా ఒక్క సెకన్ మాత్రమే. హడావుడి సద్దుమణిగే దాకా అక్కడే ఉండిపోయాడు.

అయిదు నిమిషాల్లో ఆ రూమ్ ఖాళీ అయింది. అమ్మోనియా, బ్లీచ్ చల్లిన వాసన గుప్పుమంటోంది.

వేగంగా కదిలాడతను.

పాప ఉన్న చెయిర్‌ని తోసుకుంటూ ఐసోలేషన్ వార్డ్ నుండి బయటికెళ్ళే డోర్ తెరిచాడు.

సరిగ్గా అదే సమయంలో పాప కార్నియా కోసం బేరాన్ని తెచ్చిన సిబ్బందికి రూమ్ ఖాళీగా కనబడింది. సెక్యూరిటీని అలర్ట్ చేశారు.

అప్పటికే కుదుర్చుకున్న బేరాలన్నీ పోవటమేగాక, హాస్పిటల్ రెప్యుటేషన్‌కి దెబ్బపడుతుంది, విషయం బయటికొస్తే.

హాస్పిటల్ స్టాఫ్ అలర్ట్ అయ్యారు.

శ్రీకాంత్ అక్షయ్‌కి తోడుగా పంపించిన పోలీసుల్లో ఒకతను గోడమీదకు ఎక్కి రెడీగా ఉన్నాడు, పాపను అందుకోవటానికి. కిందకి దింపటానికి మరో పోలీస్.

కుర్చీతో సహా ఎత్తి వాళ్ళకు అందించాడు అక్షయ్.

జాగ్రత్తగా కిందకి దింపుకున్నారు వాళ్ళు.

మరుక్షణం తమతో తీసుకొచ్చిన తెలుపురంగు క్వాలిస్‌లోకి ఎక్కించారు.

సెక్యూరిటీవాళ్ళు గమనించేసరికి అక్షయ్ గోడ ఎక్కుతున్నాడు.

దూరం నుంచీ వాళ్ళువేసిన టార్చ్‌లైట్స్ ఫోకస్‌లో ఐసోలేషన్ వార్డ్ గుమ్మం బయట మోకాళ్ళ మీద కూర్చుని బీడీ తాగుతున్న అతనికి, అక్షయ్ మొహం స్పష్టంగా కనబడింది. ఆ సంగతి అక్షయ్‌కి తెలియదు.

క్షణాల్లో ఆ ప్రదేశం ఖాళీ అయిపోయింది. పాప, అక్షయ్, కార్, మనుషులు మెరుపు వేగంతో మాయమయి పోయారు.

సెక్యూరిటీ చేతులెత్తేసింది. వాళ్ళు దూరంగా ఉండటంతో అక్షయ్ మొహం కనబడలేదు. అక్షయ్‌ని చూసినతను బీడీని కాలితో నలిపేసి అక్కణ్ణుంచి మెల్లగా జారుకున్నాడు.

అతను పాప తండ్రి.

హాస్పిటల్‌లో కూతుర్ని అప్పజెప్పాడన్న మాటే కానీ అపరాధ భావన అతణ్ణి నమిలేస్తోంది. వెనక్కి వెళ్ళి పాపని తెచ్చుకోవాలనుకున్నాడు. తన శక్తి అందుకు సరిపోదనీ, గట్టిగా మాట్లాడితే తన శరీ

## మనమీదేసర్రోయ్!

సరసి





రాన్ని కూడా వాటాలేసుకుని పంచేసుకుంటారని తెలుసతనికి. అందుకే ధైర్యం చాలక, ఇంటికి వెళ్ళటానికి మనసొప్పక బయటే కూర్చున్నాడతను.

రెండు రోజుల తర్వాత శ్రీకాంత్, అతని భార్య వెళ్ళి ఆ పిల్లని మెదక్‌లో ఉన్న గవర్నమెంట్ హోమ్‌లో చేర్పించారు. అక్కడి కేర్‌టేకర్ శ్రీకాంత్ భార్యకి స్నేహితురాలట.

వెళ్తూ తలమీద చేయేసి చెప్పింది శ్రీకాంత్ భార్య.

"బాగా చదువుకో తల్లీ! నువ్వు చదువుకుంటే నీలాంటి మరికొందరికి ఆసరా ఇవ్వొచ్చు. ఒకరిమీద ఆధారపడకుండా, ఎవరి దయాదాక్షిణ్యాలతో అవసరం లేకుండా మహారాణిలా బ్రతకొచ్చు. పుస్తకాలు మనకి తెలీని కొత్త ప్రపంచాన్ని పరిచయం చేస్తాయి. వాటిలో మనకి మంచి చెప్పే స్నేహితుడుంటాడు."

చదువు మీద ఆసక్తి రేకెత్తించే బీజాన్ని వేసి కదిలారు వాళ్ళు.

***

లంచ్‌టైమ్ అప్పుడే ముగిసింది. ఒక్కొక్కరూ మరికొన్ని మెయిల్స్ అవి కూడా అందరికీ రిప్లయ్ వచ్చేలా పంపుతున్నారు.

"నువ్వు బాస్ అయితే మరి నేనెవరిని?" కంపెనీ ఇండియా హెడ్ నుంచి ఒక రిప్లయ్ మెయిల్ వచ్చింది.

బ్రహ్మి లంచ్ ముగించుకుని తృప్తిగా తన డెస్క్ దగ్గరకి చేరాడు.

దారిలో అందరూ అతనిని నవ్వుతూ పలకరిస్తున్నారు.

"ఏమిటో ఇవాళ అంతా సంతోషంగా ఉన్నారు" అమాయకంగా రోహిణితో అంటూ సిస్టమ్ ఆన్ చేశాడు.

రోహిణి నవ్వాపుకుంది.

"గంటలోనే వందపైన మెయిల్స్ ఉన్నాయేమిటి? అన్నీ ఒకటే సబ్జెక్ట్‌తో" అంటూ మెయిల్స్ చదవటం మొదలెట్టాడు. పకపకా నవ్వుతున్నాడు చదువుతూ.

"ఇతనికి ఏమైనా మెంటలా?" మొహాలు చూసుకున్నారు కావ్య, రోహిణి.

"ఎవరో బకరా అయినట్లున్నారు" గొల్లున నవ్వుతూ అన్నాడు.




డెస్కుల దగ్గరకు చేరుకుంటున్నారు.

మెయిల్‌బాక్స్ ఓపెన్‌చేసిన వాళ్ళంతా ఆశ్చర్యపోతున్నారు.

తర్వాత వాళ్ళ మొహాలమీద నవ్వు పరుచుకుంటోంది. ముసిముసి నవ్వులు నవ్వుకుంటున్నారు.

బ్రహ్మి నుంచీ కంపెనీ మొత్తానికీ ఒక మెయిల్ వచ్చింది.

"అయామ్ ది బాస్!" పెద్ద ఫాంట్‌లో ఉన్నాయా అక్షరాలు.

సిస్టమ్ లాక్‌చేయకుండా బ్రహ్మి లంచ్‌కి వెళ్ళాడు. కంపెనీ పాలసీ ప్రకారం అలా లాక్ చేయకపోవటం నియమాలకు విరుద్ధం.

రోహిణికి బ్రహ్మి సిస్టమ్ అలా కనబడగానే చేతులు దురద పుట్టాయి. వెంటనే ఆ మెయిల్ పంపింది అందరికీ.

రకరకాల రిప్లయ్‌లు వస్తున్నాయి.

"అఫ్‌కోర్స్... మీరు కాకపోతే ఇంకెవరు?"

"మీరు ప్రాజెక్ట్ మేనేజర్లలో కబాలి".

కావాలని రిప్లయ్ ఆల్ కొడుతున్నట్లున్నారు.

అందరికీ వస్తున్నాయా మెయిల్స్.

"ప్లీజ్, అందరికీ రిప్లయ్ పంపకండి" అంటూ "ఎవరమ్మా? వీడికేమైనా మెంటలా? ఇట్లా మెయిల్ పంపాడు?" అంటూనే చివరివరకూ వచ్చాడు.

ఒక్క నిమిషం బుర్ర తిరిగి పోయిందతనికి.

తన మెయిల్ ఐడీ నుంచీ వెళ్ళినట్లుందే? ఎలా సాధ్యం? అందరూ తననిచూసి నవ్వుతుంటే పలకరింపుగా నవ్వుతున్నారనుకున్నాడు.

చావుకబురు చల్లగా చెప్పిందప్పుడు రోహిణి, సిస్టమ్ లాక్ చేయకుండా వెళ్ళాడనీ, సరదాకి మెయిల్ పంపాననీ.

కక్కలేడు, మింగలేడన్నట్లుగా ఉందతని పరిస్థితి.

లాక్ చేయకుండా వెళ్ళాడంటే సెక్యూరిటీ వయోలేషన్ కిందకొస్తుంది. తనే పంపానంటే తనకు పిచ్చెక్కిందనుకుంటారు.

"పని బిజీతో అందరూ స్ట్రెస్డ్ అవుట్ అయి ఉంటారు. అందుకే సరదాగా ఈ ఐస్‌బ్రేకర్. చిల్ ఫ్రెండ్స్" అందరికీ రిప్లయ్ పంపాడు.

"పిచ్చోడనుకుంటాము కానీ మామూలు తెలివి కాదు బ్రహ్మిది" అంది రోహిణి కావ్యతో.

***

అప్పటికి పావుగంట నుంచీ వాదన జరుగుతోంది కావ్యకీ, రాజేష్‌కీ.

ఆమె చేస్తున్న మరో ప్రాజెక్ట్‌కి, అవసరమైనంత సమయం కేటాయించటం లేదనీ, కాబట్టి పని డిలే అవుతుందనీ, దానివల్ల ఆమె పనిమీద ఆధారపడిన మిగతా పనులు కూడా ఆలస్యమవుతున్నాయనీ ఆ ప్రాజెక్ట్ లీడ్ మనోహర్ నుంచీ ఉన్న మెయిల్ చూపించాడు.

"శని, ఆదివారాలు ఆఫీస్‌కి రావాల్సిందే. వచ్చి నీవల్ల లేట్ అయిన పనులు పూర్తిచేయి" అధికారం ధ్వనిస్తుండగా అన్నాడు రాజేష్.

"నా వల్ల పని ఆలస్యమైతే ముందు నాకు చెప్పాలి. ఎందుకు చెప్పలేదు?" అడిగింది కావ్య భయంగానే.

"చెప్పినా నువ్వు పట్టించుకోలేదట" అన్నాడు రాజేష్.

ఇద్దరూ కలిసే తనని కావాలని ఇరికిస్తున్నారని అర్థమవుతోందామెకి.

"కావాలంటే రోజూ కాస్త ముందొచ్చి పని కంప్లీట్ చేస్తాను. వీకెండ్ మాత్రం రాలేను" తెగేసి చెప్పింది కావ్య.

"ఆఫీస్‌కి రావటానికి బాధేంటి? నా ఇంటికి రమ్మన్నానా?" వెటకారంగా అన్నాడు రాజేష్.

"అని చూడు... చెప్పు తెగుతుంది" అనుకోకుండా వచ్చేసిందామె నోట్లోనుంచి.

తర్వాత పెద్ద యుద్ధ వాతావరణం సృష్టించాడు రాజేష్.

ఆమె పని పూర్తి చేయట్లేదని, అడిగితే తనతో ఇష్టమొచ్చినట్లుగా మాట్లాడుతోందనీ హెచ్.ఆర్. మేనేజర్‌కి ఫిర్యాదు చేశాడు.

ఇద్దరినీ కూర్చోబెట్టి, మనోహర్‌ని కూడా పిలిచి మాట్లాడారు హెచ్.ఆర్. వాళ్ళు.

ఒక రెండు వీకెండ్స్ వచ్చి పని పూర్తిచేస్తే సరిపోతుందని తేల్చారు.

గుడ్లలో నీళ్ళు కుక్కుకుంటూ డెస్క్ దగ్గరకి వచ్చి పడింది కావ్య.

"వాళ్ళ సంగతి తెలిసీ ఎందుకు జాగ్రత్తగా మాట్లాడవు?" విషయం విన్న సీమ అంది.

"ప్లాన్ చూపించమనాల్సింది. నీ పని డిలే అయిందో, లేదో అర్థమయ్యేది" అంది రోహిణి.

"వాళ్ళు మొత్తం ప్రిపేర్డ్‌గా ఉన్నారు, ప్లాన్‌తో సహా" చెప్పింది కావ్య.

"ఒక్క రెండు వారాలు ఆఫీస్‌కి వచ్చినంత మాత్రాన కొంపలేమీ మునగవు" మన ఆఫీస్‌లో వీకెండ్స్ ఎప్పుడూ ఎవరో ఒకళ్ళు ఉంటూనే ఉంటారు" చెప్తోంది సీమ.

ఎక్కడినుంచో ఊడిపడ్డాడు సెటిల్‌మెంట్ సాంబ.

"స్త్రీల ఆత్మగౌరవాన్ని పరిరక్షించటం నా బాధ్యత. నేను కూడా వీకెండ్స్ వస్తాను ఆఫీస్‌కి. భయపడకు. తోడుగా నేనొస్తాను. పోయినసారి వాడు హెరాస్ చేస్తున్నాడు అని అందరికీ తెలుస్తున్నా, ఎటువంటి ఆధారాలూ లేక ఏమీ చేయలేకపోయాను. ఈసారి ఇరికించేద్దాం" అభయమిచ్చాడు.

తర్వాత రోహిణి, సీమ, కావ్యలకు అభివాదం చేసి చెప్పాడు.

"2019 ఎలక్షన్స్‌లో శేరిలింగంపల్లి నుంచి పోటీ చేసేది నేనే, మీ ఓట్ తప్పకుండా నాకే వేయాలి."

**(ఇంకా వుంది)**



# వారసత్వం

**-డా.వి.సత్యవాణి**

**“నాన్నగారి ఆరోగ్యం బాగాలేదట. ఓసారి వెళ్ళి చూసొద్దామా?” విక్రమ్ ఫోన్ చేశాడు వాసుకి.**

**“ఔనన్నయ్యా! నేనూ అదే అనుకున్నాను. చాలా కాలమయింది ఆయన్ని చూసి. ఏదో అప్పుడప్పుడు లోకం కోసం వెళ్ళి చూసొస్తున్నాం. ఇప్పుడు ఆరోగ్యం బాగాలేదని తెలిశాక కూడా వెళ్ళకపోతే బాగుండదేమోననుకుంటున్నా” అన్నాడు వాసు.**

**“నిజమే. ఆస్తి ఆయన స్వార్జితం. అంతా ఆయన పేరనే ఉంది” అర్థోక్తిలో ఆగిపోయాడు విక్రమ్. “ఔను కదూ! సరే, ఎప్పుడెళ్దాం?” అడిగాడు వాసు. “ముందు మనిద్దరం వెళ్దాం. అక్కడి పరిస్థితిని బట్టి మనవాళ్ళను రమ్మందాం” అన్నాడు విక్రమ్. “సరే అయితే; వచ్చే సెకండ్ సాటర్ డే, సన్ డే కలుపుకుని వెళ్దాం. బయలుదేరే ముందు ఫోన్ చెయ్యి” అని ఫోన్ పెట్టేశాడు వాసు.**

అనుకున్నట్టుగానే తరువాత వారం వెళ్ళి తండ్రిని పలుకరించారు అన్నదమ్ములు. “ఎలా ఉంది నాన్నగారూ” అని పరామర్శించారు.

“ఫరవాలేదు లేరా! డాక్టర్లు ఏదో నోరు తిరగని జబ్బు చెప్తారు. నిందలేనిదే బొంది పోదంటారు అంతే. కొడుకులు దగ్గర లేరని ఆయుష్షు పెరగదుగా? ఇన్ని సంవత్సరాల్లో ఏ రెండు మూడు సార్లో వచ్చి ముఖం చూపించి వెళ్ళారు. మళ్ళీ ఈ రోజు వచ్చారు. సర్లే కోడళ్ళు, పిల్లలు కులాసానా?” నిష్ఠూరం ధ్వనిస్తూనే పరామర్శించారు విక్రమ్, వాసుల తండ్రి జగన్నాథంగారు.

“పనుల ఒత్తిడిలో తరచు రావటానికి వీలు కాలేదు నాన్నగారూ. అయినా ఎప్పటికప్పుడు మీ క్షేమ సమాచారాలు తెలుసుకుంటూనే ఉన్నాం. పిల్లలు కులాసా” క్షమాపణ ధోరణిలో మాట్లాడారిద్దరూ.

“వాసూ కొడుకు డాక్టరు కదా నాన్నగారూ! వాడికి తెలిసిన పెద్ద డాక్టర్లకి చూపిస్తాం” అని శ్రద్ధ కనబరిచాడు విక్రమ్. “ఔను నాన్నగారూ, మాతో పాటే వచ్చేయండి” అని వాసు వంతపాడాడు. ఇంటిదగ్గర భార్య సుందరి తండ్రికి సేవ చేయటానికి సిద్ధపడదని, తనతో తగవుకు దిగుతుందని వాసుకి తెలుసు!

“వద్దులేరా, మంచి డాక్టరే ఇంటికొచ్చి చూస్తున్నాడు. ఆడపిల్లయినా సుభద్ర, అల్లుడైనా ప్రభాకర్ ఇద్దరూ నన్నెంతో బాగా చూసుకుంటున్నారు. నాకు సుస్తీ చేయకముందు నుంచీ వాళ్ళే నా ఆలనాపాలనా చూసుకుంటున్నారు. సుభద్ర కూతురు ‘శోభన’ డాక్టరుగా ఇక్కడే ప్రాక్టీసు పెట్టుకుంది” రాననే భావం వ్యక్తం చేస్తూ చెప్పారు జగన్నాథం గారు.

“సర్లే, మీరెళ్ళి విశ్రాంతి తీసుకోండి. తర్వాత మాట్లాడుకుందాం” అని దిండుమీదకు ఒరిగారు. వాళ్ళు చూపిస్తున్న తెచ్చుకోలు ఆరాటం, ఆ ఆరాటంలోని అంతరార్థం గ్రహించిన జగన్నాథం గారు చిన్నగా నవ్వుకున్నారు.

***

విక్రమ్, వాసు, సుభద్ర ముగ్గురూ జగన్నాథం

**నగర జీవితంలో బిజీగావుండే కొడుకులు అనారోగ్యంతో ఉన్న తండ్రిని చూసేందుకు వెళ్ళారు. వర్ణాంతర వివాహం చేసుకున్న వారి తోబుట్టువు తండ్రిని కనిపెట్టుకుని వుంది. తండ్రికి తనగోడు మొరపెట్టుకుంది. తనకో దారిచూపించమని అడిగింది. వెంటనే ఆస్తిపంపకాల ప్రకటన చేశాడాతండ్రి. ఇంతకూ కూతురు గోడుకీ, ఆస్తిపంపకాలకీ ఏమిటి సంబంధం? అసలా ఇంట్లో ఏం జరిగింది?**

గారి సంతానం. పిల్లలు పెద్దవాళ్ళు కాకముందే ఆయన భార్య కన్నుమూసింది. బిడ్డల సంరక్షణ కోసం తాడూ బొంగరంలేని దూరపు బంధువు, తనకు పిన్నివరసైన రాజ్యమ్మగారి అండతో కుటుంబాన్ని లాక్కొచ్చారు. పిల్లలు పెద్దవాళ్ళయ్యారు. మగ పిల్లలకి ఉద్యోగాలు, పెళ్ళిళ్ళయ్యాయి. అమ్మాయి సుభద్రకు పెళ్ళీడు వచ్చింది. భార్య చనిపోయాక, బిడ్డల సంరక్షణలో ఏ లోపం రాకుండా చూసుకున్నప్పటికీ జీవితం మీద నిరాసక్తత కలిగింది జగన్నాథం గారికి. ఆదర్శభావాలు, ఆశయాలున్న ఆయన సంఘసేవ మీద తన దృష్టి మళ్ళించారు. అనాథ సేవా సదనం, వర్ణాంతర వివాహాలు నిర్వహించారు.

విద్యావంతుడు, ఆదర్శభావాలున్న చురుకైన వాడు, సమాజ సేవ కార్యక్రమాలు నిర్వహించే ఓ వ్యక్తి, కాలేజీలో చదువుతున్నప్పుడే సుభద్రను ఆకర్షించాడు. అతడి పరిచయం ప్రేమగా పరిణమించింది. అతడితో కలిసి పెళ్ళిపీటలు ఎక్కాలని కాంక్షించింది సుభద్ర. తండ్రి అభ్యంతరపెట్టడనే నమ్మకంతో తమ ప్రేమ విషయం నిస్సంకోచంగా తండ్రికి తెలియజేసింది. జగన్నాథం గారికి సుభద్ర వర్ణాంతర వ్యక్తిని ప్రేమించినందుకు బాధపడలేదు. అయితే వారిది మోహమా? నిజమైన ప్రేమేనా? సుభద్రకు అతగాడు తగిన వాడేనా? అనే ఆలోచనలో మౌనంగా ఉన్నారు.

ప్రభాకర్ సమాజ కార్యక్రమాల్లో పాల్గొనే విధానం జగన్నాథం గారికి అతని పట్ల ఇష్టం, గౌరవం కల్గించింది. అతని వివరాలు తెలుసుకున్నారు. అనాథ శరణాలయంలో పెరిగిన వ్యక్తి కావటం వల్ల అతనికి అందర్నీ తనవారిగా చూడగల మంచి లక్షణం ఉండటం, సహనం, ఉదారత్వ ప్రవర్తన అతనిలో ఉన్న గౌరవించదగ్గ గుణాలుగా గుర్తించి వారిద్దరి వివాహానికి సిద్ధపడ్డారు జగన్నాథం.

కానీ సుభద్రను ఒక అనాథకిచ్చి చేయటం, తన ఆదర్శాన్ని ఇంట్లో కూడా ప్రవేశపెట్టడం విక్రమ్, వాసులకు నచ్చలేదు. తమ అయిష్టం, అభ్యంతరం స్పష్టంగా తెలియజేశారు. వారి అంగీకారాన్ని తోచిపుచ్చి సుభద్ర, ప్రభాకర్‌ల వివాహ ప్రయత్నాలు ముందుకు తీసుకెళ్ళారు జగన్నాథం.

చెల్లెలి పెళ్ళి అని కూడా ఆలోచించకుండా తమ తిరస్కారం తెలియజేస్తూ ఉద్యోగాల ట్రాన్స్‌ఫర్ వంక పెట్టి భార్యాబిడ్డలతో సహా వెళ్ళిపోయారు విక్రమ్, వాసు. తన కారణంగా అన్నదమ్ములు, తండ్రి విడిపోవటం సుభద్రకెంతో దుఃఖం కలిగించింది. జగన్నాథం గారే కూతురికి ధైర్యం చెప్పారు. తన నిర్ణయం ఓ ప్రేమజంట భవిష్యత్తుకు పూలబాట వేస్తున్నప్పుడు ఎదిగిన కొడుకులు ఏదో వంక పెట్టి తనకు దూరంగా వెళ్ళిపోయారని బెంగపడడం అనవసరం అనుకున్నారాయన.

ఇన్ని సంవత్సరాల్లో అప్పుడప్పుడు తండ్రి దగ్గరకు వచ్చినా సుభద్ర ప్రస్తావన మాత్రం తీసుకొచ్చేవారు కాదు అన్నదమ్ములు. అర్థం చేసుకోలేని మూర్ఖులు అనుకుని ఇన్నాళ్ళూ తనూ వాళ్ళ వైఖరిని పట్టించుకోనట్లే ఉండిపోయారు జగన్నాథం.

కొంతకాలం క్రితం సుభద్ర తండ్రి దగ్గరికి వచ్చి, తన కూతురు శోభన, వాసు అన్నయ్య కొడుకు రఘు ఇద్దరూ మెడికల్ కాలేజీలో క్లాస్‌మేట్స్ అనీ లవ్‌మేట్స్ కూడా అనీ చెప్పింది. కానీ ఇన్ని సంవత్సరాలుగా తన సంగతే పట్టించుకోని అన్నయ్య తమతో వియ్యమందటానికి అంగీకరిస్తాడా? అలాగని వారి ప్రేమను తుంచి వేయగలమా? అది న్యాయం అవుతుందా? సాధ్యపడుతుందా? ఎదిగిన పిల్లలు పెద్దల ఆశీర్వాదం లేకుండా ఒక్కటి కావటం మన పెద్దరికానికే వెలితి కాదా?! నా పెళ్ళి విషయంలో జరిగిందే మళ్ళీ మన కుటుంబంలో జరిగితే...? పరిపరి విధాలుగా ఆలోచిస్తూ, "నాన్నగారూ! అందరికీ ఆమోదయోగ్యంగా ఆ జంటను వివాహ వేదిక మీదికి చేర్చగల్గుతారా? అంతా మీ చేతుల్లోనే ఉంది" అంటూ సమస్యను విడమర్చి చెప్పింది.

***

విక్రమ్, వాసు తనను చూడటానికి వచ్చిన తర్వాత జగన్నాథం గారు అందర్నీ సమావేశపరిచారు. తన అనారోగ్య కారణంగా ఆస్తి పంపకాలు చేస్తున్నానని, మంచి మనసుతో అందరూ తన నిర్ణయానికి బద్ధులు కావాలని, కాని పక్షంలో ఆస్తి అంతా వృద్ధాశ్రమానికే చెందుతుందని స్పష్టంచేశారు.

ఆస్తి అంతా నా కష్టార్జితం కావటం వల్ల నా బాగోగులు చూస్తున్న సుభద్ర, ప్రభాకర్‌ల కూతురు, నా మనవరాలు శోభనకు కూడా సగం ఆస్తి చెందుతుందని, మిగతా సగం ఆస్తి మూడు భాగాల్లో కొడుకులిద్దరికీ  చెరోభాగం, ఒక భాగం వృద్ధాశ్రమానికి చెందుతుందని తెలిపారు. నా తదనంతరం అందరి సమక్షంలో లాయరు విల్లు వివరాలు చదువుతాడని తెలియజేశారు.

మొత్తం ఆస్తి తమపేరిట రాస్తారనుకున్న విక్రమ్, వాసు.. తండ్రి ఆ విధంగా ఆస్తి పంపకాలు చేయటం అన్యాయంగా భావించారు. తండ్రి తమ పట్ల చూపించినది ముఖప్రీతి మాత్రమేనని తలచి సమావేశం జరుగుతున్న గదిలో నుండి అలిగి వెళ్ళిపోయారు. మరురోజే ప్రయాణమయ్యారు. తండ్రితో "నాన్నగారూ! మేం వెళ్తున్నాం. మొదటి నుండి మీరు అక్క పక్షమే ఉన్నారు. మేం పేరుకు మాత్రమే కొడుకులం అని నిష్ఠూరమాడారు."

అది మాత్రం నిజం రా. పేరుకు మాత్రమే మీరు కొడుకులు" అన్నారు జగన్నాథం.

కవిత

## స్వప్నం నుంచి రహస్యంగా ...!!

నే వెళ్లేసరికి అక్కడ ఎవరూ లేరు
అదిగో అప్పటి జ్ఞాపకాలు ..
నిన్నటివరకు అనుభవించిన కలలు ...
కొన్ని విరబూసిన నవ్వులింకా తాజాగానే
వున్నాయి ..

ఏ పరిష్వంగం నుంచి విడిపడిందో
నేనయితే ఖచ్చితంగా చెప్పలేను గానీ,
ముక్కలైన స్వప్నం ఒకటి
ఓదార్పు కోసం ఎదురుచూస్తూ వుంది
పరవళ్లు తొక్కుతున్న నదిని ముట్టుకుని
కొన్ని ప్రేమలేఖల్ని వదిలాను ..
ఏదో ఒక ఒడ్డున అవి తప్పక పుష్పిస్తాయని
తెల్సు ...

***

నే వెళ్లే సరికి ... నిజంగానే అక్కడెవరూ లేరు

దివ్య రాగ మొకటి వేణువు నుంచి విడిపడి
జ్వలిస్తున్న హృదయం లోకి చేరాలని
తపనతో నిరీక్షిస్తూ కూర్చుంది ..
నువ్వొచ్చి  వెళ్లావన్నట్లు గుర్తుగా
నీ దేహపరిమళం ప్రాణదేహాల్ని
మంత్ర ముగ్ధంగా చుట్టుకుంటూనే వుంది
నన్ను నేను పోగొట్టుకున్న చోట
నువ్వో, నేనో తప్పక చిగురించి ఉంటామని
స్వప్నం నుంచి రహస్యంగా నడిచి వెళ్లాను ...
నే వెళ్లేసరికి ... నిజంగానే అక్కడెవరూ లేరు..??

—డా పెరుగు రామకృష్ణ
సెల్: 98492 30443

"విక్రమ్, వాసూ! ఆనాడు వెళ్ళిపోయిన వారు ఈనాడు కనిపించారు. ఈనాడు వెళ్తున్న మీరు మళ్ళీ వచ్చేదెప్పుడో నిర్ణయించుకునే వెళ్తున్నారు. కాని ఒక నిజం మాత్రం గుర్తుంచుకోండి. తల్లిదండ్రులు, అక్క చెల్లెళ్ళు, అన్నదమ్ములు... ఏ బంధాలైనా ఆస్తులకోసమో, డబ్బు కోసమో కాదు; ఆత్మీయత అనుబంధాల కోసమే. నన్ను ధిక్కరించి ప్రవర్తించడం కాదురా, ముందు తరానికి మీరు మార్గం చూపిస్తున్నారని గ్రహించుకోండి" ఆవేదనగా అన్నారు జగన్నాథం.

మాట్లాడకుండా బయటికి నడిచిన ఆ అన్న దమ్ములు వెళ్ళింది ఊరికి కాదు, ఆ ఊరి చెరువు గట్టు మీదకి.

"వాసూ! నువ్వేమీ అనుకోకపోతే నాకో ఆలో చన వచ్చింది" అన్నాడు విక్రమ్. "చెప్పు" అన్నట్టు చూశాడు వాసు. "ఏంలేదు; ఆ కాలంలోనే నాన్న గారు చాలా అడ్వాన్స్‌డ్‌గా ఉన్నారు. అప్పుడు మనం అలిగి వెళ్ళిపోయినా, కోరుకున్న వాడితోనే సుభద్ర పెళ్ళి జరిపించారు. ఇప్పుడు కాలం మారింది. ఎంతో మంది తల్లిదండ్రులు కులమతాల పట్టింపు లేకుండా మన కళ్ళముందే తమ పిల్లల ప్రేమ వివాహాలు చేస్తున్నారు. అనుకునే వాళ్ళుంటే, ఓ నాల్గు రోజులు అనుకుంటారు. తర్వాత మర్చిపో తారు. సమాజం ఎంతో మారిపోయిందిరా" ఆలోచ నగా అన్నాడు విక్రమ్.

"ఇంతకీ ఏమిటి? ఆస్తి గురించిన ఆలోచనతో తికమక పడ్తుంటే కులాలు, మతాలు అంటూ ఉప న్యాసమిస్తున్నావు?" విసుగ్గా అన్నాడు వాసు.

"తొందరపడకురా! ఆ విషయానికే వస్తున్నా. సుభద్ర కూతురు, రఘు ప్రేమించుకున్నారని తెలిసి రఘుకి గట్టిగా వార్నింగ్ ఇచ్చావు. నిదానంగా ఆలోచిస్తే సుభద్ర మన తోడబుట్టినదే కదా. ఈ ఇంటి ఆడబడుచు. శోభన కూడా ఈ ఇంటి మనవ రాలే. బావగారిదైనా మరీ తక్కువ కులమేమీ కాదు. వారిది ఏనాడో జరిగిన వివాహం. ఆ విషయం పక్కనపెట్టి శోభన, రఘుల వివాహానికి మనం అంగీకరిస్తే... వారి ప్రేమ వివాహాన్ని సమ ర్థించిన వాళ్ళమూ అవుతాం. సుభద్రకు ఉన్నది ఒక్కతే కూతురు కావటంవల్ల మనం తోడబుట్టిన దానితో సంబంధం కలుపుకున్న వాళ్ళమూ అవుతాం. ఆ విధంగా సగం ఆస్తి నీకు దక్కుతుంది. నీ భాగమూ నీకు దక్కుతుంది. ఇక నా వాటా, వృద్ధా శ్రమ నిర్వహణ బాధ్యత తీసుకున్నట్లయితే నాన్న గారికి సంతోషం కలుగుతుంది. మరి ఆయన తద నంతరం వృద్ధాశ్రమ నిర్వహణ సంగతి...!" అర్ధోక్తిలో ఆగిపోయాడు విక్రమ్. విక్రమ్ పదునైన ఆలోచనకు ఆశ్చర్యపోతూ, "విక్రమ్! నీ బుర్ర పాదరసం రా! నువ్వు చెప్పినట్లు చేస్తే నాన్నగారి పంపకాన్ని ఒప్పు కున్న వాళ్ళమూ అవుతాం, శోభన, రఘుల వివాహం జరిపించి అందరిలోనూ మంచిపేరు తెచ్చుకుంటాం" విక్రమ్‌ను అభినందిస్తూ అన్నాడు వాసు.

ఆ తర్వాత తండ్రి మాట మన్నిస్తున్నట్లుగా తమ ప్రయాణం వాయిదావేసి ఆయనకు ఆరోగ్యం కుదుటపడే వరకు ఇక్కడే ఉంటామనీ తమను క్షమించమనీ తండ్రిని అడిగారిద్దరూ. ప్రస్తుతం తన ఆరోగ్యం బాగానే ఉందని, అనారోగ్యం కలిగితే కబురు చేస్తానని వారికి పంపించేశారు జగన్నాథం. ఆయనకు తెలుసు కొడుకులిద్దరూ ఎటువంటి ఆలో చన చేస్తారో.

"అన్నీ సర్దుకుంటాయి. నువ్వూ వెళ్ళమ్మా. ప్రస్తుతం నాకు బాగానే ఉంది. శోభన ఉంది కదా" అని సుభ ద్రను కూడా పంపించేశారు.

***

సుభద్ర ఓ రోజు తండ్రికి ఫోన్ చేసింది. వాసు అన్నయ్య మార్కెట్లో కలిసినప్పుడు పలుకరించా డని, ఒకసారి బావగార్ని ఇంటికి తీసుకురమ్మని ఆహ్వానించాడని, అన్నీ మర్చిపోయి సంతోషంగా ఉందామని, అందువల్ల నాన్నగారు సంతోషిస్తార న్నాడని చెప్పింది.

జగన్నాథం గారు నవ్వుకున్నారు. కొడుకు సుభద్ర దంపతులను ఎందుకు ఆహ్వానించాడో అనుభవజ్ఞుడు అయిన ఆయన ఊహకు అందనిది కాదు. మను షులను ఆత్మీయతానుబంధాల కంటే ఆర్థిక సంబం ధాలే దగ్గర చేస్తున్నాయనే సంగతి ఆయన ఎప్పుడో గ్రహించారు. వాసు కుటుంబంతో సహా వచ్చి, శోభన రఘుల వివాహాన్ని పెద్దవారుగా, ఆదర్శవంతులుగా ఆశీర్వదించాలని కోరాడు. పక్కున నవ్వేశారు జగ న్నాథం. అర్థం చేసుకున్న వాసు తల దించుకున్నాడు.

***

కొంతకాలానికి జగన్నాథం గారు కాలం చేశారు. కర్మకాండ అట్టహాసంగా జరిపించారు కొడుకులు. గోదాన, భూదాన సువర్ణ దానాలిచ్చి బ్రాహ్మణు లను తృప్తిపరిచారు. ఊరందరికి బంతి పెట్టారు. తండ్రిపేరున ఆదర్శ వివాహాలు జరిపించటానికి ఒక ట్రస్టు ఏర్పాటుచేస్తున్నట్టు ప్రకటించారు. తండ్రి ఆదర్శం నిలబెడుతున్న విక్రమ్, వాసులు తండ్రికి తగ్గ తనయులని అందరూ హర్షించారు. చివరి రోజున అందరి సమక్షంలో లాయరుగారు జగన్నాథం గారు వ్రాయించిన వీలునామా చదివారు. 'తన యావదాస్తినీ వృద్ధాశ్రమానికి ఇస్తున్నట్లు గానూ, సుభద్ర భర్త ప్రభాకర్‌కి అజమాయిషీ అప్పగిస్తున్న ట్టుగానూ, ఇది ఇష్టపూర్వకంగా వ్రాస్తున్న వీలు నామా' అనీ పేర్కొన్నారు. చివరగా జగన్నాథం గారి సందేశం కూడా వినిపించారు లాయరుగారు.

## ఈ ప్రేమ కథ కంచికేనా?

కథలు కంచికి చేరతాయో లేదో కానీ బాలీవుడ్‌లో ఓ ప్రేమ కథ కంచికి చేరిందంటున్నారు అక్కడి జనాలు. రణవీర్, దీపికల ప్రేమ వ్యవహారం ఈనాటిది కాదు. ఇద్దరూ చాలా కాలంగా ప్రేమలో ఉన్నారు. దీపిక బాలీవుడ్ నుంచి హాలీవుడ్‌కి వెడితే రణవీర్ స్టార్ హీరో స్థాయికి ఎదిగాడు. రణవీర్ ఎంత ఎదిగినా, దీపికను అందుకోవడం కష్టమే అవుతోందట! హాలీవుడ్‌లో బిజీ అయిన తరువాత దీపిక బాలీవుడ్ వైపు చూడడం గగ నమైపోతోంది. ఆఖరికి కుటుంబానికి కూడా టైం ఇవ్వ లేకపోతోంది. అలాంటప్పుడు లవర్‌ని ఎలా కలు స్తుంది? నెలలకు నెలలు కలవకుండా దూరంగా ఉండడం కన్నా విడిపోతే బెటర్ అంటోందిట దీపిక. దీపిక మాటల్లో నిజం ఉన్నా తనతో బంధాన్ని అంత త్వరగా తెంచుకోలేకపోతున్నాడట రణవీర్. ఇక తమ మధ్య సంబంధం కొనసాగడం కష్టమేననీ, ఎవరి దారి వారు చూసుకుందామనీ దీపిక రణవీర్‌కి స్పష్టం చేసిందట కూడా! దీపిక విషయంలో రణవీర్ ఎంతగా సర్దుకుపోతున్నా దీపిక ఈ నిర్ణయం తీసు కోవడం బాధాకరమంటున్నారు బాలీవుడ్ జనాలు.



"ఏ సంతానమైన పిత్రార్జితాలపై ఆశలు పెంచుకోకుండా స్వార్జితంతో జీవితాన్ని తీర్చిదిద్దు కోవాలని, వీలైనంతవరకు సమాజసేవలో భాగం పంచుకోవాలని నా సలహా.

పిత్రార్జితాల మీద కోరిక మనిషిలో ప్రలో భాన్ని, అత్యాశను కలిగిస్తుంది. కష్టపడాలనే సంక ల్పానికి దూరం చేస్తుంది. అందుకే నేను ఈ నిర్ణయం తీసుకున్నాను అని".

తండ్రి వీలునామా విన్న విక్రమ్, వాసుల ముఖంలో కత్తివేటుకు నెత్తురు చుక్కలేదు. సుభద్ర మాత్రం నిశ్చింతగా నవ్వుకుంది. తండ్రి అంతకు ముందు, ఫలానా విధంగా ఆస్తి పంపకం చేస్తు న్నట్టు అందరి సమక్షంలో ఎందుకు ప్రకటన చేశారో గ్రహించుకుంది.

నాన్నగారూ! మీరెంతో ఉన్నతులు, ఉత్తములు. మరో ప్రేమ జంటను ఈ కాలపు బాణిలో కలిపిన 'ఆదర్శ మూర్తులు' అని సుభద్ర మనసులోనే తండ్రికి నమస్కరించుకుంది.

*సెల్: 92467 94120*




పుస్తకావిష్కరణ దృశ్యం: ఎడమ నుండి స్వర్ణకుమారి, శ్రీరమ్య, వక్కంతం వంశీ, ఎ.ఎన్.జగన్నాథశర్మ, వక్కంతం సూర్యనారాయణరావు, సౌనాక్ సురానా, డిప్తి పటేల్, బేబీ ఆర్వి

## అష్టాదశ పురాణాల పరిశోధనా రచన

# నవగ్రహపురాణం ఆంగ్లానువాదం పుస్తకావిష్కరణ

**తెలుగు రచనలు ప్రపంచంలో దేనికీ తీసిపోవు. కొండొకచో ఇంకా ఉన్నత ప్రమాణాలతో కూడిన రచనలనవచ్చు కూడా. కానీ తెలుగు రచనలు భారతీయ భాషలతో సహా ఆంగ్ల భాషల్లో అడపాదడపా వచ్చినప్పటికీ, తెలుగు నుండి అనువాదాలు ఇబ్బడిముబ్బడిగా వెళ్ళక పోవడంవల్ల మన రచనల గొప్పతనం, ఆ విలువ దశాబ్దాలు గడిచినా ప్రపంచదేశాల్లో ఎక్కువ గుర్తింపు రాలేదు.**

కానీ ప్రముఖ నవలా కథా రచయిత వక్కంతం సూర్యనారాయణరావు (వి.ఎస్.రావు) గారి 'నవగ్రహపురాణం' పుస్తకానికి ఈ తాజా అవకాశం లభించింది. వి.ఎస్.రావు ఆంగ్లంలోకి అనువదించిన ఈ పుస్తకాన్ని ప్రముఖ ఆంగ్ల ప్రచురణ సంస్థ 'జైకో' ప్రచురించింది.

ఆంధ్రజ్యోతి ప్రచురణ నవ్య వారపత్రికలో మొట్ట మొదట ధారావాహికంగా వెలువడిన 'నవగ్రహ పురాణం' అనూహ్యమైన పాఠకాదరణ పొందడమే కాదు, పుస్తకరూపంలో కూడా హాట్ కేకుల్లా అమ్ముడు పోయింది. ఇప్పుడు ఆంగ్లంలో ప్రచురితమైన 'Navagraha Purana' (Tales of the Nine Planets) పుస్తకావిష్కరణ సభ హైదరాబాద్ ఫిలిమ్ నగర్‌లోని తెలుగు ఫిలిమ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్ హాలులో మార్చి 2వ తేదీ గురువారం సాయంత్రం జరిగింది. ఈ సభకు గౌరవ అతిథిగా హాజరైన ప్రముఖ రచయిత, నవ్య వీక్లీ సంపాదకులు ఎ.ఎన్.జగన్నాథశర్మ ఈ పుస్తకాన్ని ఆవిష్కరించి తొలి ప్రతిని చిరంజీవి బేబీ ఆర్వికి అందజేశారు.

మంచి భాష, భావం, నాటకీకరణ, వాక్య నిర్మాణ దక్షత గల రచయితగా వక్కంతం సూర్యనారాయణ రావు నవ్య వీక్లీలో గృహిణులను ఆకట్టుకునేలా రాసిన 'నవగ్రహపురాణం' సీరియల్ పెద్ద హిట్ అయిందని, ఆయన రచనలన్నీ పాఠకజన రంజకమైనవేనని జగన్నాథశర్మ ఈ సందర్భంగా అన్నారు. చదువరులకు హాయిగొలిపే భాషలో ఎన్నో నాటకాలు, కథలు, నవలలు రాసి ఎలాంటి రచనలైనా చేయగలరని వక్కంతం నిరూపించుకున్నారని ప్రశంసించారు. బెంగాలీ రసగుల్లలాంటి చక్కటి భాష రాసే వక్కంతం సూర్యనారాయణరావును నిలువెత్తు తెలుగు వర్ణపటంగా అభివర్ణించారు.

### హాలీవుడ్ సినిమా స్క్రిప్ట్ రెడీ

ఒక మంచి తెలుగు పుస్తకాన్ని ప్రపంచ పాఠకులు చదవాలనే ఉద్దేశంతోనే ఈ పుస్తకాన్ని 'జైకో' ఆంగ్లంలో ప్రచురించిందన్నారు ప్రముఖ సినీ రచయిత వక్కంతం వంశీ.

ఎన్నో హాలీవుడ్ చిత్రాలకు అసోసియేట్ స్క్రిప్ట్ రైటర్‌గా పనిచేసిన లాస్‌ఏంజెల్స్‌కు చెందిన ఫేమస్ రైటర్ పామెలా పెర్రీ ఈ నవగ్రహ పురాణాన్ని సినిమా స్క్రిప్టుకు అనుగుణంగా సిద్ధం చేశారన్నారు. దీనిని సినిమాగా తీస్తే 'లార్డ్ ఆఫ్ ద రింగ్స్' అంతటి extraordinary film కాగలదన్నారు. ఇదొక గొప్ప సినిమాగా వస్తుందని, తెలుగులో కూడా ఇదొక వెండితెర కావ్యం కాగలదన్నారు. కులమత భాషాభేదాలకతీతంగా అందరికీ రీచ్ అయ్యే అసాధారణమైన నాటకీయతగల ఈ పుస్తకాన్ని చదువరులు బాగా ఎంజాయ్ చేస్తారన్నారు. 75 ఏళ్ళ వయసులో కూడా రచయిత ప్రతిపూటా కలంపట్టి రచనా వ్యాసంగం చేయడం గొప్ప అదృష్టమన్నారు.




**పుస్తకం వివరాలు**

V.S.RAO
**Navagraha purana**
Tales of the Nine Planets
Edited by
Preetha Rajah Kannan
Price: 399 rupees
Pages: 432
For copies All leading book shops
www.jaicobooks.com

# ఏడేళ్ళ పరిశోధనా ఫలితం నవగ్రహపురాణం

అష్టాదశ పురాణాలలో అక్కడక్కడ ఉన్న నవగ్రహాల చరిత్రను వక్కంతం సూర్యనారాయణరావు ఏడు సంవత్సరాల పరిశోధనతో క్రోడీకరించి ఒక పురాణ గాథగా మలిచారని సభను నిర్వహించిన సినీ కథారచయిత్రి ఉమర్జీ అనూరాధ చెప్పారు.



భారతదేశ ప్రజలందరూ నవగ్రహాలు, వాటి కదలికలను నిత్యం తమ జీవితాలకు అన్వయించుకుంటారనీ, ప్రజలు విశ్వసించే నవగ్రహాల చరిత్ర భారతీయ సాహిత్యంలో ఎంతో ఉన్నతమైనదనీ అన్నారు. అందుకే జైకో సంస్థ తమ విధాన సంప్రదాయాలకు భిన్నంగా ఈ రచనను గంటల వ్యవధిలో ప్రచురణకు చేపట్టిందన్నారు. 2010లో నవ్య వీక్లీలో వెలువడిన ఈ నవగ్రహపురాణం, పాఠకులను విశేషంగా ఆకట్టుకుందన్నారు. తెలుగులో రెండు పునర్ముద్రణలతో లక్ష ప్రతుల విక్రయాలు సాధించిందన్నారు.

ఆంగ్లంలో ప్రీత రాజ్ కన్నన్ ఈ పుస్తకానికి సంపాదకత్వం వహించారన్నారు. పురాణేతిహాస రచనలకు పెట్టిందిపేరుగా నిలిచిన జైకో సంస్థ ఒక తెలుగు పుస్తకాన్ని ఆంగ్లంలోకి ప్రచురించడం ఇదే మొదటిసారి కావడం రచయితకు గర్వకారణమన్నారు. ఈ సంస్థ అయిదు లక్షల ప్రతుల విక్రయాలు లక్ష్య నిర్దేశం చేసుకుందన్నారు. హాలీవుడ్ అసోసియేట్ స్క్రిప్ట్ రైటర్ పామెలా పెర్రీ ఈ నవగ్రహ పురాణం చదివి ఎంతో స్ఫూర్తిపొంది, సైన్స్ ఫిక్షన్ థ్రిల్లర్‌గా తీర్చిదిద్దాల్సిన అవసరం ఉందని భావించారన్నారు. ఆమె స్వచ్ఛందంగా ముందుకు వచ్చి బిగ్ స్క్రీన్ వెర్షన్ స్క్రిప్ట్ తయారుచేశారని చెప్పారు.

## రాబోయే తరం వదలకుండా చదివే పుస్తకం

రచయిత వక్కంతం సూర్యనారాయణరావు ఇప్పటివరకు 84 పుస్తకాలు రాయడం ఆషామాషీ కాదన్నారు జైకో లిటరరీ ఏజెంట్ దీప్తీ పటేల్.



ఆయన రచనల్లో ఎంతో డ్రామా, సస్పెన్స్, థ్రిల్లర్ ఉంటుందనీ, తెలుగు భాషకు ఆయనొక వరంలా లభించారనీ అన్నారు. ఆమె ఇంకా ఇలా అన్నారు. 'ఈరోజుల్లో మనం ఆలయానికి వెళతాం. అక్కడ దేవుళ్ళ విగ్రహలుంటాయి. మనం ప్రదక్షిణలు చేస్తాం. కానీ ఆ దేవుళ్ళ పేర్లు మనక్కూడా సరిగ్గా తెలియక పోయినా దర్శనం చేసుకుని వచ్చేస్తాం. ఈ తరం పిల్లలకు దేవుళ్ళపేర్లు అస్సలు తెలియవు, దేవుళ్ళ కథలు తెలియవు, నవగ్రహాలంటే ఏమిటో, అవి ఎలా పుట్టాయో ఎవరికీ తెలియదు. కానీ ఈ పుస్తకంలో ఆ సమాచారం మొత్తం ఉంది. రాబోయేతరం ఈ పుస్తకాన్ని వదలకుండా చదువుతుంది. వారికి ఇదెంతో అవసరమైన పుస్తకం' అన్నారు దీప్తీ పటేల్.

## ప్రామాణిక గ్రంథం

'నవగ్రహ పురాణం' ఎప్పటికీ ఒక ప్రామాణిక గ్రంథంగా, గొప్ప కావ్యంగా మిగిలిపోతుందని జైకో సంస్థ మార్కెటింగ్ హెడ్ సోనాల్ సురానా అన్నారు.



తమ సంస్థ ఎంతో గర్వంగా పాఠకులకు ఈ పుస్తకం సమర్పిస్తోందన్నారు. దేశంలోని పది నగరాల్లో రెండు వేల టైటిల్స్‌తో తమ సంస్థ బుక్ మార్కెటింగ్ చేస్తోందన్నారు. రాబిన్ శర్మ, ఓషో, సద్గురు వంటివారి రచనలతోపాటు ప్రాంతీయ సాహిత్యాన్ని కూడా ప్రోత్సహిస్తోందనీ, అందుకే ఈ అద్భుత రచనను ఆంగ్లంలోకి ప్రచురించిందని చెప్పారు.

## ఆంధ్రజ్యోతి యాజమాన్యానికి ధన్యవాదాలు

నవగ్రహ పురాణం పుస్తక రూపంలో వెలువడటానికి కారకులైన ఆంధ్రజ్యోతి మేనేజింగ్ డైరెక్టర్ వేమూరి రాధాకృష్ణ, నవ్య వీక్లీ సంపాదకులు ఎ.ఎన్.జగన్నాథశర్మలకు పుస్తక రచయిత వక్కంతం సూర్యనారాయణరావు ధన్యవాదాలు తెలియజేశారు. ఈ సందర్భంగా వక్కంతం సూర్యనారాయణరావు, ఆయన సతీమణి శ్రీమతి స్వర్ణకుమారిల 46వ వివాహ వార్షికోత్సవం సందర్భంగా జగన్నాథశర్మ, వక్కంతం వంశీ వారిని శాలువాతో సత్కరించారు. నటి, మోడల్, ప్రముఖ యాంకర్ శ్రీవిద్య వక్కంతం వేదికపై ఆశీనులయ్యారు. తొలుత యోగి వక్తలను వేదికపైకి ఆహ్వానించారు.

—రామ్మోహన్

## ఎలాంటి బుక్స్ చదువుతున్నారంటే?

ఇంటర్‌నెట్‌లో సమస్త సమాచారం అందుబాటులోకి వచ్చినా సిటీ జనులకు పుస్తక పఠనంపై మక్కువ ఏమాత్రం తగ్గట్లేదు.. ఇంటర్నెట్‌లో పుస్తకాలు అందుబాటులో ఉన్నా పఠనాభిలాషులు ప్రత్యక్షంగా పుస్తకాలు చదివేందుకే ఆసక్తి చూపిస్తున్నారు.. ఇందుకోసం



దేశవ్యాప్తంగా రీడింగ్ హాబిట్స్ ఎలా ఉన్నాయో తెలుసుకోవడానికి 'టాటా లిటరేచర్ లైవ్' పేరుతో నిర్వహించిన ఓ సర్వేలో ఈ విషయం వెల్లడయింది. ఈ సర్వేలో వెల్లడయిన పలు ఆసక్తికర అంశాలు మీకోసం...

60 శాతం భారతీయులు వారంలో ఒక రోజు విశ్రాంతి కోసం మంచి పుస్తకం చదువుతున్నారు. 38 శాతం పురుషులు పుస్తకాన్ని ఒక తోడుగా భావిస్తుంటే, 46 శాతం మంది స్త్రీలు ప్రయాణంలో చదవడానికి ఎంచుకుంటున్నారు. 48 శాతం మంది స్త్రీలు ఇండియన్స్ రాసిన రొమాన్స్ పుస్తకాల కన్నా నాన్ ఇండియన్స్ రాసిన రొమాన్స్ పుస్తకాలు చదవడం ఎంజాయ్ చేస్తున్నారు. ఇతర వయస్సుల వారితో పోల్చితే 24 ఏళ్ళలోపు వారిలో 74 శాతం మంది పుస్తకాలు ఎక్కువ చదువుతున్నారు. ఏమీ పాలుపోని రోజున పుస్తకాలు చదవడం మంచి మార్గంగా ఉపయోగపడుతుందని 49 శాతం మంది భారతీయ స్త్రీలు అంటున్నారు. 38 శాతం మంది పురుషులు మాత్రమే బ్యాడ్ డే నుంచి బయటపడటానికి బుక్స్ ఉపయోగపడతాయని భావిస్తున్నారు. 68 శాతం మంది కొత్త విషయాలు తెలుసుకునేందుకు పుస్తకాలను చదువుతున్నట్లు తేలింది. అలాగే 38 శాతం మంది ఒత్తిడిని తగ్గించుకునేందుకు 42 శాతం మంది అలవాటు ప్రకారం పుస్తకాలు చదువుతున్నారు. విజ్ఞానదాయకమైన అంశాల కోసం 48 శాతం మంది పుస్తకాలను ఆశ్రయిస్తున్నట్లు వివరించారు. ఆధ్యాత్మిక పుస్తకాలు చదివేవారి సంఖ్య 24 శాతం మాత్రమే ఉంది. ఆధునిక పరిజ్ఞానం అందుబాటులోకి వచ్చిన తర్వాత కూడా ముద్రిత పుస్తకాలు ఎందుకు కొనుగోలు చేస్తున్నారన్న ప్రశ్నకు ప్రత్యక్షంగా చదవడం వల్ల ఏకాగ్రత పెరుగుతుందని 56 శాతం మంది సమాధానమిస్తున్నారు.



## మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, రుణప్రయత్నాలు, విద్యా విషయాలు, సమావేశాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధవారం వేడుకల్లో పాల్గొంటారు. భాగస్వామికి సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. 16, 17 తేదీల్లో గత అనుభవాలతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. సంస్మరణల్లో పాల్గొంటారు. 18, 19, 20 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. శుభకార్యాల్లో పాల్గొంటారు. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. 21న వృత్తి వ్యాపారాల్లో నిరుత్సాహకరంగా ఉంటుంది. ఉన్నత పదవులు అందుకుంటారు. ఆర్థిక విషయాల్లో పెద్దల సహకారం లభిస్తుంది.



## వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

వేడుకలు, పెట్టుబడులు, ఉన్నత విద్య, సమావేశాలు, బృంద కార్యక్రమాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం బంధుమిత్రులతో విందు వినోదాల్లో పాల్గొంటారు. కొత్త పరిచయాలు లక్ష్య సాధనకు ఉపకరిస్తాయి. 16, 17 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. పోటీల్లో విజయం సాధిస్తారు. 18, 19, 20 తేదీల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. షేర్లు, బ్యాంకులావాదేవీలు లాభిస్తాయి. 21న బంధుమిత్రుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. ఖర్చులు అధికం. ఆర్థిక విషయాల్లో మీ అంచనాలు తప్పే అవకాశం ఉంది.



## మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, శ్రీవారు, శ్రీమతి విషయాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం వృత్తి వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. చిన్నారుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. 16, 17 తేదీల్లో ఉద్యోగ వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. పెద్దల ఆరోగ్యం కలవరపెడుతుంది. ఉన్నత పదవులు అందుకుంటారు. 18, 19, 20 తేదీల్లో ప్రముఖులను కలుసుకుంటారు. సమావేశాలు, వేడుకల్లో గౌరవ మన్ననలు అందుకుంటారు. సంకల్పం ఫలిస్తుంది. 21న రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. పూర్వ మిత్రులను కలుసుకుంటారు. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు.



## కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

శుభకార్యాలు, విద్య, ఆర్థిక వ్యూహాలు, సమావేశాలకు ఈ వారం అనుకూలం. బుధవారం రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి ప్రోత్సాహకరం. బంధుమిత్రులతో ఇల్లు సందడిగా ఉంటుంది. 16, 17 తేదీల్లో ఉన్నత విద్యా విషయాల్లో ప్రోత్సాహకరం. చిన్నారులు, ప్రియతముల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. 18, 19, 20 తేదీల్లో సహోద్యోగులతో సమావేశాలు సత్ఫలితాలనిస్తాయి. వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. విందు వినోదాల్లో పాల్గొంటారు. 21న శ్రీవారు, శ్రీమతి వైఖరి ఆవేదన కలిగిస్తుంది. ప్రముఖుల కారణంగా చిక్కులు ఎదురయ్యే అవకాశం ఉంది. వృత్తి, వ్యాపారాల్లో ఆశాభంగం తప్పకపోవచ్చు.



## సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

రుణప్రయత్నాలు, కొనుగోళ్లు, పెట్టుబడులు, చిన్నారుల విషయాలు దూరప్రయాణాలకు ఈ వారం ప్రోత్సాహకరం. బుధవారం విద్యకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. ఆర్థికపరమైన చర్చలు ఫలిస్తాయి. 16, 17 తేదీల్లో ఇంటి కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. రుణ ప్రయత్నాలు ఫలిస్తాయి. సంస్మరణల్లో పాల్గొంటారు. 18, 19, 20 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల కోసం విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. వడ్డీలు, బోనస్‌లు అందుకుంటారు. పన్నుల వ్యవహారాలు పరిష్కారం అవుతాయి. 21న హోటల్, ఆస్పత్రులు, పరిశ్రమల రంగాల వారికి నిరుత్సాహకరం. విందు వినోదాల్లో పరిమితి పాటించాలి.



## కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

కాంట్రాక్టులు, విద్యా విషయాలు, భాగస్వామి విషయాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధవారం పెట్టుబడులు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 16, 17 తేదీల్లో చర్చలు, సమావేశాల్లో తొందరపాటు తగదు. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. జనసంబంధాలు విస్తరిస్తాయి. 18, 19, 20 తేదీల్లో కుటుంబ వ్యవహారాల్లో శుభపరిణామాలు సంభవం. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి సంకల్పం నెరవేరుతుంది. 21న చిన్నారులు, ప్రియతముల ఆరోగ్యం కలవరపెడుతుంది. పన్నుల వ్యవహారాల్లో ఇబ్బందులు ఎదురయ్యే అవకాశం ఉంది.



## తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

ప్రమోషన్లు, ఇంక్రిమెంట్లు, ఉద్యోగ ప్రయత్నాలు, ఇంట్లో వేడుకలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధవారం వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. విందు వినోదాల్లో పాల్గొంటారు. 16, 17 తేదీల్లో అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక విషయాల్లో సహోద్యోగులు మొహమాటపెట్టే అవకాశం ఉంది. ప్రమోషన్లు, ఇంక్రిమెంట్ల కోసం ప్రయత్నిస్తారు. 18, 19, 20 తేదీల్లో ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. సన్నిహితుల ఆరోగ్యం మెరుగుపడుతుంది. వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. 21న భాగస్వామి వైఖరి ఆవేదన కలిగిస్తుంది. రియల్ ఎస్టేట్ రంగంలోని వారు ఆచితూచి వ్యవహరించాలి.




మార్చి 15 నుంచి
మార్చి 21 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



## వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, చిన్నారులు, ప్రియతములు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం విద్యార్థులకు శుభప్రదం. సినీ, రాజకీయ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. 16, 17 తేదీల్లో చిన్నారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ప్రేమానుబంధాలు బలపడతాయి. 18, 19, 20 తేదీల్లో పెట్టుబడులు, పొదుపు పథకాలు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. కొత్త వ్యూహాలు అమలు చేసి ఆర్థికంగా లబ్ధి పొందుతారు. 21న సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. ఇంటర్వ్యూలలో ఆశించిన ఫలితాలు రాకపోవచ్చు.



## ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

గృహారంభ, ప్రవేశాలు, వేడుకలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం సమావేశాలు, వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. 16, 17 తేదీల్లో రియల్ ఎస్టేట్ రంగంలోని వారు ఆచితూచి వ్యవహరించాలి. దూరంలో ఉన్న బంధుమిత్రుల రాకతో ఇల్లు సందడిగా ఉంటుంది. వేడుకల్లో పాల్గొంటారు. 18, 19, 20 తేదీల్లో బదిలీలు, మార్పులకు అనుకూలం. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు కీలక నిర్ణయాలు తీసుకునేందుకు తగిన సమయం. చేపట్టిన పనులు పట్టుదలతో పూర్తి చేస్తారు. 21న ఆర్థిక విషయాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది.



## మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, వేడుకలు, గృహారంభ ప్రవేశాలు, ప్రేమానుబంధాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం ప్రముఖులతో చర్చలు ఫలిస్తాయి. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. 16, 17 తేదీల్లో బృందకార్యక్రమాల్లో మాటపడాల్సి వస్తుంది. జనసంబంధాలు విస్తరిస్తాయి. ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం లభిస్తుంది. 18, 19, 20 తేదీల్లో దూరప్రయాణాలు, చర్చలు ఫలిస్తాయి. రాజకీయ, సినీరంగాల వారు కీలక సమాచారం అందుకుంటారు. విద్యార్థులకు ప్రోత్సాహకరం. 21న బదిలీలు, మార్పులు అసౌకర్యం కలిగిస్తాయి. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు నిదానం పాటించాలి.



## కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వేడుకలు, ఉన్నత విద్యా విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం ఆర్థిక విషయాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 16, 17 తేదీల్లో ప్రమోషన్లు, ఇంక్రిమెంట్లు విషయంలో కొంత నిరుత్సాహానికి లోనవుతారు. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 18, 19, 20 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులు పూర్తవుతాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 21న ఒక సమాచారం కలవరం కలిగిస్తుంది. ప్రయాణాల్లో నిదానం అవసరం. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి.



## మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, వేడుకలు, వృత్తి, వ్యాపారాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం పన్నులు, బీమా, పెన్షన్ వ్యవహారాలపై దృష్టి సారిస్తారు. రుణాలు మంజూరవుతాయి. 16, 17 తేదీల్లో బంధుమిత్రుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. సంకల్పం ఫలిస్తుంది. 18, 19, 20 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో కొత్త వ్యూహాలు అమలు చేసి సత్ఫలితాలు సాధిస్తారు. ప్రముఖులను కలుసుకుంటారు. కొత్త ప్రాజెక్టుల ప్రారంభానికి తగిన సమయం. 21న పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. అంచనాలు తలకిందులయ్యే అవకాశం ఉంది. సమావేశాలకు ఏర్పాట్లు చేస్తారు.

నవ్య

